విశాలాంధ్ర **8-7-1993** గురువారం ప్రత్యేకం

భారతీయ సంస్కృతికి అద్దంపట్టే వ్యాస సంకలనం.

గతాన్ని గురించిన ఘనతను ప్రస్తావించుకోవటం మానవుల సహజ ప్రవృత్తి. ఘనతను కించపరచకుండానే వాస్తవాలను తెలియచెప్పటం చరిత్రకారులపని, బాధ్యత.... శ్రీ హనుమంతరావుగారు అట్టి చరిత్రకారులలో అగ్రగణ్యులు... 1964లో వీరు వ్రాసిన 'భారతీయ సంస్కృతీ వైశిష్ట్యము' అన్న వ్యాసం చదువుతుంటే ఎంతటి దూరదృష్టిని ప్రదర్శించారో బోధపడుతుంది.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .

ఆర్య అనార్య సంస్కృతులు ఘర్షణ పడటంతోపాటు ఆదానప్రదానాల ద్వారా ఉమ్మడి సంస్కృతిగా ఎలా వృద్ధి చెందాయో వివరించటమే ఈ అన్నివ్యాసాలలోని అంతరార్థం. . . . . . . . . . . . . . .

ఈ వ్యాసాలలోని ప్రతి వాక్యమూ, ప్రతిమాట పాఠకుణ్ణి ఆలోచింప చేస్తుంది. మతమౌఢ్యం ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తుంది.

– బలరామమూర్తి

# భారతీయ సంస్కృతి

## ఒక పరిశీలన

ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావు

*Sole Distributors in Andhra Pradesh*
*Please Send Your Orders to:*
VISALAANDHRA PUBLISHING HOUSE,
4-1-435, BANK STREET,
HYDERABAD-500 001

'త్రిపురసుందరి'

బ్రాడీపేట :: గుంటూరు.

భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన

ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావుగారి వ్యాసాల సంకలనం – I

ప్రథమ ముద్రణ : జూన్, 1993 : 500 ప్రతులు

ద్వితీయ ముద్రణ : జూన్, 1994 : 1,000 ప్రతులు

వెల : 20/-



'త్రిపురసుందరి' 5-35-32

3/17, బ్రాడీపేట, గుంటూరు-522 002

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన భవన్, హైదరాబాద్

విశాలాంధ్ర బుక్‌హౌస్, విజయవాడ, సుల్తాన్‌బజార్, హైదరాబాదు, గుంటూ

అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, కాకినాడ మున్నగు అన్ని బ్రాంచీ

ముద్రణ :

కళాజ్యోతి ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్, 1-1-60/5, ఇష్తైకార్ మాన్షన్ రోడ్ ,

ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్), హైదరాబాదు-20.

# ఇందులో....

భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన
ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావుగారి వ్యాసాల సంకలనం – I

ప్రథమ ముద్రణ : జూన్, 1993 : 500 ప్రతులు
ద్వితీయ ముద్రణ : జూన్, 1994 : 1,000 ప్రతులు

వెల : 20/-



**ప్రతులకు :**
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన భవన్, హైదరాబాద్-1.
విశాలాంధ్ర బుక్‌హౌస్, విజయవాడ, సుల్తాన్‌బజార్, హైదరాబాదు, గుంటూరు, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, కాకినాడ మున్నగు అన్ని బ్రాంచీలు.

ముద్రణ :
**కళాజ్యోతి ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్,** 1-1-60/5, ఇఫ్తెకార్ మాన్షన్ రోడ్, ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్, హైదరాబాదు-20.

# ఇందులో....

# ముందుమాట

"There is no expedient to which a man will not resort, to avoid the labour of thinking" అన్నాడు థామస్ ఎడిసిన్ తెలుగులో చెప్పాలంటే, ఆలోచన అన్న కఠిన ప్రక్రియనుండి తప్పించుకోవడానికి మనిషి ఎన్ని అడ్డు దారులయినా త్రొక్కుతాడు. మన దేశంలో విద్యావంతుల్లో కూడ కనిపించే చారిత్రక అవగాహనా లేమి, అంధ విశ్వాసాలు, సమాజాన్ని విభజిస్తున్న కృత్రిమ అడ్డుగోడలు - ఇవన్నీ ఎడిసన్ వాక్కులు అక్షర సత్యాలని రుజావు చేస్తున్నాయి.

కర్మసిద్ధాంతం, వ్యక్తి నిర్వీర్యత, కులాలపేరిట విభజన, మూఢనమ్మకాలు, 'మన' వాళ్ళు వేదపురాణాల కాలాలలో పుష్పక విమానం నుంచి అణుబాంబు దాకా అన్నీ సాధించారన్న కుతర్కం, 'అంటు', 'మడి' భావనలవల్ల ప్రపంచం నుంచి, ఆధునిక భావాలనుండి దూరంగా తొలగడం, మానవుల సమానత్వం పట్ల, వ్యక్తిస్వేచ్ఛ, హుందాతనం పట్ల నమ్మకం, అవగాహన లేకపోవటం - ఇవన్నీ మనల్ని సాంప్రదాయం, ఆచారం అన్న శృంఖలాలలో శతాబ్దాల పర్యంతం బంధించి వేశాయి.

దేవుడున్నాడో లేడో నాకు తెలియదు. కాని 'పాపం' అన్నదాన్ని నిర్వచించమంటే రెండు మహాపాపాలు చప్పున స్ఫురణకు వస్తాయి. మొదటిది - సామర్థ్యం ఉండి అందుకోలేని లక్ష్యం. ఈ దేశంలో లక్షలాది పసిపాపలు తమకు ప్రకృతి యిచ్చిన మేధానంపత్తిని సద్వినియోగం చేసుకునే అవకాశం లేక పేటికాంతర్గత రత్నాలుగా మ్రగ్గుతున్నారు. వారిశక్తి సామర్థ్యాలకు సంప్రదాయం, నిరంకుశ వ్యవస్థ, అసమర్థ పరిపాలన అడ్డుకట్టలు వేస్తున్నాయి. తత్ఫలితంగా వారిమేధస్సు సక్రమ మార్గాన పోక, వెర్రితలలు వేస్తోంది. సమాజంలో హింస, అరాచకత్వం, ఉన్మాదం హెచ్చు పెరుగుతున్నాయి.

మన సమాజంలో పుష్కలంగా ఉన్న రెండవ పాపం - నివారించదగ్గ క్లేశం. బుద్ధుడు గుర్తించినట్లుగ, చాలా క్లేశాలు - ఉదా : 'మరణం' సహజసిద్ధంగా ఉండేదే. అయితే మనకందుబాటులో ఉన్న వనరలు, శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం సాయంతో అధిక సంఖ్యాకుల క్లేశాన్ని చాలావరకు మనం నివారించవచ్చు. నివారించదగ్గ వ్యాధుల వల్ల అకాల మరణం, అంగవైకల్యం, బాధ, అజ్ఞానం, మూఢ విశ్వాసాలవల్ల కలిగే క్లేశం, దుష్పరిపాలనవల్ల కలిగేహింస... వగైరాలను నివారించి ఆనందాన్ని పెంచటం పూర్తిగా మన చేతుల్లో ఉన్నపని.

అయితే మన సామర్థ్యానికి, వనరులకు తగ్గ స్థాయిని చేరుకోవాలన్నా, నివారించదగ్గ క్లేశాన్ని దూరం చేయాలన్నా, ముందు మన భావాలలో, జీవన విధానంలో, ఆలోచనా స్రవంతిలో సమూలమైన మార్పు రావాలి.

తరంగిణులు ఇంకిపోకుండా ఉండే లోకంలోకి మనం పోవాలి. తేజోమయమైన సూర్య కాంతిని మన మనసుల్లోని ఇరుకు సందుల్లోకి పోనిచ్చి అజ్ఞానాంధకారాన్ని పారద్రోలాలి.

5000 సంవత్సరాలకు పైబడిన సుదీర్ఘము, అవిచ్ఛిన్నము, మహోన్నతము అయిన చరిత్రకు, సంస్కృతికి మనం వారసులమని విర్రవీగుతున్నాము. అయితే నిజంగా మన చరిత్రగతిని, సమాజ పరిణామాన్ని విశ్లేషించినవారు, అవగాహన చేసుకున్నవారు కొద్దిమంది మాత్రమే. ఈ అజ్ఞానం వల్ల, నేడు దేవుడి పేరుతో ద్వేషం, సంప్రదాయం పేరుతో ఛాందసం, మతం పేరుతో మారణహోమం, కులం పేరుతో క్రూరత్వం కొనసాగుతున్నాయి. మన సమాజంలో ఆహ్వానించదగ్గ మార్పు వచ్చి, ప్రజాస్వామ్యం, వ్యక్తి ఔన్నత్యం, మానవత ప్రాతిపదికలుగా నూతన భారతదేశాన్ని నిర్మించుకోవాలంటే, మనం పైన చెప్పుకున్న రెండు మహాపాపాల నుండి మన సమాజాన్ని విముక్తం చేయాలంటే, మన చరిత్ర, సంస్కృతుల పట్ల సరైన అవగాహన అత్యవసరం.

ఈ చారిత్రక అవగాహనను పాఠకులకు అందించటంలో సిద్ధహస్తులు కీర్తిశేషులు బి.యస్.యల్. హనుమంతరావు గారు. వారి రచనల్లో, ఆలోచనల్లో స్పష్టత, పాండిత్యం, సమగ్రత, మానవవాదం, ప్రజాస్వామ్య భావం ప్రతి పలుకులోను ప్రస్ఫుటమౌతాయి. కరుణ, ఆర్ద్రత, తపన ప్రస్ఫుటమౌతాయి. సంకుచితత్వం, హ్రస్వదృష్టి కానరావు. ఈ అమూల్యమైన వ్యాస సంకలనం ఆలోచించే ప్రతి భారతీయుడు చదివి, చదివించవలసిన గ్రంథం. దీన్ని మనకందించిన వారి కుటుంబ సభ్యులకు మనం రుణపడి ఉన్నాం.

శలవు

27-6-1994,
హైదరాబాదు.

డా॥ జయప్రకాష్ నారాయణ్

ద్వితీయ ముద్రణకు

# కృతజ్ఞతలు

ఆచార్య బి.యన్.యల్. హనుమంతరావు గారి అముద్రిత 'భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన' ప్రసంగ వ్యాసాల సంపుటిని వారి మరణానంతరం ఆవేదనాభరిత హృదయంతో తక్షణ ఆవేశంతో పరిమిత వ్యవధిలో లభించిన వనరులతో వారి 'సంస్మరణ సభ' నాటికి (మరణానంతరం 12వ రోజు) ముద్రించటం జరిగింది. జనరంజక స్వీయరచనలను హనుమంతరావుగారు వారి జీవితకాలంలో ప్రచురించలేదు. ఆ చిన్న పుస్తకానికి విజ్ఞుల, సహృదయుల ఆదరణ లభించింది. హనుమంతరావుగారి శాస్త్రీయ పద్ధతిలోని ఆలోచనా సరళికి విశ్లేషణాత్మకతకు సత్యనిబద్ధతకు వారి అభిమానుల ప్రోత్సాహం మాకు లభించింది. విషయ సమగ్రతకై ఇంకొక 5 వ్యాసాలు కలిపి ఈ పుస్తకరూపంలో వెలువరించటం జరిగింది.

'కమ్యూనిజం' పత్రిక 'భారతదేశంలో కులవ్యవస్థ'పై అధ్యయన సదస్సును సెప్టెంబరు 27, 1992లో విజయవాడలో నిర్వహించింది. ఆ సదస్సులో 'భారతదేశంలో కులవ్యవస్థ - పుట్టు పూర్వోత్తరాలు' అన్న అంశంపై హనుమంతరావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. దాని వ్యాసరూపాన్ని ఈ ముద్రణలో చేర్చాము. 'భారతీయ వస్త్రధర్మ సంస్కృతి', 'భారతీయ వాస్తు సంస్కృతికి ముస్లిముల సేవ (2 భాగాలు) ఆకాశవాణి కేంద్రం, విజయవాడ నుండి ప్రసారమయినాయి. ఈ వ్యాసాల మూలరూపంలో ప్రచురించిన పత్రికా సంపాదకులకు, ప్రసారం చేసిన ఆకాశవాణికి మా కృతజ్ఞతలు.

ఆచార్య హనుమంతరావుగారి పరిశోధన - రచనలపై ఒక విమర్శకుని విశ్లేషణాత్మక వ్యాసాన్ని, ఒక విద్యార్థి పరిచయ వ్యాసాన్ని, ఒక సంస్థ అర్పించిన నివాళిని అనుబంధంలో చేర్చటం జరిగింది.

శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్ గారు పత్రికారంగం వారికి, పఠనాసక్తి ఉన్న తెలుగు ప్రజలకు సుమారు అయిదు దశాబ్దాలుగ సుపరిచితులు. వారు జిజ్ఞాసువులు, సహృదయులు, వదాన్యులు. తాము గ్రహించిన జ్ఞానాన్ని నలుగురికి అందించవలెనన్న ఆశయం, తపన ఉన్న కర్మవీరులు. అన్నివిధాలా వారందించిన ప్రోత్సాహ సహకారాలే ఈ పుస్తకరూపం దాల్చినాయి. వారికి మా వినమ్ర కృతజ్ఞతాంజలులు.

బి. ప్రియంవద<br>
ఇతర కుటుంబ సభ్యులు

**8-6-1994**

ప్రథమ ముద్రణకు

# మా మాట

చరిత్ర మానవుల కథ. రంగరించిన మానవానుభవం. మానవుడు ప్రకృతిలో భాగంగా జీవిస్తూ, దానిని ఆరాధిస్తూ, అన్వేషిస్తూ, అర్థం చేసుకుంటూ జ్ఞాన సంపదను పెంచుకున్నాడు. జ్ఞానాన్ని ఆధారం చేసుకుని తన ఉనికికి అనుగుణంగా రకరకాల వ్యవస్థలు నిర్మించుకున్నాడు. ఆ వ్యవస్థలను పరిశీలించి వానికాధారమైన జ్ఞానాన్ని వింగడించి అందజేసేది చరిత్ర.

చరిత్ర వ్రాయడం సాహిత్య ప్రక్రియ. ప్రాయికంగా అది ఒక కళ. ఒక చరిత్రగ్రంథం వ్రాయడానికి ఎంతో మూలసామాగ్రి కావాలి. సామాగ్రిని సేకరించడం - విశ్లేషించడం, సమన్వయించడం. సూత్రీకరించడం - ఇవన్నీ శాస్త్రీయవిధానంలో భాగాలు. గతం పునాదులపైనవే భవిష్యత్తు నిర్మాణం జరుగుతుంది. గతాన్ని దర్శించి భవిష్యత్తును సూచిస్తాడు చరిత్రకారుడు. శాస్త్రీయ విధానాన్ని అనుసరించి నిజాలను నిగ్గుదేల్చి వాటిని కళాత్మకంగా కూర్చి వ్రాయడం చరిత్రకారుడు చేయవలసినపని. అట్టిదానిలో కృతకృత్యుడు హనుమంతరావు.

చరిత్ర అధ్యయనం, అధ్యాపనం ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. నిశితదృష్టితో నిజాన్ని వెదకడం ఆయన జీవలక్షణం. ఎందరో చరిత్ర విద్యార్థులు, అధ్యాపకులు ఆయననుండి ఉత్తేజితులయివారు.

ఇండోర్‌లోని 'కుందకుంద జ్ఞానపీఠం'వారి పురస్కారం అందుకోవడానికి వెళ్లి వారు అక్కడచేసిన తుది ప్రసంగంలో మన సమాజంలోని నిమ్నోన్నతాలను సరిదిద్దడంలో బౌద్ధ జైనమతాలు నిర్వహించిన పాత్రను స్పష్టంగా చెప్పడం జరిగింది.

భారతదేశ చరిత్రను, సంస్కృతిని శాస్త్రీయ దృక్పథంతో నిశితంగా పరిశీలించి హనుమంతరావుగారు వ్యాసాలు వ్రాసారు; ప్రసంగాలు చేశారు. ప్రామాణికత, వాక్పటుత్వం, భాషాసౌందర్యం ఆయన వ్రాతలకు ప్రసంగాలకు అమరిన సహజాలంకారాలు. వారి ప్రసంగాలలో కొన్ని కూర్చి ఈ చిన్న పుస్తకరూపంలో మీ ముందుంచుతున్నాము. సహృదయులు విమర్శనాత్మకంగా గ్రహిస్తారని మా ఆశ.

సత్యాన్ని స్పష్టంగా చెప్పగలిగిన ధీరుని స్మృతికి ఇది మా నివాళి -

గుంటూరు
19-6-93

కుటుంబ సభ్యులు

# 1. భారతీయ సంస్కృతి వైశిష్ట్యము

జాతీయభావం ఆధునిక యుగలక్షణాల్లో ప్రధానమైనది. ఒక ప్రాంతంలో నివసించే ప్రజలలో ఒక ప్రత్యేకత, వైశిష్ట్యము ఉంటుందనే విశ్వాసమే జాతీయ భావానికి మూలం. నేటికీ ఈ భావం ప్రపంచ రాజకీయాల్లో ప్రబలంగా ఉంది. యుగయుగాలుగా ఒక జాతి నిర్మించుకొన్న సంస్థల్లో, సంస్కృతిలో ఆ జాతికి స్వకీయమైన విలక్షణమైన ఉపజ్ఞ ప్రతిఫలిస్తూ ఉంటుందని ప్రబోధాలు సర్వదా వినిపిస్తూ ఉంటాయి. ఈ వాదనకు, ''ప్రాక్పశ్చిమాలకు పొత్తు అసంభవం'' అన్న ఆంగ్ల సామ్రాజ్యవాద మహాకవియైన రుడ్యార్ కిప్లింగ్ సిద్ధాంతానికి వ్యత్యాసంలేదు. అదే ధోరణిలో 'శ్వేతజాతుల గురుతర బాధ్యత' అనే సాకుతో పాశ్చాత్యులు తూర్పు దేశాల్లో తమతమ దురాక్రమణలను సమర్థించుకొన్నారు. పై రెండు సిద్ధాంతాలను కలిపి ఆలోచించినప్పుడు ఆయా జాతుల్లో ప్రబలిన జాత్యహంకారం స్పష్టంగా బోధపడుతుంది. ఈ అహంకారానికి పరాకాష్ఠగానే హిట్లరిజం ఉంటుంది. ''ఆర్య జాతి ఉత్తమోత్తమ జాతి, ఉత్తములైనవారే పాలకులుగా అర్హులైనవారు; జర్మనులు ఆర్యులు, కాబట్టి జర్మనులే ప్రపంచాధిపత్యం వహించితీరుతారు'' అనే ప్రబోధంతో జర్మనుల అహంకారాన్ని రెచ్చగొట్టి రెండోప్రపంచ మారణహోమాన్ని సృష్టించి జర్మను జాతిని సర్వనాశనం చేసినాడు హిట్లర్. అందుచేత విలక్షణ జాతీయ ఉపజ్ఞ అనే భావం సామ్రాజ్య దాహం అనే మానసిక రుగ్మతనుండి ఉత్పన్నమైనదనడం సత్యదూరం కాదు. విదేశ వాణిజ్యంలో, వలస రాజ్య పాలనలో ఐరోపా రాజ్యాలు పోటీపడే రోజుల్లోనే జాతీయభావం పుట్టింది; బలపడి విస్తరించింది. చరిత్రలో జరిగిన పెక్కు యుద్ధాలకు పైన పేర్కొన్న మానసిక రుగ్మతే కారణం అనడం అతిశయోక్తి కాదు. యుద్ధాలకంటె ప్రమాదకరమైన, మానవుని మానవత్వాన్ని హరించే అసూయ, ద్వేషం, భయం అనే భయంకర సాంఘిక జాడ్యాల నిర్మూలనకు ఆటంకంగా ఉన్నది నయితం ఈ అహంకారమే!

రాధాకృష్ణ పండితుడు రష్యాదేశాన్ని సందర్శించిన సందర్భంలో అచటి భారతీయ విద్యార్థులనుద్దేశించి ''ప్రపంచ మానవులనందర్నీ ప్రేమించడం నేర్చుకోండి; ప్రపంచ దృష్టిని అలవరచుకోండి'' అని ప్రబోధించాడు. ఎన్నో శతాబ్దాలుగా మానవుడు కలలుకంటున్న మహదాశయం 'ఏకప్రపంచం'. కాని జాతీయ వైలక్షణ్యం వంటి భావాలు ఏకప్రపంచ స్థాపనకు తీవ్ర ఆటంకాలు. అట్టి భావాలకు స్వస్తిచెప్పి మానవులందర్నీ సమైక్యం చేయగల తాత్త్విక దృష్టి అలవరచుకోవలసిన అవసరం నేడెంతగానో ఉంది. సుమారు రెండువేల సంవత్సరాల నాడే క్రీస్తు మహాశయుడు తమజాతి ఉత్తమోత్తమమన్న విశ్వాసాన్ని తిరస్కరించి ''సృష్టికర్త దృష్టిలో మానవులందరూ సమానం'' అని బోధించాడు. ప్రాక్పశ్చిమాలనేవి కేవలం భౌగోళిక మైన సాపేక్షక భావాలేనని శాస్త్రవిజ్ఞాన పరిశోధనలు రుజువు చేసినాయి. జాతి పవిత్రత, వైలక్షణ్యం అనేవి అభూత కల్పనలేనని జీవశాస్త్రం, మానసిక శాస్త్రం నిరూపించాయి. ఈ అంశాలను సమన్వయం చేసినప్పుడు జాతీయ ఉపజ్ఞ అనే భావం అశాస్త్రీయం, అసత్యము మాత్రమేగాక ప్రమాదకరమైనదని గుర్తింపక తప్పదు. కాబట్టే జాతి జాతికి ప్రత్యేక

సంస్కృతి ఉండడానికి అవకాశం లేదు. మానవులందరిదీ ఒకే జాతి, మానవజాతి. వారిది ఒకే సంస్కృతి, మానవ సంస్కృతి. ఆ సంస్కృతి పునాదులను అర్థం చేసుకోడానికి మానవునకు మానవుడుగా సంక్రమించిన వారసత్వాన్ని గురించిన పరిశీలన అవసరం.

## సంస్కృతి - నిర్వచనం

సంస్కృతిని పలువురు పలురకాలుగా నిర్వచించారు. సంస్కృతి అన్నమాటకు స్థూలంగా సంస్కార ఫలితమని అర్థము. అయినప్పుడు సంస్కృతి మానవ కృషి ఫలితమే అవుతున్నది. మానవుని స్థితిలో పురోగతిలో ఉదాత్తము, విశిష్టమునైన అంశాలే సంస్కృతి. ఈ అంశాలే మానవుని జీవితానికి సంబంధించి సాధారణ అవసరాలకంటె భిన్నమై మానవునకొక విశిష్టమైన స్థానాన్ని చేకూర్చినాయి. సాధారణ అవసరాలు భౌతికాలు; మానవునకు ఇతర జీవకోటికి సమానాలు. కాని మానవుడు తన మేధా సంపత్తిచేత మాత్రమే ఇతర జీవకోటి కంటె ప్రత్యేకతను సాధిస్తున్నాడనేది స్పష్టం. ఈ మేధాశక్తి మానవుని శరీరంలోని అంతర్భాగమే. అదే అతనిలోని చైతన్య స్వరూపము. అందము - వికారము, మంచి-చెడు, సత్యము -అసత్యము వీని మధ్యగల తారతమ్యాన్ని గ్రహించే సామర్థ్యం మేధస్సు వల్లనే మానవునకు లభిస్తున్నది. ఈ మేధాశక్తి మానవులందరికీ సమానమే. కాబట్టి మానవజాతి అంతటికీ సమాన ధర్మమైన మేధాశక్తియే సమస్త సంస్కృతికీ మూలాధారమనేది నిర్వివాదాంశం. సంస్కృతికి జన్మస్థలం మానవుని మేధయే!

అయితే, సంస్కృతికి మానవుని మేధ ఒక్కటే కారణం కాదు. సంస్కృతి పరిణామ క్రమంలో భౌతిక చారిత్రక పరిస్థితులు సైతం ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి. మానవుని భావాలు, దృక్పథము, ప్రవర్తన, సాంఘిక రాజకీయ సంస్థలు మొదలయినవన్నీ కలిసి అతని సంస్కృతికి సమగ్ర రూపాన్ని ప్రసాదిస్తాయి. ఒక విధంగా, తాను నివసించే భౌతిక అవసరాల నేపథ్యంలో మానవుని మానసిక శారీరక శ్రమల సమన్వయ స్వరూపమే సంస్కృతి. అంటే భౌతిక పరిసరాల సవాలుకు మానవ మేధాశక్తి, సృజనాత్మక సామర్థ్యము చెప్పగల సమాధానాల ఫలితమే సంస్కృతి. భౌతిక పరిసరాలు స్థిరమైనవి, చాలావరకు శాశ్వతమైనవి. కాబట్టి ప్రాయికంగా మానవగుణాల ఫలితంగా ఏర్పడిన భౌతిక పరిసరాల్లో కనిపించే భిన్నత్వంవల్ల వివిధ మండలాలలో నివసించే మానవ సమాజాల సంస్కృతులలో వైవిధ్యం కనిపించడం కద్దు. ఒక సుప్రసిద్ధ పురాతత్త్వవేత్త అభిప్రాయంలో "ఒక్కొక్క సమాజం తన చరిత్రలో కొన్ని సంప్రదాయాలను, ప్రవర్తనా నియమావళిని, శాస్త్ర విషయాలను రూపొందించుకుం టుంది. ఈ నియమాలను, శాస్త్రాలను పరిసరాలతో అనుసంధించడం మీదనే ఆ జాతి భవితవ్యం ఆధారపడి ఉంటుంది."

"రెండు జాతుల జీవిత విధానాలలో కనిపించే వ్యత్యాసాలు ఆ జాతుల చరిత్రలోని వ్యత్యాసాలవల్ల ఏర్పడినవే గాని శారీరకంగా అంతర్యాలైన విభేదాలవల్ల కలిగినవి గావు." కావున భారతీయ సంస్కృతిలో విశిష్టమైనవిగా పరిగణించే లక్షణాలన్నింటికీ భారత ఉపఖండ భౌగోళిక పరిస్థితులే చాలావరకు కారణాలుగా నిరూపించవచ్చు. క్రియాత్మకంగాని భావాదృష్టి, కర్మసిద్ధాంతం, నిష్కామకర్మభావం, వర్ణ వ్యవస్థ, జాత్యహంకారాన్ని పెంచే

ఏకాకిత్వము భారత సంస్కృతికి విశిష్ట లక్షణాలు! ఇవన్నీ భారతదేశ భౌగోళిక పరిస్థితుల ప్రభావం వల్లనూ భారతదేశ చారిత్రక సంఘటనల ఫలితంగాను ఏర్పడినవేనని సోదాహరణంగా వివరించవచ్చు. గోర్డాన్ ఛెయిల్డ్ అభిప్రాయంలో ''పరిస్థితులకు అనుగుణంగా మలచుకొనే ప్రయత్నంలో సమాజాలు రాజ్యాలను నిర్మించుకొన్నాయి; గణిత శాస్త్రాలను రూపొందించినాయి; ఈ కార్యక్రమాలన్నీ మానవులందరకు సమానము సహజమునైన గుణాల ఫలితంగా జరిగినవే; కాని అవాఙ్మనస గోచరము, మానవాతీతమునైన దివ్యశక్తి సృష్టించిన విభేదాలవల్ల ఏర్పడినవి మాత్రము కావు.''

పరిసరాల సవాలును ప్రాయికమైన మానవలక్షణాలతో నెదుర్కొనే కృషిలో సంస్కృతి పరిణామం చెందుతుందనే సత్యాన్ని మనసులో ఉంచుకొని భారతీయ సంస్కృతిలోని విశిష్టలక్షణాలనే వానిని పరిశీలిద్దాం.

## భారతీయ ఆధ్యాత్మికత

ఆధ్యాత్మికత భారతీయ సంస్కృతికి పునాది అనీ, కేవలము ప్రాపంచికమైన పునాదులు గల పాశ్చాత్య నాగరికత కంటె భిన్నమైనదనీ తరచు వింటూ ఉంటాము. పాశ్చాత్య చరిత్రకారులు, విమర్శకులు సైతం ఈ విషయాన్ని ప్రశంసిస్తూ ఉండడం గమనించదగింది. తమ సంస్కృతిలోని ఆధ్యాత్మిక వైలక్షణ్యాన్ని భారతీయులెప్పుడు గుర్తించారో చెప్పలేము. వాస్తవానికి భారతీయ సంస్కృతిలో గతించిన ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని భారతీయుల దృష్టికి తెచ్చినవారు భారతదేశ విజేతలైన పాశ్చాత్యులే! ఈ పాశ్చాత్యులు భారతీయుల దృష్టిలో తుచ్ఛమైన ఐహిక నాగరకతా సంస్కృతులను నిర్మించుకొన్నవారే! కాగా మరుగున పడిన పాత విషయాన్ని త్రవ్వి భారతీయుల దృష్టికి తీసుకురావడంలో వారి ఉద్దేశ్యం ఏమిటి? అనే ప్రశ్న రాకమానదు. భారతీయులు ఆధ్యాత్మిక దృష్టి ఉన్నవారనీ, మిధ్యయైన 'ఇహము' కంటె నిత్యము - సత్యమునైన 'పరము' పట్లనే వారికి ఆసక్తియనీ, ప్రచారంచేస్తే ఇహలోక సుఖసంపదలను తమకు వదలి వేయగలరనీ, తమ రాజకీయాధిపత్యానికి ప్రమాదం ఉండదనీ ఆంగ్లేయులు భావించి ఉండవచ్చు! మరొక విశేషం. నాడు పాశ్చాత్య దేశాల్లో పారిశ్రామిక విప్లవ ప్రభావంవల్ల మధ్యయుగ మతప్రోక్తమైన భావాలు, విలువలు నశించి వినూతనము శాస్త్రీయమునైన విలువలు రూపొందుతున్నాయి. విప్లవాత్మకము, ప్రగతి శీలమునైన ఈ మార్పులను సనాతనులు గ్రహించలేక పోయినారు. పారిశ్రామిక విప్లవమువల్ల తాత్కాలికంగా వచ్చిన సాంఘిక దురాచారాలను ఖండిస్తూ మతంలో విశ్వాసాన్ని పునరుద్ధరించే ఆశయంతో మెథడిస్టు మొదలైన ఉద్యమాలు విజృంభించినాయి. ఆ పరిస్థితుల్లో తాము కోల్పోతున్న మత సంప్రదాయాలు, విలువలు భారతీయ సంస్కృతిలో వేళ్లు తన్నుకొని ఉండడాన్ని పరిశీలించినవారు పాశ్చాత్య సనాతన విద్వాంసులే! అందుచేత ఆ విలువలనే వారు ఉదాత్తము, ఆదర్శప్రాయము, ఉత్తమము అంటూ కీర్తింపసాగినారు. ఇందువల్ల పరాజితులైన భారతీయులకు తమ విజేతలను వెక్కిరించడానికి అవకాశం లభించింది. ''తమ విజేతలది తుచ్ఛమైన భౌతిక సంస్కృతి. పరాజితులైన తమది ఉదాత్తమమైన ఆధ్యాత్మిక సంస్కృతి'' అనే భావం తృప్తి వహించడానికి ఉపకరించింది. చిత్తశుద్ధితో భారతీయ ఆధ్యాత్మికతకు జోహారులర్పించిన అనిబిసెంటు వంటివారు సైతం కాకతాళీయమైన సంఘటనలతో ఆంగ్లసామ్రాజ్యవాదుల

పైమున్న ద్వేషంతో భారతీయతవైపు ఆకర్షితులయినారనే వాదం కేవలం అసత్యం కాదు. ఏమైనప్పటికీ భారతీయతలో నశించిపోతున్న ఆధ్యాత్మిక భావాన్ని పునరుద్ధరించి పుష్పాంజలి ఘటించిన పాశ్చాత్యులే మనలో జాతీయభావాన్ని పురికొల్పినారనడం చాలావరకు సత్యసమ్మతం. జాతీయవాద విధానాల్లో భారతీయ ఆధ్యాత్మిక మనస్తత్వం విచ్చలవిడిగా కీర్తించబడింది. ఆ ప్రచార ఫలితంగా ఆధ్యాత్మికతే మనకు గర్వకారణంగా భావిస్తున్నాం. ఈ మనస్తత్వం మనకెంతవరకు ప్రయోజనకారి అనే విషయం అటుంచి ఈ వాదంలో ఎంతవరకు సత్యముందో పరిశీలిద్దాం.

వైదిక మతానికి నేటి హిందూమతానికి పోలికలేదు. అయినా వేదాలే హిందూమతానికి ప్రామాణిక గ్రంథాలని హిందువుల విశ్వాసం. నేడుకూడా హిందూమతం అనడంకంటే వేదమతం అనడమే యుక్తమని కొందరు భావిస్తారు. వైదికమతాన్ని పరిశీలిస్తే సర్వశ్రేష్ఠుడు ఇంద్రుడు. ఇతని స్వభావం యెలాంటిది? తన భక్తులైన మానవులకంటే ఎక్కువ శారీరక సుఖాలను కాంక్షించినవాడు ఇంద్రుడు. వాస్తవానికి మానవులకు అందని ఆశయాల ఆకాంక్షల ఆదర్శ స్వరూపాలే దేవతలు. గోమాంస భక్షణ, సురాపానం, శాత్రవ దాసదస్యు విధ్వంసనం ఇంద్రుని కార్యకలాపాలలో ప్రధానమైనవి. ఈ విధ్వంసన ప్రయోజనం సైతం దాసదస్యుల పురాలు, గోవులు, క్షేత్రాలు మొదలైన ఇహలోక సంపదలను దోచి, ఆర్య సామ్రాజ్యాన్ని విస్తరింపచేయడమే. సామ్రాజ్యదాహమున్న పాశ్చాత్యులకు ఆదర్శప్రాయుడుగా ఉండదగిన దేవుడు ఇంద్రుడు. కావున వైదిక దైవమైన ఇంద్రునిలో ఆధ్యాత్మిక స్వభావం అణుమాత్రం కనిపించదు. ఇక వైదిక మతానికి ప్రాణప్రదమైనది యజ్ఞం. పంటపొలాలు, పశువులు, పుత్రసంతానం మొదలైన ఐహికవాంఛలను తీర్చగలందులకై దేవతలకు లంచం చెల్లించే కార్యక్రమమే ఆదిమయజ్ఞం. వైదిక ఋషులెన్నడు మోక్షాన్ని కోరినట్లు కన్పించదు. వైదిక ఋషులది, వారి దేవతలది కేవలం వ్యాపారదృష్టి. వైదికమతంలోని ఈ ఐహిక లాలసత్వంమీద తిరుగుబాటుగానే ఉపనిషత్తుల భావవిజ్ఞానం అవతరించింది. వేదాలది కర్మమార్గం. ఉపనిషత్తులది జ్ఞానమార్గం. ఉపనిషన్మార్గం ఆర్య - అనార్యమత సంకలనంవల్ల జనించిందే. ఇస్లాంలోని సూఫీవాదంతో ఉపనిషత్తుల గూఢవాదాన్ని పోల్చవచ్చు.

వైదిక ఉపనిషద్విధానాలకు సరితూగగలవి ప్రపంచంలో మరెక్కడ లేవని హిందువులు గర్వించడం కర్దు! ఇది కేవలం ఆధారరహితమైన అహంభావం! వైదిక దేవతలకు హోమర్ రచనలలోని గ్రీకు దేవతలకు పోలికలున్నాయి. ఉపనిషత్తుల జ్ఞానవాదానికి గ్రీకు దార్శనికుడైన ప్లేటో వాదానికి సామ్యం కనిపిస్తుంది. మరొక విశేషమేమిటంటే ఉపనిషత్ ఋషులు ఐహిక సుఖాన్ని త్యజించి ఆధ్యాత్మిక విజయాలపైనే దృష్టిని కేంద్రీకరించారనుకోవడం వెర్రితనం. నాటి రాజులు ఋషుల సేవకైతమ జీవితాలను అంకితం చేసినారు. ఋష్యాశ్రమ అవసరాలను తీర్చడానికి పోటీలుపడేవారు. నాటి మత రాజకీయ సాంఘిక పరిస్థితి అటువంటిది. ఆ మహర్షుల సందేశమే ''శరీర మాద్యంఖలు ధర్మసాధనం''. అపారమైన లోకానుభవము, దూరదృష్టి ఉన్న సందేశం. ధర్మసాధనకు శరీరమే మూలం; కాబట్టి శరీరాన్ని నిర్లక్ష్యం చేస్తే ధర్మసాధనకు నష్టం వాటిల్లుతుంది - అని హెచ్చరిక.

ఇక హిందువు లాశించిన ధర్మ స్వరూపమేమిటి? హిందువుల జీవితాశయాలు నాలుగు. అవే పురుషార్థాలు. ధర్మ, అర్థ కామ, మోక్షాలు. చతుర్విధ పురుషార్థాలు చాలవరకు ఐహికాలే!

వీనిలో 'ధర్మ' పదం చాలా చిత్రమయింది. హిందూమత ప్రవక్తలు, వ్యాఖ్యాతలు భిన్న అర్థాలు వచ్చేటట్లు ఈ పదాన్ని వాడినారు. పురుషార్థాలకు సంబంధించినంతవరకు వ్యక్తి తన కుటుంబానికి, కులానికి, రాజ్యానికి అన్నిటికంటె సుఖజీవితానికి తాను నిర్వహించవలసినదే ధర్మంగా వ్యవహరించ బడిందని నిర్ణయించవచ్చు. శరీర పోషణపట్ల అశ్రద్ధ వహిస్తే పైవిధుల నిర్వహణ అసాధ్యమవుతుంది కదా! అందుకే ఉదరపోషణను ధర్మంగా పరిగణించాలని హెచ్చరిస్తుంది హిందూధర్మం. ఇక అర్థకామాలలో ఆధ్యాత్మికత లేదనే చెప్పవచ్చు. కాని ధర్మబద్ధుడై మాత్రమే అర్థకామాలను సాధించాలన్న సూచన సుస్పష్టం! అనగా సామాజిక నియమావళికి కట్టుబడి మాత్రమే పైరెండు పురుషార్థాలు సాధింపవలసి వుంది. ధర్మాన్ని పురుషార్థాలలో ప్రథమంగా పేర్కొనడంలోని ఉద్దేశ్యం అదేనని నా అభిప్రాయం. ఇక నాలుగో పురుషార్థం మోక్షం. ఇది ఆధ్యాత్మిక సంబంధమైనది. కాని ఇందులో ప్రత్యేకంగా భారతీయత కలదనడం అసమంజసం. మోక్షానికి సాధారణంగా చెప్పుకొనే అర్థం 'జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావడం'. ఈ కోరిక ప్రపంచంలోని అన్ని మతాలకు సర్వసామాన్యం. ''సమస్త ప్రపంచాన్ని జయించినా ఆత్మను కోల్పోతే అది విజయం కాదు'' అని క్రీస్తు బోధించాడు. ఇదే రకమైన ప్రబోధం ప్రహ్లాదుడు హిరణ్యకశిపునకు చేసినట్లు భాగవతంలో వుంది. మోక్షము, ఆత్మసాక్షాత్కారము అనే భావాలు అన్ని మతాల్లోనూ వున్నై. హిందూమతమే వానిపై గుత్తాధిపత్యం సంపాదించలేదు.

భారతీయ సంస్కృతీ సందేశాన్ని పాశ్చాత్యదేశాలకు అందించిన రాధాకృష్ణ పండితుని అభిప్రాయంలో ''ప్రపంచ ఆర్థిక రాజకీయ శాస్త్రాలకు భారతీయులు సేవ చేయలేకపోవచ్చు. కాని మతము తత్త్వశాస్త్రము అనే రెండు రంగాల్లో భారతీయుల సాధన అపారము. అయినా ఈ రంగాలను సైతం భారతదేశం గుత్తకొన్నదని ఊహించడం సమంజసం కాదు. ప్రపంచ చరిత్రలో ప్రాక్పశ్చిమాల మధ్య యదార్థమైన విభేదమేమీ లేదనే సర్వదా నా అభిప్రాయం. ఇటీవలనే పాశ్చాత్యుల శాస్త్రవిజ్ఞాన, హేతువాద, మానవతావాదాలకు ప్రాచ్య ఆధ్యాత్మిక వాదానికి మధ్య అఘాతమేర్పడింది. ఆధునిక పాశ్చాత్య నాగరికతకు హేతుత్వము, విజ్ఞానము, మానవహక్కులనేవి కీలకములయినాయి. ఈవిధంగా ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులకు మధ్య విభేదము మధ్యయుగంలో లేదనీ ఇటీవల ఏర్పడిందనీ రాధాకృష్ణ పండితుడే అంగీకరిస్తున్నాడు. ''మధ్యయుగంలో పాశ్చాత్యులు సైతం అవాఙ్మనసగోచరమైన సత్యాన్ని గుర్తించారు'' అంటాడు. కాబట్టి ప్రాచ్య పాశ్చాత్యదేశాల మధ్య తారతమ్యానికి కారణం స్పష్టమవుతున్నది. ఆధ్యాత్మికత మధ్యయుగంలో ప్రాచ్య పాశ్చాత్యదేశాలకు సమానలక్షణం. దానిని తిరస్కరించి పాశ్చాత్యులు హేతుత్వాన్ని, శాస్త్రవిజ్ఞానాన్ని పెంపొందించుకొన్నారు; అభివృద్ధిని సాధించినారు. ఇట్టి పరిస్థితుల్లో ఆధునిక యుగ లక్షణాలను తెగడి మధ్యయుగ లక్షణమైన ఆధ్యాత్మికతయే ఉత్తమమైనదని పట్టుకు ప్రాకులాడడం ఎంతవరకు సమంజసమో సమర్థనీయమో ఆలోచింపవలసియున్నది. నేటి భారతీయ మనస్తత్వం సమాజాభివృద్ధి వికాసాలకు గర్భశత్రువు. ఈ మనస్తత్వాన్ని రాధాకృష్ణ పండితుడే హెచ్చరించినాడు. ''భారతీయ సమాజాన్ని పట్టి పీడించే మూలదోషాలన్నింటికి కారణాలు రెండు. (1) బాధ్యతారహితమైన అర్థసంపద (2) మతమౌఢ్యము. ఆర్థిక అన్యాయాలు మనదేశం వరకే పరిమితాలు కావు; ప్రపంచం అన్ని ప్రాంతాల్లోనూ ఉన్నాయి. కాని మనదేశంలో మతమౌఢ్యం మాత్రం ప్రమాదకరంగా పరిణమిస్తున్నది. మూఢనమ్మకాల ముసుగులో 'సత్యం' పూర్తిగా

కలుషితమవుతున్నది. కొన్ని భావాలు పాతబడిపోవడం చరిత్రలో సర్వసాధారణం. అట్టి భావాలకు కృత్రిమంగా విపరీతార్థాలు కల్పించి పరిరక్షించుకుంటున్నాము. ఇది దుర న్యాయం. ''మోసంనుండి, భూతకాల తమస్సుల దౌష్ట్యం నుండి మనజాతికి మోక్షం ప్రసాదించడమే మన తక్షణ కర్తవ్యం.'' ఇటువంటి హెచ్చరికయే ఆచార్య పుంతంబేకర్ కూడా చేసినాడు. నేటికీ హిందువుల్లో సనాతనులు సాంఘిక నియమావళికి మను ధర్మ శాస్త్రమే ప్రామాణికంగా అంతిమ తీర్మానంగా ఉటంకిస్తూ ఉంటారు. పుంతం బేకర్ మాటల్లో మనుధర్మశాస్త్రం ''భూస్వామ్య యుగానికి మాత్రమే తగినది; విజేతలు పరాజితు లకోసం తయారుచేసిన న్యాయశాస్త్రం. కొన్ని వర్గాల ప్రత్యేక హక్కులు, అసమత్వసూత్రం అనేవి మనుధర్మశాస్త్రం సూచించిన న్యాయానికి సాంఘికవ్యవస్థకు పునాదులు. మనువు సూచించిన ఏ సంస్థకూడా ఆధునిక యుగ స్వభావానికి తత్త్వానికి సరిపడేది కాదు.'' కాబట్టి భారతీయ సంస్కృతి ఆధ్యాత్మికం అంటూ విర్రవీగడం మన నాగరికత ఇంకా మధ్యయుగ భూస్వామ్య దశనుండి బయటపడలేదని అంగీకరించడమే! రాధాకృష్ణపండితుడు చెప్పినట్లు భూతకాల తమస్సుల దౌష్ట్యానికి జోహారులు అర్పించడమే!

''మన దేశంలో విపరీతంగా విస్తున్న ఆధ్యాత్మిక వాదానికి ప్రయోజనం ఐహిక సుఖాలకోసం మనంపడే ఆరాటాన్ని - తాపత్రయాన్ని కప్పిపుచ్చడమే!'' అంటూ ఇటీవల సి.డి. ఘోష్ పండితుడు వ్రాసినాడు. ''ఉన్నత నాగరికతా శిఖరాల నుండి మనం ఏనాడో పతితులమైనాము. ఇంకా ఆ శిఖరాలనే అధిరోహించి ఉన్నామని ఇతరులను మోసగించడానికి చేసే ప్రయత్నమే నేటి ఆధ్యాత్మికతను గురించిన ఉపన్యాసాలు. వాస్తవానికి మన వర్తకులలో గాని, రాజకీయ నాయకులలోగాని, ఏవర్గం ప్రవర్తనలోగానీ ఆధ్యాత్మికత అణుమాత్రం కూడా గోచరించడం లేదు కదా! అయినప్పుడు నేటి మన ఆధ్యాత్మిక వాదం కేవలం అవినీతికరమైన పెద్ద మోసం.''

## భిన్నత్వంలో ఏకత్వం

భారతీయ సంస్కృతి ఒక మహాసంగమ క్షేత్రమనీ - ఏ నూతన సాంస్కృతిక ప్రభావాన్నైనా జీర్ణించుకొని పెంపొందే శక్తి భారతీయతలోని ప్రత్యేకత అనీ పండితులు వాదిస్తుంటారు. కాని కొందరు భారతీయ సంస్కృతి మరియే యితర సంస్కృతికీ రుణపడిలేదని వాదించడం కూడ కద్దు. వీరికి నమస్కారాలు! భిన్నత్వంలో ఏకత్వం భారతీయ సంస్కృతికి లక్షణమనేది నిజమే. ఆర్య, అనార్య సంస్కృతులు, పారశీక, అరబ్బీ నాగరికతా ప్రభావాలు కలిసి రూపొందిందే నేటి భారతీయ సంస్కృతి. ఐనా విదేశ నాగరికతా ప్రభావాలను స్వీకరించడం భారతీయ సంస్కృతికే మాత్రమే పరిమితమైన వైలక్షణ్యం కాదు. క్రైస్తవ, ఇస్లాం సంస్కృతులు సైతం వివిధ ప్రభావాల ఫలితంగా ఏర్పడినవే. హీబ్రూ నైతిక ప్రబోధాలు, ప్రాచీన గ్రీకు మతాచారాలు, బౌద్ధ సంఘ నిర్మాణ సంప్రదాయాలు కలిసి రూపొందింది క్రైస్తవము. అదేవిధంగా హీబ్రూ, క్రైస్తవ, జొరాష్ట్రియన్, బౌద్ధమత ప్రభావల సమ్మేళనమే ఇస్లాము. నేటి ఆంగ్లేయ సంస్కృతి ఆంగ్లికన్, శాక్సన్, డ్రూయిడ్, రోమన్, నార్మన్ జాతుల సంస్కృతీ సమ్మేళనమే! అమెరికాలో కన్పించేది సర్వజాతి సమ్మిళితమైన సామాజిక విధానమే

గదా! కాబట్టి ఏ సంస్కృతిలోనైనా నేడు కన్పించేది సాంకర్యమే. అదే మన వైశిష్ట్యమనుకోవడం పొరపాటు.

## సహన శీలము

భారతీయుల సహన శీలాన్ని - శాంతి ప్రియత్వాన్ని గురించి విశేషమైన పొగడ్తలు వింటూ ఉంటాం. వాస్తవానికి ఈ ప్రచారం కూడా పాశ్చాత్య విద్వాంసులు ప్రారంభించినదే. ఐతే మత సహనంమీదనే భారతీయ సంస్కృతి యొక్క పునాదులు ఉన్నవా? అన్నది అనుమానింపవలసిన అంశం. హిందూమతానికి ఋగ్వేదం మూలము కదా! వైదిక నాగరికతా నిర్మాతలు సహన శీలురు - శాంతి కాముకులు అని చెప్పడం చరిత్రకు విరుద్ధం. వారి యుద్ధ ప్రియత్వం అసమానం, జగద్విదితం. వారి ప్రధాన దైవం ఇంద్రుడు. యుద్ధానికి అధిదేవుడు. మధ్య యుగం నాటి చెంగిజ్ ఖాన్, తైమూరులతో పోల్చ తగినవాడు. అతని అభిమాన బిరుదము 'పురందర'. ఇంద్రుని ఆరాధింపని అవ్రతులు అపవ్రతులునైన దాసదస్యులను సర్వనాశన మొనర్చవలసినదిగా ఆర్యమహర్షులు అతడ్ని ప్రార్థించేవారు. ఆర్యేతర దేవతల నారాధించే వారే అవ్రతులనీ - అపవ్రతులనీ నీచంగా వ్యవహృతులైనారు. ఈ వర్ణనవల్ల తమదే ఉత్తమ మతమనే అహంకారం ఆర్యులలో ఉన్నట్లు స్పష్టమే గదా! ఈ అపవ్రతులు ఇంద్రుని వజ్రాయుధానికి బలికాదగిన వారట! అనార్య పూజా మందిరాలను నేలమట్టం చేసి వారి దేవతా విగ్రహాలను భగ్నం చేసిన మహనీయుడే పురందరుడు! ఆ విధంగా కూలిపోయిన పూజాగృహాల ఇటుకలతో ఆర్యులు యజ్ఞ వేదికలు నిర్మించుకొన్నారు. బ్రాహ్మణములలో అర్య, అర్మక అనే పదాలు తరచు కన్పిస్తూ ఉంటాయి. వీనికి 'వినష్ట గ్రామము' అని అర్థము. వీరిని నష్టపరచడం వలననే పురందర బిరుదం వచ్చింది. కాబట్టి ఋజుదృష్టితో ఆలోచిస్తే విగ్రహధ్వంసన కార్యక్రమంలో తమ తరువాత హిందూ దేశంపై దండెత్తిన తురుష్కులకేమాత్రము తీసిపోనివారు ఆర్యులు.

తరువాతి యుగంలో హిందూ బౌద్ధమతాల మధ్య సంబంధాలు కేవలం శాంతియుతమే ననడం సైతం అనుమానించదగిన విషయమే! మచ్చుకు ఒకటి రెండు సంగతులను పరిశీలిద్దాం. బుద్ధుడు అనే మాటకు బుద్ధిహీనుడు అనే అర్థంలో వాడుతున్నాము కదా! ఇది బుద్ధుని మీద, బౌద్ధధర్మం పట్ల సహనానికి నిదర్శనమేనా! హిందూ పండితులు హిందూమత శాఖగానే బౌద్ధం అవతరించిందని వాదిస్తారు. అదే నిజమై హిందువులు యదార్థంగా సహనశీలురే అయితే శైవ శాక్తేయాలు ద్వైతాద్వైతాలవలె బౌద్ధం సహితం దేశంలో సజీవంగా ఉండవలసింది. మరి బౌద్ధం భారతభూమి నుండి అంతర్ధానం కావడానికి కారణం? ప్రాణాపాయం వచ్చినా జైన బౌద్ధమందిరాల్లో తలదాచుకోకూడదని హిందువులకు హెచ్చరిక. ''అన్య మతాలను గౌరవించడం స్వమతాన్ని ఉదాత్తం చేసికొనడమే'' అని అశోక చక్రవర్తి మత సహనావశ్యకతను ప్రబోధించినాడు. సహనశీలురైన ప్రజలకు ఈ ఉద్బోధావశ్యకత యేమి?

తులనాత్మక దృష్టితో పరిశీలిస్తే హిందువుల్లో ఉన్నంత సహనశీలం ఇతర మతాల్లోకూడా, ముఖ్యంగా హిందువులు హింసాత్మకమని భావించే ఇస్లాములో కూడ, లేకపోలేదు. బాగ్దాద్‌లో ఖలీఫాలు భారతీయ విద్వాంసులను ఆహ్వానించి గౌరవించినారు. అలెగ్జాండ్రియా, డమా

స్కస్, బాగ్దాదులలోని మొహమ్మదీయ సంస్థానాలలోనే ప్రాచీన పాశ్చాత్య సారస్వతానికి రక్షణ లభించింది. మొహమ్మదీయుల ఆదరణే లభించక పోయినట్లయితే గ్రీకు విజ్ఞానం యావత్తు క్రైస్తవ పూజారుల హింసాకాండకు బలియై పరశురామప్రీతి అయి వుండేది. హిందూ దేవాలయాలను కూలద్రోసి హిందూ మత విరోధిగా చరిత్రలో చిత్రింపబడిన గజినీ మామూదు అసలు కథ మరోవిధంగా తెలుస్తుంది. హైందవ సంస్కృతి పట్ల మామూదుకు చాల అభిమానం. హిందూ విద్వాంసులను తన ఆస్థానానికి ఆహ్వానించి గౌరవించినాడు. తన నాణేలమీద తన పేరును సంస్కృత భాషలో నాగరిలిపిలో ముద్రించుకున్నాడు. తన ఆస్థాన విద్వాంసుడైన ఆల్బెరూనీని ప్రోత్సహించి భారతదేశాన్ని గురించి గ్రంథం వ్రాయించి నాడు. అల్బెరూనీ సంస్కృతం అభ్యసించి ప్రాచీన భారతీయ సంస్కృతికి జోహారు లర్పించడమేగాక తనకాలంలో భారతీయులున్న దుస్థితికి సానుభూతి చూపినాడు! ఇక హిందూ ఆలయాలను ధ్వంసం చేయడమన్నది వాటి రాజకీయ సైనిక ఎత్తుగడలలోని భాగము. ఆలయాలు ధనరాశులతో మూలుగుతూ ఉండేవి. ధనం అవసరమైనప్పుడు వందగ్రామాలు దోచేబదులు ఒక ఆలయం దోస్తే ఫలం దక్కేది. హిందూదేవాలయాలను ముస్లిములు మాత్రమే దోచుకోలేదు. హిందువులు సైతం దోచివారనడానికి శాసనాధారములు కూడా ఉన్నాయి. అదీకాక ఆలయాలు కోటలుగా ఉపయోగపడేవి; వానిని ధ్వంసం చేస్తేకాని సైనికంగా దేశ ఆక్రమణ పూర్తి అయ్యేదికాదు. మరొక విశేషం. మధ్యయుగంలో భారతదేశ సామాజిక జీవనం ఆలయంచుట్టూ అల్లుకొని వుండేది. ఆలయాన్ని నేలమట్టం చేసినప్పుడు సామాజిక జీవనం విచ్ఛిన్నమయి దేశాన్ని జయించడం సులభమవుతుంది. ఇన్ని కారణాలవల్ల హిందూ ఆలయాలపై ముస్లిములు తమదృష్టిని కేంద్రీకరించినారు. కాబట్టే దాసదస్యుమ్లేచ్ఛ పదాలతో నిండిన మన సారస్వతము, విదేశ పర్యటనను నిషేధించి సంఘబహిష్కార ప్రాయశ్చిత్తాది కర్మకాండలతో నిండిన మన(ను)ధర్మశాస్త్రము; అంటరాని తనంపై నేర్పడిన మన సమాజవ్యవస్థ సహనశీలానికి నిదర్శనాలు కావనడం నిర్వివాదాంశం. అందుకు మరో నిదర్శనం, సత్యాహింసలను సహనాన్ని ప్రబోధిస్తూ రాజకీయాలను నీతివంతం చేయడానికి కృషిచేస్తున్న గాంధీజీ హత్య!

## శాంతిప్రియత్వం

భారతీయుల శాంతిప్రియత్వాన్ని గోరంతలు కొండంతలు చేస్తూ వుంటారు. ఈ ప్రచారం కూడా సత్యదూరమే! భారతీయ చక్రవర్తుల బిరుదాలు వారి యుద్ధోన్మాదానికి నిదర్శనాలు! విక్రమాదిత్య, భండవాదిత్య, పరగండభైరవ - అనేవి ఆ బిరుదాలు. మన చరిత్రలో ప్రాధాన్యం ఇస్తున్నది చంద్రగుప్త, సముద్రగుప్త, రాణాప్రతాప్, శివాజీల వంటివారి కేగదా! వారుచేసిన యుద్ధాలేగదా వారి ఘనతకు కారణం? ''అసంతుష్టా ద్విజానష్టా సంతుష్టా ఇవ పార్థివా'' అనిగదా మన రాజనీతి. అంటే రాజులు వున్నదానితో తృప్తిపడక సర్వదా విజిగీషులై యుండవలె. ఇక యుద్ధాన్ని త్యజించి సామ్రాజ్యపాలనకు, తన కీర్తికి గీటురాయిగా అహింసా ధర్మాన్ని చేపట్టిన అశోక చక్రవర్తికి శాంతి కాముకులైన హిందువులిచ్చిన గౌరవం ఏమో ఆలోచించండి? బుద్ధుని నామధేయానికి వలె అశోకుని అభిమాన బిరుదమైన 'దేవానాంప్రియ' అనే పదానికి 'బుద్ధిహీనుడు'నే అర్థం కల్పించారు. ఇదేనా హిందువుల శాంతిప్రియత్వం!

భారతీయ చక్రవర్తులు విదేశాలపై దండెత్తి జయించి ఆక్రమించలేదనడం యథార్థమే. కానీ అందుకు కారణం వారి శాంతిప్రియత్వం కానేకాదు. హిందూదేశ భౌగోళిక పరిస్థితులే కారణం. దేశం సువిశాలమై మన చక్రవర్తుల యుద్ధప్రియత్వానికి సామ్రాజ్య విస్తరణ కాంక్షకు తగినంత అవకాశం కల్పించింది. ఆసేతు శీతనగ పర్యంత సామ్రాజ్యమే మన చక్రవర్తుల ప్రథమాశయం: 'ఇంటగెలిచి రచ్చ గెలవుమన్నారు గదా!' దేశాన్నే పూర్తిగా జయించలేనపుడు విదేశాలపై దండెత్తే ప్రసక్తి ఎక్కడిది? కాబట్టి విదేశాల నాక్రమించనంతమాత్రంచేత మన రాజులు శాంతికాముకులనడం చారిత్రక పరిజ్ఞానం లేకపోవడమే. ముస్లిం చరిత్రను పరిశీలించే సందర్భంలో వారి కుటుంబ కలహాలను పరిహసించడం హిందువులకు పరిపాటి. ఇది కేవలం వైరితనం. హిందూ రాజవంశాల చరిత్రలో అట్టి కలహాలు కోకొల్లలు. అజాతశత్రువు తన తండ్రిని చంపి సింహాసనం ఆక్రమించాడు. అశోకుడు తన సోదరులను సెక్కండ్రను వధించినాడు. హైందవ చరిత్రలో స్వర్ణయుగాన్ని సృష్టించిందని భ్రమిస్తున్న గుప్తవంశంలో అడుగడుగునా సోదర కలహాలున్నాయి. చాళుక్యచరిత్ర సమస్తము సోదరపోరాటమే. శ్రీకృష్ణరాయలు తిమ్మరుసుల గురించి ప్రచారంలోవున్న కథలో చారిత్రక సత్యం లేకపోలేదు. ఇంతెందుకు! హిందువులకు పరమ పవిత్ర ఇతిహాసాలైన మహాభారత రామాయణాలలోని ఇతివృత్తాలు కుటుంబ కలహాలు, జ్ఞాతి విరోధాలేకదా! బహుశా ఆ ఇతిహాసాలే మన రాజవంశాలకు ఆదర్శాలై వుంటాయి. కాబట్టి 'రాజకీయాలు రక్తసంబంధాన్ని గుర్తింపవు' - అన్న ఆంగ్లసామెత ముస్లిములకు, ఆంగ్లేయులకు మాత్రమేకాక భారతీయులకు సహితం వర్తిస్తుంది.

## సనాతన ప్రియత్వం

మరొక అంశాన్ని మాత్రం పరిశీలిద్దాము. సనాతన ప్రియత్వం భారతీయ సంస్కృతికి మరొక విశిష్ట లక్షణంగా భావిస్తుంటారు. అనాదిగా వచ్చే సంప్రదాయాల పట్ల - సంస్థలపట్ల భారతీయులకు అభిమానమన్నది యథార్థమే. ''మా నాగరికత సింధునాగరికత అంతటి ప్రాచీనం'' అని సగర్వంగా చెప్పుకొనడం అందరికీ అనుభవమే. ఈ లక్షణం ఎంతవరకు సుగుణమో, ఎంతవరకు సమర్థనీయమో అనుమానాస్పదం. నేటికీ హిందువులు చెట్లను, పుట్లను, జంతువులను, వినాయకుని వంటి నరమృగాలను పూజిస్తారు. ఇవి ఆదిమ లేక ఆటవిక జీవిత దశకు చిహ్నాలు. జీవపరిణామ క్రమంలో కిరీటప్రాయమైన మానవుడు జంతువులకు సాష్టాంగపడటం యోగ్యమా? అన్న ప్రశ్నకు ఎవరికి వారు సమాధానం చెప్పుకోవలసిందే. అనేక అనర్థాలకు మూలమైన వర్ణవ్యవస్థను నేటికీ పరమ పవిత్రంగా కొందరుహిందువులు భావిస్తారు. ఆ వ్యవస్థకు దివ్యత్వం ఆపాదించి సమర్థించే భగవద్గీత ఈనాటికీ పరమ పవిత్ర గ్రంథం! ఇవన్నీ హిందువుల సనాతన ప్రియత్వానికి, సామాజిక ప్రగతిపట్ల విముఖత్వానికి నిదర్శనాలు. వాస్తవానికి సనాతన ప్రియత్వం మానవ పురోగతికి ఆటంకమైన మానసిక రుగ్మతల్లో ఒకటి. కాని ఈ లక్షణం సయితం ఒక జాతికిగాని, ఒక మతానికి గాని ప్రత్యేకంగా సొంతమైన లక్షణం కాదు. అది మానవ లక్షణం. ఈ గుణాన్ని కవచంగా - రక్షణగా పెంపొందించుకుంటూ ఉంటాడు. ప్రాచీన సంప్రదాయాలనుండి, సంస్థలనుండి విముక్తి పొంది నూతన సంప్రదాయాలను నిర్మించుకొనడం చాల శ్రమతో కూడిన కృషి. కొత్త సంస్థల నిర్మాణం ఒక యెత్తు. వాని కనుగుణంగా జీవితాన్ని

తీర్చిదిద్దుకొనడం మరొక యెత్తు. అందుచేత పాతను త్యజించడం అనగా కష్టభూయిష్టమై బాధ్యతను కోరితెచ్చుకోవడమే. ఈ బాధ్యతా భారం వహించడానికి బదులు పాత సంస్థలక ఘనతను - దివ్యత్వాన్ని ఆపాదించి సంతృప్తి పడుతుంటాడు. మానవునిలోని ఈ సనాత ప్రియత్వమే చరిత్రలో హింసాయుత విప్లవాలకు ఒక ప్రధానకారణం. మనదేశంలో కూడ మార్పులు రాలేకపోలేదు. కాని అవి విప్లవాల వల్ల వచ్చినవి కావు; విదేశపు దాడులవల్ల వచ్చినవి మన సంస్కృతి చరిత్రలో అభ్యుదయ యుగాలన్నీ విదేశ దండయాత్రల తరువాతి యుగాలే ఆర్య దండయాత్రల తరువాత బౌద్ధయుగం; శక యవన కుషాణ దండయాత్రల తరువాత గుప్తయుగం; ముస్లిం దండయాత్రల అనంతరం కబీర్ - రామానంద - రామదాసుల యుగం ఆంగ్ల రాజ్యస్థాపన అనంతరం రాజారామమోహనరాయ్‌తో ప్రారంభమైన భారత పునరుజ్జీవన ద్యమం ఈ ఉద్యమాలు సైతం ద్విముఖంగా సాగినాయి. ఒకటి సనాతన సంప్రదాయాన్ని రక్షింపగోరేది; రెండవది సంస్కరణ కాంక్షించేది. ఇతర దేశాల్లో నేటికీ కన్పించే అనే రాజకీయ సమస్యలకు సనాతన ప్రియత్వమే కారణము.

ఈ పరిశీలనవల్ల భారతీయ సంస్కృతి కేవలం మానవ నైజ గుణాలు నిర్మించినట్టిదేనని తేలిన సారాంశం. ఈ గుణాలు భారతీయుల కెంత నిసర్గమో ఇతర జాతులకంతే సహజం. చాలా గుణాలు ప్రకృతిచేత నియమితాలు కావు. వీనిలో మార్పు, పరిణామాలు కూడా సహజమే. మానవుని ప్రవర్తన చాలావరకు సంప్రదాయానుగుణమే కావచ్చు. కాని సంప్రదాయా లను నిర్మించినది మానవుడే. వాని పునర్నిర్మాణము కూడా మానవుని చేతిలోని పనియే. ఎంత సంప్రదాయ ప్రియుడైనా మానవుడు పరిస్థితుల కనుగుణంగా మారడానికి ప్రయత్ని స్తాడు; సాధ్యమైనంతవరకు పరిస్థితులను తనకనుకూలంగా మలచుకుంటాడు. ఈ రెండు కార్యక్రమాల కథనమే చరిత్ర. జీవితంలో విజయానికి, మానవజాతి పురోగతికి ఈ కార్యక్ర మాలే కీలకం. అందుచేత ''ఒక సంస్థగానీ, ఒక విలువగానీ, ఒకజాతి ఉపజ్ఞకు మాత్రమే సరిపడుతుంది. మరొక జాతికి సరిపడదు'' అనడం యుక్తం కాదు. తన ప్రయోజనార్థమే మానవుడు సంస్థలు నిర్మించుకుంటాడు. ఆ ప్రయోజనం నెరవేరడంతో ఆ సంస్థను త్యజించి వేరొకదాన్ని నిర్మించుకోగలడు. ఇట్టి మానవ సృజనా సామర్థ్యము ఏ ఒక్క జాతికి పరిమితం కాదు. సమస్త మానవజాతి ఉమ్మడి వారసత్వము. మానవజాతి అభ్యున్నతికి మానవ సృజనా సామర్థ్యంలో ఉమ్మడి వారసత్వంలో అచంచలమైన విశ్వాసం అవసరం. గ్రాహం క్లార్క్ అనే పురాతత్త్వవేత్త చెప్పినట్లు ''మానవజాతి వుమ్మడి చరిత్రను అధ్యయనం చేయడమే మన తక్షణ కర్తవ్యం. నేడు మానవజాతి సమైక్యం అవుతుంది. కాని అది కేవలం ఆధునిక ప్రయాణ సౌకర్యాలవల్ల కానీ పారిశ్రామిక నాగరికతలోని భౌతిక తత్త్వాల వల్లగానీ సాధించే సమైక్యం కాదు. మావవజాతి ఉమ్మడి వారసత్వాన్ని గ్రహించడం ద్వారా సాధింపగల ఐకమత్యము.''

ఈ సందేశంలోని సత్యాన్ని గుర్తించి ప్రతి వ్యక్తీ ప్రతి సంస్థ మానవజాతి ఉమ్మడి వారసత్వాన్ని గుర్తించేటట్లు చేసి, ఆ వారసత్వానికి మెరుగులు దిద్దడం అవసరం. మానవ జాతిలోని భిన్నత్వంపై గాక ఏకత్వంపైనే తమ దృష్టిని, కృషిని కేంద్రీకరించవలె. మానవత్వా నికి గుర్తింపు కలిగినపుడే వసుధైక కుటుంబం సాధ్యమై ప్రపంచం శాంతిధామ మౌతుంది.
— 1964.

# 2. ప్రాచీన భారత మత సంప్రదాయము

భారతీయ సంస్కృతిలో మతం పాలు ఎక్కువేనవడం నిర్వివాదం. అనాదిగా భారతదే శంలో అనేక ప్రయోగాలద్వారా మతంలో పెక్కు పరిణామాలు జరిగినాయి. ప్రాచీన కాలంనుండి దేశంలో అనేక జాతులవారు ప్రవేశించారు. వారి వారి మతాచారాలు తెచ్చారు. ఆగంతుకులకు, స్థానికులకు ప్రథమంలో సాంస్కృతికమైన సంఘర్షణ జరిగింది. కాని క్రమంగా భిన్నమతాల సంస్కృతుల మధ్య సామరస్యంద్వారా సమన్వయం ఏర్పడుతూ ఉండేది ఈవిధంగా సమన్వయసిద్ధమైన మతానికి ఆముష్మిక లక్ష్యం ఏమయినప్పటికి ఐహిక లక్ష్యం మాత్రం చాల ఉదాత్తమైనది. భిన్నజాతులు సమైక్యమై ఏక సంస్కృతి నవలంబించి జాతీయ జీవనంలో అంతర్లీనం కావడమే దాని లక్ష్యమని చెప్పవలె. ఈ సమన్వయ ఉద్యమం చాలవరకు స్థానిక అగ్రవర్ణాల నాయకత్వంలోనే జరుగుతూ ఉండేది. తమ ఆధిపత్యానికి, ఆధిక్యతకు భంగంరాని రీతిలో వారీ ఉద్యమాలు నడిపేవారు.

భారతీయ సంస్కృతిలో కన్పించే నాగరికమూ, ఉదాత్తమూ అయినదంతా ఆర్య సంబంధమనీ - అందుకు వ్యతిరేకమైనదంతా ఆర్యేతరము లేక ద్రావిడమనే అభిప్రాయానికి నేడు విలువలేదు. ఆర్యులు దేశంలో ప్రవేశించడానికి చాలరోజులకు పూర్వమే స్థానికులు వాయవ్యభారతంలో నగరాలు నిర్మించుకొని అత్యున్నతమైన నాగరికత ననుభవిస్తూ ఉన్నట్లు పురాతత్త్వ పరిశోధనలు స్పష్టం చేసినాయి. వారిమతంలో కూడా ప్రాచీన ఆర్యమ తంలో కంటె ఉదాత్తభావనలున్నట్లు తెలుస్తున్నది. ఆర్య అనార్య సంస్కృతీ సమ్మేళనమే భారతీయ సంస్కృతీ సంప్రదాయాలన్నింటికీ పునాది అని చెప్పవచ్చు.

పురాతత్త్వ పరిశోధనలతోబాటు వైదిక వాఙ్మయం సయితం అనార్య నాగరికతను శ్లాఘిస్తూనే ఉంది. అంతటి ఉన్నత దశను చేరడానికి అనేక శతాబ్దాల నిరంతర కృషి అవసరం. అందుచేత స్థానికమైన అనార్య సంప్రదాయాలు చాల ప్రాచీనములని అంగీకరించవలె. అనా ర్యుల లేక ద్రావిడుల మతానికి భక్తి ముఖ్య లక్షణమైనట్లు కన్పిస్తుంది. కాని తాంత్రిక శక్తులందు వారికి పిచ్చి నమ్మకం. ఆ తాంత్రిక శక్తులలో విశ్వాసమే అధర్వణవేదంలో ప్రవేశించింది. ద్రావిడులలో సమష్టికృషికంటే వ్యక్తి కృషికే గౌరవం ఎక్కువ. సత్యశౌచాలను వ్యక్తియే సాధించవలె. ఆర్యుల మతంలో తదనంతరం ప్రముఖస్థానమాక్రమించిన పునర్జన్మ సిద్ధాంతాని కికూడ మూలం ద్రావిడ ఆచారాలలో కన్పిస్తుంది. సింధునాగరికతా కేంద్రాల్లో దొరికిన పశుపతి బొమ్మలున్న ముద్రలమబట్టి చూస్తే ప్రజలలో యోగవిద్యాభ్యాసం ఉండేది; వారి ఆరాధ్యదైవం మహాయోగి అయిన పశుపతి. ఇతణ్ణి గురించి, ఈతని దేవి అయిన అమ్మతల్లిని గురించి - వీరికి సంకేతాలయిన లింగ యోని పూజనుగురించి వేరే చెప్పనక్కర లేదు. తరువాతికాలంలో సైతం శరీరముఖాలను ఎంతగా వర్జించితే ఆత్మ అంతగా పారిశుద్ధ్యాన్ని పొందుతుందనే నమ్మకం ద్రావిడ సంప్రదాయాలనుండియే వచ్చి వుంటుంది. కష్టాలను మెనుదీయనివారే దేవుని సామీప్యాన్ని - మోక్షాన్ని పొందగలరు. ఈ సిద్ధాంతమే జైనమతంలో

తీర్చిదిద్దుకొనడం మరొక యెత్తు. అందుచేత పాతను త్యజించడం అనగా కష్టభూయిష్ఠమైన బాధ్యతను కోరితెచ్చుకోవడమే. ఈ బాధ్యతా భారం వహించడానికి బదులు పాత సంస్థలకు ఘనతను - దివ్యత్వాన్ని ఆపాదించి సంతృప్తి పడుతుంటాడు. మానవునిలోని ఈ సనాతన ప్రియత్వమే చరిత్రలో హింసాయుత విప్లవాలకు ఒక ప్రధానకారణం. మనదేశంలో కూడా మార్పులు రాలేకపోలేదు. కాని అవి విప్లవాల వల్ల వచ్చినవి కావు; విదేశపు దాడులవల్ల వచ్చినవి. మన సంస్కృతి చరిత్రలో అభ్యుదయ యుగాలన్నీ విదేశ దండయాత్రల తరువాతి యుగాలే. ఆర్య దండయాత్రల తరువాత బౌద్ధయుగం; శక యవన కుషాణ దండయాత్రల తరువాత గుప్తయుగం; ముస్లిం దండయాత్రల అనంతరం కబీర్ - రామానంద - రామదాసుల యుగం; ఆంగ్ల రాజ్యస్థాపన అనంతరం రాజారామమోహనరాయ్‌తో ప్రారంభమైన భారత పునరుజ్జీవనోద్యమం. ఈ ఉద్యమాలు సైతం ద్విముఖంగా సాగినాయి. ఒకటి సనాతన సంప్రదాయాన్ని రక్షింపగోరేది; రెండవది సంస్కరణ కాంక్షించేది. ఇతర దేశాల్లో నేటికీ కన్పించే అనేక రాజకీయ సమస్యలకు సనాతన ప్రియత్వమే కారణము.

ఈ పరిశీలనవల్ల భారతీయ సంస్కృతి కేవలం మానవ నైజ గుణాలు నిర్మించినట్టిదేనని తేలిన సారాంశం. ఈ గుణాలు భారతీయుల కెంత నిసర్గమో ఇతర జాతులకంతే సహజం. చాలా గుణాలు ప్రకృతిచేత నియమితాలు కావు. వీనిలో మార్పు, పరిణామాలు కూడా సహజమే. మానవుని ప్రవర్తన చాలావరకు సంప్రదాయానుగుణమే కావచ్చు. కాని సంప్రదాయాలను నిర్మించినది మానవుడే. వాని పునర్నిర్మాణము కూడా మానవుని చేతిలోని పనియే. ఎంత సంప్రదాయ ప్రియుడైనా మానవుడు పరిస్థితుల కనుగుణంగా మారడానికి ప్రయత్నిస్తాడు; సాధ్యమైనంతవరకు పరిస్థితులను తనకనుకూలంగా మలచుకుంటాడు. ఈ రెండు కార్యక్రమాల కథనమే చరిత్ర. జీవితంలో విజయానికి, మానవజాతి పురోగతికి ఈ కార్యక్రమాలే కీలకం. అందుచేత ''ఒక సంస్థగానీ, ఒక విలువగానీ, ఒకజాతి ఉపజ్ఞకు మాత్రమే సరిపడుతుంది. మరొక జాతికి సరిపడదు'' అనడం యుక్తం కాదు. తన ప్రయోజనార్థమే మానవుడు సంస్థలు నిర్మించుకుంటాడు. ఆ ప్రయోజనం నెరవేరడంతో ఆ సంస్థను త్యజించి వేరొకదాన్ని నిర్మించుకోగలడు. ఇట్టి మానవ సృజనా సామర్థ్యము ఏ ఒక్క జాతికి పరిమితం కాదు. సమస్త మానవజాతి ఉమ్మడి వారసత్వము. మానవజాతి అభ్యున్నతికి మానవ సృజనా సామర్థ్యంలో ఉమ్మడి వారసత్వంలో అచంచలమైన విశ్వాసం అవసరం. గ్రాహం క్లార్క్ అనే పురాతత్త్వవేత్త చెప్పినట్లు ''మానవజాతి వుమ్మడి చరిత్రను అధ్యయనం చేయడమే మన తక్షణ కర్తవ్యం. నేడు మానవజాతి సమైక్యం అవుతుంది. కాని అది కేవలం ఆధునిక ప్రయాణ సౌకర్యాలవల్ల కానీ పారిశ్రామిక నాగరికతలోని భౌతిక తత్త్వాల వల్లగానీ సాధించే సమైక్యం కాదు. మానవజాతి ఉమ్మడి వారసత్వాన్ని గ్రహించడం ద్వారా సాధింపగల ఐకమత్యము.''

ఈ సందేశంలోని సత్యాన్ని గుర్తించి ప్రతి వ్యక్తీ ప్రతి సంస్థ మానవజాతి ఉమ్మడి వారసత్వాన్ని గుర్తించేటట్లు చేసి, ఆ వారసత్వానికి మెరుగులు దిద్దడం అవసరం. మానవ జాతిలోని భిన్నత్వంపై గాక ఏకత్వంపైనే తమ దృష్టిని, కృషిని కేంద్రీకరించవలె. మానవత్వానికి గుర్తింపు కలిగినపుడే వసుధైక కుటుంబం సాధ్యమై ప్రపంచం శాంతిధామ మౌతుంది.

— 1964.

# 2. ప్రాచీన భారత మత సంప్రదాయము

భారతీయ సంస్కృతిలో మతం పాలు ఎక్కువేనవడం నిర్వివాదం. అనాదిగా భారతదేశంలో అనేక ప్రయోగాలద్వారా మతంలో పెక్కు పరిణామాలు జరిగినాయి. ప్రాచీన కాలంనుండి దేశంలో అనేక జాతులవారు ప్రవేశించారు. వారి వారి మతాచారాలు తెచ్చారు. ఆగంతుకులకు, స్థానికులకు ప్రథమంలో సాంస్కృతికమైన సంఘర్షణ జరిగింది. కాని క్రమంగా భిన్నమతాల సంస్కృతుల మధ్య సామరస్యంద్వారా సమన్వయం ఏర్పడుతూ ఉండేది ఈవిధంగా సమన్వయసిద్ధమైన మతానికి ఆముష్మిక లక్ష్యం ఏమయినప్పటికి ఐహిక లక్ష్యం మాత్రం చాల ఉదాత్తమైనది. భిన్నజాతులు సమైక్యమై ఏక సంస్కృతి నవలంభించి జాతీయ జీవనంలో అంతర్లీనం కావడమే దాని లక్ష్యమని చెప్పవలె. ఈ సమన్వయ ఉద్యమం చాలవరకు స్థానిక అగ్రవర్ణాల నాయకత్వంలోనే జరుగుతూ ఉండేది. తమ ఆధిపత్యానికి, ఆధికారానికు భంగంరాని రీతిలో వారీ ఉద్యమాలు నడిపేవారు.

భారతీయ సంస్కృతిలో కన్పించే నాగరికమూ, ఉదాత్తమూ అయినదంతా ఆర్య సంబంధమనీ - అందుకు వ్యతిరేకమైనదంతా ఆర్యేతరము లేక ద్రావిడమనే అభిప్రాయానికి నేడు విలువలేదు. ఆర్యులు దేశంలో ప్రవేశించడానికి చాలరోజులకు పూర్వమే స్థానికులు వాయవ్యభారతంలో నగరాలు నిర్మించుకొని అత్యున్నతమైన నాగరికత ననుభవిస్తూ ఉన్నట్లు పురాతత్త్వ పరిశోధనలు స్పష్టం చేసినాయి. వారిమతంలో కూడా ప్రాచీన ఆర్యమతంలో కంటె ఉదాత్తభావనలున్నట్లు తెలుస్తున్నది. ఆర్య అనార్య సంస్కృతీ సమ్మేళనమే భారతీయ సంస్కృతీ సంప్రదాయాలన్నింటికీ పునాది అని చెప్పవచ్చు.

పురాతత్త్వ పరిశోధనలతోబాటు వైదిక వాఙ్మయం సయితం అనార్య నాగరికతను శ్లాఘిస్తూనే ఉంది. అంతటి ఉన్నత దశను చేరడానికి అనేక శతాబ్దాల నిరంతర కృషి అవసరం. అందుచేత స్థానికమైన అనార్య సంప్రదాయాలు చాల ప్రాచీనములని అంగీకరించవలె. అనార్యుల లేక ద్రావిడుల మతానికి భక్తి ముఖ్య లక్షణమైనట్లు కన్పిస్తుంది. కాని తాంత్రిక శక్తులందు వారికి పిచ్చి నమ్మకం. ఆ తాంత్రిక శక్తులలో విశ్వాసమే అథర్వణవేదంలో ప్రవేశించింది. ద్రావిడులలో సమష్టికృషికంటే వ్యక్తి కృషికే గౌరవం ఎక్కువ. సత్యశౌచాలను వ్యక్తియే సాధించవలె. ఆర్యుల మతంలో తదనంతరం ప్రముఖస్థానమాక్రమించిన పునర్జన్మ సిద్ధాంతానికికూడ మూలం ద్రావిడ ఆచారాలలో కన్పిస్తుంది. సింధునాగరికతా కేంద్రాల్లో దొరికిన పశుపతి బొమ్మలున్న ముద్రలమబట్టి చూస్తే ప్రజలలో యోగవిద్యాభ్యాసం ఉండేది; వారి ఆరాధ్యదైవం మహాయోగి అయిన పశుపతి. ఇతణ్ణి గురించి, ఈతని దేవి అయిన అమ్మతల్లిని గురించి - వీరికి సంకేతాలయిన లింగ యోని పూజనుగురించి వేరే చెప్పనక్కర లేదు. తరువాతికాలంలో సైతం శరీరసుఖాలను ఎంతగా వర్జించితే ఆత్మ అంతగా పారిశుద్ధ్యాన్ని పొందుతుందనే నమ్మకం ద్రావిడ సంప్రదాయాలనుండియే వచ్చి వుంటుంది. కష్టాలను మెనదీయనివారే దేవుని సామీప్యాన్ని - మోక్షాన్ని పొందగలరు. ఈ సిద్ధాంతమే జైనమతంలో

ప్రాబల్యం వహించింది. నేటి 'హిందూ' మతానికి వ్రతం ఒక ముఖ్య లక్షణం. ప్రతి వ్రతాని దీక్షవుంటుంది. స్నానం, ఉపవాసం దీక్షలో భాగాలు. ఇవి శరీరాన్ని కష్టపెట్టడమే! ఉపవసిం చడం అంటే సమీపంలో ఉండడం. అంటే భగవంతుని సాన్నిధ్యంలో ఉండడం అని భావం.

హైందవమత పరిణామంలో ప్రధానాశయంగా రూపొందిన శ్రమణక లేక పరివ్రాజక విధానంకూడ ఆర్యేతరమే. ఆర్యులు ప్రాబల్యం వహించిన తరువాత పరివ్రాజక విధానం జైన బౌద్ధాలతో సంబంధించి పెంపొందింది. జైన బౌద్ధమతాలీ విధానాన్ని అనార్యుల నుండియే స్వీకరించినారు. రెండుమతాల ఒక లక్ష్యం ఆర్య - అనార్య సంస్కృతీ సమన్వయమే. జాకోబీ మొదలైన పరిశోధకుల అభిప్రాయంలో జైన బౌద్ధాల సిద్ధాంతాలలో చాలభాగం అనార్య సంస్కృతీ విశేషాలే. ఈ రెండు మతాల్లో జైనానికి వైదికయుగంలోనే పునాదులున్నాయని జైనుల విశ్వాసం. ఏమైనా ఈ రెండు మతాలు పూర్తి పరిణితి చెందక పూర్వమే దేశంలో పరివ్రాజక సంఘాలుండి వేర్వేరు సిద్ధాంతాలను ప్రచారంచేస్తూ ఉండేవారు. అజితకేశకంబళి, కకుదకత్యాయన మొదలైన వారా సంఘాలకు నాయకులు. రామాయణ ఇతిహాసాన్ని బట్టి శబరి పరివ్రాజకి; దండకాటవిలో పరివ్రాజక వేషంలోనే రావణుడు సీతను సమీపించినాడు. సనాతన బ్రాహ్మణ మతస్థుల్లో క్రీస్తు తరువాత 9వ శతాబ్దంవరకు పరివ్రాజకులపట్ల ఆదరణ ఉండేదికాదు. పితృకర్మ చేస్తున్న మండన మిశ్రుడు త్రిదండి రూపంలో ఉన్న శంకరాచార్యుడు చూచినందున తన శ్రాద్ధకర్మ భగ్నమైనదని విందిస్తాడు. బ్రాహ్మణ మతస్థుల్లో పరివ్రాజక విధానానికి పూర్తి గౌరవం చేకూర్చినది శంకరాచార్యులేనని చెప్పవచ్చు!

నేటికి సుమారు 3500ల సంవత్సరములకు పూర్వం ఆర్యులు దేశంలో ప్రవేశించినారు. అనార్యజాతుల దాసదస్యుల తోటి యుద్ధాలలో విజయం చేకూర్చుమని తమ యుద్ధాధిదేవత అయిన ఇంద్రుని గురించి ప్రార్థనలతో వేదాలు నిండివుంటాయి. ఇంద్రుని ప్రీత్యర్థం జరిపే కర్మకాండయే యజ్ఞం. వైదిక మతంలో యజ్ఞమే విశ్వానికి కేంద్రంగా పరిగణింపబడింది. కుటుంబం, రాజనీతి, శాస్త్రం, సమస్తకళలు అన్నీ యజ్ఞం నుండి ఆవిర్భవించినాయని నాడు విశ్వసించేవారు. వేదాలలోని బ్రాహ్మణ విభాగంలో యజ్ఞవిధానం గురించి, ప్రాశస్త్యాన్ని గురించి విపులంగా కన్పిస్తుంది. బ్రాహ్మణాలను కంఠస్థం చేసి యజ్ఞాలు నిర్వహించడంలో తోడ్పడేవారే క్రమంగా బ్రాహ్మణులుగా వ్యవహారంలోనికి వచ్చి వుంటారు. యజ్ఞక్రమాన్ని గురించి వివిధములైన వ్యాఖ్యానాలు రాసాగినాయి. అవి పూర్వమీమాంసగా ప్రసిద్ధ దర్శన రూపం వహించింది.

యజ్ఞంతోపాటు ఆర్యులు బహుదేవతారాధన తెచ్చినారు. వైదిక దేవతలందరిదీ సమానమైన హోదా. వారిలో హెచ్చుతగ్గులు లేవు. కాని వైదిక యుగాంతానికి 'ప్రజాపతి' భావం ఏర్పడింది. ప్రజాపతి సర్వశ్రేష్ఠుడైన దేవుడు. ఇతర దేవతలాతనిభిన్న అంశాలే. అయితే ఈ భావం అనార్యజాతుల్లో ప్రబలంగా ఉన్న 'భూతవాద' (Animism) ప్రభావఫలితం అయివుండవచ్చు. విశ్వవ్యాప్తమైన అద్భుతశక్తి ఒకటి ఉందనీ ప్రపంచంలోని స్థావరజంగమాలన్నీ ఆశక్తి భాగస్వాములనే విశ్వాసమే భూతవాదానికి పునాది.

రాజకీయంగా విజేతలయిన ఆర్యులు విజితులైన అనార్యులలో తమతమ సంస్కృతులను ప్రచారం చేయబూనుకున్నారు. ఇది సర్వసాధారణమే! అనార్యు లా ఉద్యమాన్ని ప్రతిఘ

టించి నారు. రామాయణంలోని మారీచ-సుబాహుల ఉదంతాల వంటివి తొలి వేదయుగంలో చాల జరిగివుండవచ్చు. తమ భూముల్లో తమ మతానికి భిన్నము - హింసాత్మకముమైన యజ్ఞాలు జరగడాన్ని అనార్యులు నిరోధించి ఉండవచ్చు. ఒకే ప్రాంతంలో నిర్దుష్టముమైన భిన్న సంస్కృతులు తారసిల్లిన తొలిదశలో ఇట్టి సంఘర్షణలు తప్పవు. అనార్య ప్రతిఘటన క్రమంగా వీగిపోయింది. ఆర్యప్రభువులు సయితం అనార్య ఆధ్యాత్మిక భావనల - పూజావిధానాలలోని గొప్పదనాన్ని గుర్తించి, అభిమానించకపోలేదు. సాంఘికంగా కూడ ఆర్య అనార్య జాతులకు సన్నిహితత్వం ఏర్పడసాగింది. అనార్య స్త్రీలపట్ల వ్యామోహంతో ఆర్యప్రభువులు వారిని వివాహమాడినారు. వారి సంతానానికి రాజ్యాభిషేకం చేశారు. సార్వభౌమాధికారం కోసం ఆర్య ప్రభువులమధ్య జరిగిన పోరాటంలో అనార్య సైన్యాలు ఉభయపక్షాలలోను పోరాడినాయి. అనార్యుల సర్వమ్యగ్రనైవమైన హనుమంతుని ఆర్యవీరుడైన రామునికి బంటుగా చేయడం అనార్యమతంపై ఆర్యమతం సాధించిన విజయానికి సూచన అని రాధాకృష్ణ పండితుని అభిప్రాయం. కాని హనుమంతుని పరమ భక్తాగ్రేసరుడుగా గుర్తించడం భక్తి విధానానికి విజయమేనని చెప్పవలె! ప్రథమదశలో అనార్య సంస్కృతిపట్ల అభిమానం వహించినవారిలో గణుతింపదగినవాడు వేనుడు. అతడు పూజారుల స్వార్థానికి బలి అయినాడు. కాని ఆతని ఆత్మబలిదానం వృథాకాలేదు. అమాయక జంతువుల రక్తంతో దేశాన్ని ముంచెత్తుతున్న యజ్ఞాలప్రయోజకత్వాన్ని, పూజారివర్గ దురాశా దౌర్జన్యాలను గుర్తించి ప్రభువులు - ప్రజలు ఆలోచింప సాగినారు. ముఖ్యంగా రాజుల - పూజారుల నిరంకుశ దౌర్జన్యం నుండి విముక్తి పొంది, సమాజంలో సాంస్కృతిక పరమైన సంఘర్షణను అంతమొందించి, భిన్న సంస్కృతీ వర్గాల సమైక్యం చేసి, సాంఘిక భద్రతను సాధింపగల జీవిత విధానాన్ని - ఒక కొత్తమతాన్ని రూపొందించడం తమ కర్తవ్యంగా భావించి కృషి ప్రారంభించినారు. దేశంలో ఒక విప్లవం ప్రారంభమయింది. ఈ విప్లవంలో రెండు ముఖ్యాంశాలు గమనింపదగినవి వున్నాయి. 'బ్రాహ్మణో మమదేవతా' అంటూ వుండిన క్షత్రియులు దేశంలో మతపరమైన నాయకత్వాన్ని పూజారివర్గం నుండి సంగ్రహించడం; భిన్నజాతుల భిన్న సంస్కృతుల సమన్వయానికి నూతన మార్గం అన్వేషించడం. మధ్యయుగంలో మొగల్ పాదుషా అక్బర్ నెదిరించిన సమస్యవంటిదే నాటి రాజుల నెదిరించింది. వారి ఆవేదన ద్విముఖంగా సాగింది: ఒకటి తాత్త్విక పరమైంది; మరొకటి విశ్వాసాలు, మతాచారాలకు సంబంధించినది. ఈ రెండు ఉద్యమాలకు క్షత్రియులే నాయకత్వం వహించినారు. ఉదార భావావేశం ఉన్న పూజారివర్గ సభ్యుల సహాయసహకారాలు వారికి లభించినాయి.

తాత్త్వికపరమైన ఆలోచనలు ఉపనిషత్తులుగా రూపొందినాయి. హేతుబుద్ధితో మానవుడే యజ్ఞావతారమని, జీవయాత్రయే యజ్ఞంలోని కర్మకాండయని ఉపనిషత్తులు చాటినాయి. సత్యాహింసలు తపోదానాలు మానవ యజ్ఞ బత్తెములయినాయి. ప్రకృతికి, మానవునకు ఉన్న సంబంధాల పరిశీలన జరిగింది. ''ప్రకృతియే సృష్టికర్త; కాలమే లయకారుడు; మానవుని సుఖదుఃఖాలకు, పుణ్యాపాపాలకు సంబంధం లేదు; స్వర్గనరకాలు అభూతకల్పనలు, ప్రపంచమే సత్యము'' అనే సిద్ధాంతాలు ప్రచారమైనాయి. ఈ హేతుత్వం ముఖ్యంగా సాంఖ్య, న్యాయ, వైశేషిక, బార్హస్పత్య దర్శనాలలో పరాకాష్ఠ నందింది. ఉపనిషత్తులలో కన్పించే 'మాయ' సిద్ధాంతాన్ని, ఆధ్యాత్మికతను సయితం ఎదిరించి సాధారణ విజ్ఞానంపై మానవ

సంస్కృతిని పెంపొందించడానికి దర్శనాలు ప్రయత్నించినాయి. ప్రకృతికాధారంగా ప్రపంచాన్ని సాంఖ్యులు వ్యాఖ్యానించినారు. ప్రపంచం మూలపదార్థాల సమ్మేళనం అంటూ వైశేషికులు అణువాదాన్ని నిర్మించినారు. అంతర్వాణి, మానవాతీత శక్తులను ఖండించి, జ్ఞానం మానవునిలోనే కలుగుతుందని నైయ్యాయికులు వాదించారు. వీటన్నిటిలోను తీవ్రవాదం బార్హస్పత్యమనే చార్వాకదర్శనం. చార్వాకులు బ్రాహ్మణ మతాన్ని నిర్దాక్షిణ్యంగా తూర్పార బట్టినారు. ''వేదాల అపౌరుషేయత్వం నమ్మేవారు బుద్ధిబలంగాని, మగతనంగాని లేనివారు'' అన్నారు. సుఖకరమైన జీవనోపాధియే వారి ఆశయం. ''ఇంద్రియాల ద్వారా మాత్రమే జ్ఞాన సాధనకు అవకాశం వుంది. పదార్థమే సత్యం; బుద్ధికూడ ఆలోచనాశక్తి యున్న పదార్థమే. ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి కాని, వ్యాఖ్యానించడానికిగాని సృష్టికర్త అనే ప్రాతిపదిక అనవసరం. జీవించడమే జీవితోద్దేశ్యం; సౌఖ్యమే జ్ఞానం'' అని బృహస్పతి బోధనల సారాంశం. ఈ విధంగా దర్శనాలు మానవ విజ్ఞానానికి అనుభవము పరిశీలనలే మార్గమనీ, జీవితమే పరమలక్ష్యమనీ ప్రతిపాదించాయి.

మతపరంగా ఉపనిషత్తులు యజ్ఞాలను తిరస్కరించి 'బ్రహ్మ' సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాయి. విశ్వం యావత్తూ 'పరమాత్మ' బాహ్య స్వరూపమనీ, మానవులు తాము 'పరమాత్మ' లేక 'బ్రహ్మ' అంశమని గ్రహించడమే కైవల్యమనీ బోధించినాయి. అలా గ్రహించడానికి సాధనం అవసరమనీ, భక్తి-జ్ఞాన వైరాగ్య మార్గాలు కైవల్యానికి సాధనలనీ బోధించినాయి. ఉపనిషత్తుల 'బ్రహ్మ పదార్థం' ఆర్యేతరుల భూతవాదానికి క్లిష్టమైన రూపాంతరమే. సామాజికంగా 'ఆత్మ-పరమాత్మ' సిద్ధాంతం జాతివిభేదాలు, వర్ణవ్యత్యాసాలు కేవలము కృత్రిమములనీ అర్థరహితములనీ చాటుతుంది. అంటే ఆర్య-అనార్య జాతి సమ్మేళనానికి మార్గం సుగమం చేసింది.

ఉపనిషత్తుల బోధనలు, దర్శనాల జిజ్ఞాస తూర్పు భారతంలో, అంటే ఆర్య సంస్కృతి పూర్తిగా విస్తరించిన మగధలో, జైన బౌద్ధాలుగా పరిణామం చెందినాయి. జైన తీర్థంకరులందరూ రాకుమారులే. బౌద్ధమత స్థాపకుడైన గౌతమ బుద్ధుడు శాక్యవంశ క్షత్రియుడు. ఈ రెండూ నిరీశ్వరవాదాలే. ఉపనిషత్తులకు కీలకమైన ఆత్మ సిద్ధాంతాన్ని సయితం బౌద్ధం తిరస్కరించింది. ఆత్మలో విశ్వాసమే అనర్థాలన్నింటికి కారణమని బుద్ధుడు చాటినాడు. జైన బౌద్ధాలు రెండూ బ్రాహ్మణ మతాన్ని, వేదాలను, యజ్ఞాలను ఆక్షేపించినాయి. దేవుడు, సృష్టి అనే వానిని గురించిన శుష్కవాదోపవాదాలు మానవ సమాజాన్ని ముందుకు తీసుకుపోలేవనే పరిజ్ఞానం ప్రజల్లో కలిగించినాయి. 'బ్రహ్మను పూజించేవారు ఆకారమూ, నామరూపాలు లేని అజ్ఞాత సుందరిని ప్రేమించే మూఢులు' అని తేవిజ్జగుత్త చాటుతోంది. నాటి బ్రాహ్మణ మతం ఆసన్న సమస్యలను నిర్లక్ష్యం చేసి, అనవసర సమస్యలను గురించి వ్యర్థ వాదోపవాదాలు పెంచింది. బుద్ధుడు ప్రజల దృష్టిని రుజుమార్గానికి మరలించడానికి ప్రయత్నించినాడు. ఐరోపాలో పునర్వికాసయుగంలో ఎరాస్‌మస్ వలె బుద్ధుడు భారతీయుల దృష్టిని మానవునకు సంబంధించిన భౌతిక సమస్యలపైకి మరలించినాడు. ''విషబాణఘాతువుకు ఔషధసేవ ప్రధాన సమస్యగాని అతని కులగోత్రాదులను గురించి గాని, బాణ నిర్మాణాన్ని గురించిగాని, దానికి కారకుడైన వానిని గురించి గాని ప్రశ్నలు హాస్యాస్పదములు. అదేవిధంగా ప్రపంచము, సృష్టి, భగవంతుడు అనే విషయాలకంటే చావుపుట్టుకలు, హింస, బాధలను గురించిన తీవ్ర సమస్యా

పరిష్కారమే జరూరు'' అని బుద్ధుడు మాలుంక్య పుత్రునకు బోధించినాడు. జీవిత సమస్యల పరిష్కార కాంక్షతో కూడిన ఆవేదన త్రిపిటకాలలోను, ఇతర ప్రాచీన బౌద్ధ గ్రంథాలలోను కనిపిస్తుంది. నిర్వాణం అనేది ఎక్కడో పరలోకంలో ఉండేది కాదు; స్వయం కృషితో ఈ లోకంలోనే సాధించేది. ఈ అభిప్రాయాలను బుద్ధుడు నలభై సంవత్సరాలు దేశ సంచారం చేసి ప్రజల్లో ప్రచారం చేసినాడు. బ్రాహ్మణ మత వ్యవస్థ సమూలంగా కదిలిపోవడానికి కారణమైనాడు. అందుకే వారతణ్ణి పాషండుడు అని నిందించారు.

ఆర్య అనార్య మత సమ్మేళన చరిత్రలో జైన బౌద్ధాలు నూతన అధ్యాయాన్ని ప్రారంభించాయి. అయితే ప్రాచీన శ్రమణక విధానంలోని కఠిన నియమాలెక్కువగా చేర్చుకున్నందున జైనం విశేష ప్రజాదరణ పొందలేదు. కాని బౌద్ధం మధ్యమార్గాన్ని సూచించింది. అంటే అటు యజ్ఞాలవల్ల, ఇటు తపశ్చర్య - యోగమార్గాలు అవలంభించి దేహాన్ని శుష్కింపజేసినందువల్ల ప్రయోజనం లేదని బుద్ధుడు బోధించినాడు. అనార్య శైవశ్రమణక మతాలలోని యోగవైరాగ్యాలను, ఆర్య మతంలోని కర్మకాండను తొలగించినాడు. అందుకే బుద్ధుడు సర్వజన సమాదరణీయుడైనాడు. వర్ణ వ్యవస్థను వైదిక మతాధికారమును ధిక్కరించి, ఆత్మ సంస్కారము ద్వారా జాతినుద్ధరించడం సాధ్యమని చెప్పినందున అనార్యులు, ఆర్యజాతి బహిష్కృతులు - ముఖ్యంగా ఆర్యావర్తానికి తూర్పు దక్షిణప్రాంతాల ప్రజానీకం, బౌద్ధానికి జోహారులర్పించి, ఆ మతాన్ని అనుసరించినారు. అందుచే బౌద్ధం బ్రాహ్మణ మతానికి ప్రతిద్వంది అయింది. రెండు మతాలకు సంఘర్షణ తప్పలేదు.

అయితే మరొక వైపున ఆస్తిక మతపరంగా సయితం విప్లవాత్మకమైన మార్పులు వచ్చినాయి. అనార్య దేవతలలో కొందరిని ఆర్యులంగీకరించక తప్పలేదు. ముఖ్యంగా పశుపతిని స్వీకరించి వైదిక రుద్రునితో సమైక్యం చేశారు. అమ్మతల్లి రుద్రుని దేవేరి అయింది. భిన్నజాతులవారు అమ్మతల్లిని వేర్వేరు పేర్లతో పిల్చేవారు. అవి అన్నీ శక్తికి పర్యాయపదాలయ్యాయి. అన్నిటి కంటె ముఖ్యమయింది అనార్యుల పూజావిధానం. 'హోమం' ఆర్యుల ఆరాధనా పద్ధతి. పుష్పాక్షతలతో ధూప-దీప-గంధాలతో మేళతాళాలతో ఆరాధించడం అనార్య విధానం. 'పూజ' అనే పదం సంస్కృతం కాదనీ, ద్రావిడభాషా సంబంధమనీ అభిప్రాయం బలంగా ఉంది. పూజలో 'భక్తి' భావం కీలకం. ఈ భావము, పూజా విధానము గ్రహించి 'భాగవతమతాన్ని' రూపొందించడం జరిగింది. ఈ మతప్రవక్త సయితం క్షత్రియుడే. అతడే వాసుదేవుడు; కృష్ణుడని కూడ అంటారు. ఆతడు యదువృష్ణి వీరుడు. కృష్ణుడు ఇంద్రవిరోధి. ప్రజాపతి గౌరవం భంగం చేసినవాడు. ఇంద్ర ప్రజాపతులు వైదిక దేవతలు. యమదమ నియమాదులు, భగవద్భక్తి భాగవతమతానికి ముఖ్య లక్షణాలు. ఈ గుణాలను వివరిస్తూ వాసుదేవుడు గీతను ప్రబోధించినాడు. యజ్ఞయాగాది కర్మకాండ లేక కేవలం భక్తికి, నైతిక ప్రవర్తనకు ప్రాధాన్యం ఇవ్వడంవల్ల వర్ణవిభేదానికి, మతగురువుల ఆధిక్యతకు భాగవత మతం గొడ్డలి పెట్టయింది. మహాభారతంలో శాంతిపర్వంలో భీష్ముడు ధర్మరాజుకు బోధించినది సైతం భాగవత మతసారమే. ''యజ్ఞంరాక్షసకృతము; సమ్యక్బుద్ధి - సమ్యగ్వాక్కు - విజ్ఞానము - మనశ్శాంతి అనేవే నిజమైన యజ్ఞం. నీతి, అవినీతులను గుర్తించడంలోనే మానవత్వముంది. ప్రేమయే సర్వమత సారము. ప్రేమ, సత్యము ప్రవర్తనకు మార్గదర్శకములుగా చేసుకొన్న వాడే భయవిముక్తుడు కాగలడు. సత్ప్రవర్తన విచక్షణా

జ్ఞానమే మానవుని "అమూల్యధనం" అంటాడు భీష్ముడు. వర్ణధర్మాలను సైతం భారతం తెగవాడింది; "కామ క్రోధ లోభమోహములు, సుఖదుఃఖములు అందరికీ సమానములై యుండగా, బ్రాహ్మ క్షత్రియ విభాగం చేయడం తెలివితక్కువ." అర్థరహితములైన కర్మకాండల బానిసత్వం నుండి వ్యక్తికి మోక్షం ప్రసాదించి, ఆతనిలో మానవత్వానికి, సహజములైన నీతి ప్రవర్తనకు, రుజు దృష్టికి దారితీసి, ఆర్య-అనార్య జాతుల మధ్య సామరస్యానికి దోహదం చేసింది. ఈ సిద్ధాంతాలను సూత్రీకరిస్తూ వాసుదేవుడు రచించిన 'గీత' మొదట్లో చాల చిన్న గ్రంథం. అది అవైదికము - అబ్రాహ్మణము. దాన్ని ఆర్య పూజారివర్గం నిషేధించినట్లు సయితం తెలుస్తుంది. అయితే భాగవత మతంపట్ల బ్రాహ్మణ విరోధం ఎంతోకాలం నిలువలేకపోయింది. ఒకవైపున బౌద్ధం దేశంలో నలుమూలలా విస్తరించి విశేష జనాదరణ పొందుతూ ఉంది. ఇంచుమించు దేశం యావత్తూ జయించిన అశోకమౌర్యుడు తాను సాధించిన రాజకీయ ఐక్యతను, సాంస్కృతిక ఐక్యతతో బలపరచి శాశ్వతం చేయాలని సంకల్పించినాడు. అందుకు సాధనం బౌద్ధంలో అతనికి కన్పించింది. బౌద్ధంలోని విశ్వజనీనములైన ప్రవర్తనా సూత్రాలను ఒక ఆదర్శ ధర్మంగా రూపొందించి ప్రచారం చేసినాడు. బౌద్ధ ప్రతిష్ఠ ఇనుమడించింది. వాయవ్య ప్రాంతాలలో స్థిరవాసం ఏర్పరచుకొన్న బాక్ట్రియా గ్రీకులు కూడ బౌద్ధాన్ని ఆదరించసాగినారు. బ్రాహ్మణ మతస్థులకు ఆందోళన ఎక్కువయింది. కనీసం ఆస్తికమైన భాగవతమతంతో రాజీపడి, విదేశయులను బౌద్ధం ఆకర్షణ నుండి తప్పించి వారి సాయంతో బౌద్ధాన్ని ప్రతిఘటించడానికి సంకల్పించినారు. తత్ఫలితంగా బ్రాహ్మణమత సంస్కరణోద్యమం ప్రారంభమయింది. వేదసిద్ధమైన కర్మకాండ; దర్శనాల వైజ్ఞానిక దృష్టి, భాగవతమతం, భక్తివిశ్వాసాలు, ఉపనిషత్తుల వేదాంతము, జైన బౌద్ధాల నైతిక ప్రవర్తన, శైవ శాక్తేయాలలోని యోగ వైరాగ్యములను క్రోడీకరించి సమన్వయంచేసి, పరమార్థ తత్త్వం బోధించే ప్రామాణిక ఉద్గ్రంథంగా, సర్వఉపనిషత్సారంగా భగవద్గీతను తయారుచేసినారు. గీతాకారుడైన చారిత్రక వాసుదేవుడు పురాణ పురుషుడు, పురుషోత్తముడు అయినాడు.

క్షత్రియులతో మాత్రమేగాక అనార్యజాతులతో సైతం బ్రాహ్మణులు రాజీకి సిద్ధమయినారు. క్షత్రియ వీరగాథలైన భారతరామాయణాలు ఇతిహాసాలై శిరోధార్యములయినాయి. అంతేగాదు భారత రామాయణవీరులు కృష్ణుడు, రాముడు ఆర్యవర్ణులుకారు. కృష్ణవర్ణులు; వేదాలను సంకలనం చేసి, పంచమవేదమైన భారతాన్ని రచించిన వేదవ్యాసుడు సంకరజాతివాడు; రామాయణకర్త విషాదుడు! ఇతిహాసాల్లోనూ, తర్వాత తయారైన పురాణాల్లోనూ ఇంద్రుడు - అంటే వైదిక యుగంలో దాసదాస్యుల పురాలుదోచి, ధ్వంసంచేసి, ఆర్యులకు అధికార ఐశ్వర్యాలు సమకూర్చిన ఏకైక వీరుడైన దేవేంద్రుడు - ప్రతిపక్షీయగు రాక్షసుని చేతిలో పరాజయం పొంది, తక్షణం స్వర్గం విడిచి పారిపోయే పరాభవానికి గురి అయినాడు. ఇవి అన్నీ బ్రాహ్మణ మతస్థులు తమ మతాన్ని రక్షించుకోవడానికి అబ్రాహ్మణుల అభిమానం సంపాదించుకోవడానికి పడిన తాపత్రయ ఫలితాలని చెప్పడంలో తప్పు లేదు.

బ్రాహ్మణుల ప్రయత్నాలు ఫలించకపోలేదు. బ్రాహ్మణమతం సంస్కరణకు గురి అవుతూ ఉన్న సమయంలోనే బౌద్ధంలో బయల్పడిన లోపాలు 'హిందూ' మత పునరుద్ధరణకు దోహదం చేసినాయి. నిర్వాణప్రాప్తికి గార్హస్థ్యం ఆటంకమని బుద్ధుడు విరాగి జీవితం ప్రోత్సహించినాడు. బౌద్ధతత్వంలోని దార్శనిక క్లిష్టతలు సామాన్యులకు అందుబాటులో

వుండేవికావు. అదీకాక కాలక్రమంలో బౌద్ధంలో అనేక సిద్ధాంత భేదాలు వచ్చి బౌద్ధాచార్యులు తార్కికచర్చల్లో మునిగి మతప్రచారం నిర్లక్ష్యం చేశారు. బౌద్ధ సిద్ధాంతంద్వారా లోకకల్యాణం సాధించడానికి ప్రయత్నించిన అశోకుడు గార్హస్థ్యంలో కూడ బౌద్ధానికి స్థానం ఇచ్చాడు. కాని గృహస్థులైన బౌద్ధుల ఆదర్శం నిర్వాణంకాదు; హిందువుల స్వర్గం వంటి ఒక సుఖమయలోకం. ప్రాపంచిక జీవితానికి - నిర్వాణానికి మధ్యస్థమైన ఆదర్శప్రాయమైన పారలౌకిక జీవితాన్ని అష్టాంగమార్గం ద్వారా గృహస్థులు పొందవచ్చునని అశోకుడు బోధించి నట్లు 'దివ్యా వద్యా' మొదలైన గ్రంథాలవల్ల తెలుస్తుంది. దీనితో బౌద్ధం తన ఆదర్శాల ఔన్నత్యాన్ని కొంతవరకు కోల్పోయింది. మహాయానంతో భక్తివిశ్వాసాలు విగ్రహారాధన, దానితో కూడిన తతంగం అంతా బౌద్ధంలో దిగుమతి అయింది. బౌద్ధంలోని శూన్య వాదమూ, 'హిందూ' అద్వైతవాదమూ చాల సన్నిహితాలు. దానితో బౌద్ధం పతనం పూర్తయింది. ప్రేమను, భక్తిని ప్రబోధించిన వైష్ణవం ప్రాబల్యంలోకి వచ్చినంతనే బుద్ధుడు విష్ణుమూర్తి అవతారమై బ్రాహ్మణుల ముక్కోటి దేవతల్లో చేరినాడు. బౌద్ధంలో ప్రజలు గ్రహించదగిన విశిష్టార్థంలేదని వ్యక్తమయింది.

బ్రాహ్మణ బౌద్ధమత సంఘర్షణ నేపథ్యంలో దేశంలో జరిగిన రాజకీయ పరిణామాలు చాల ఆసక్తిదాయకమైనవి. జైన బౌద్ధాల ప్రచారంతో క్రింది వర్ణాలలో కలిగిన చైతన్య ప్రధానమే నందవిప్లవం. నందులు అజ్ఞాత కులజులు; క్షత్రియ బ్రాహ్మణ వర్ణాలమీద ధ్వజం ఎత్తినారు. నందాయక క్షత్రియ వర్ణస్థులైన శిశునాగులను హతమార్చి నందులు మగధనాక్రమించినారు. వారిని పద భ్రష్టులను చేయడానికి బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలొకటి అయినాయి. బ్రాహ్మణ చాణక్యుని సాయంతో క్షత్రియ చంద్రగుప్తుడు నందనిర్మూలనం గావించి మగధ సింహాసనం కైవసం చేసికొని నందులు నిర్మించిన పునాదులమీద సువిశాల సామ్రాజ్యం స్థాపించాడు. కేవలం సైనిక బలంతోనే దేశ రాజకీయ ఐక్యము శాశ్వతముగా నిలబెట్టడం సాధ్యంకాదనీ, సాంస్కృతి కమైన సమైక్యానికి సాధనంగానే అశోకుడు 'ధర్మ' ప్రచారం చేశాడు. ఆతని 'ధర్మం' కేవలం హైందవంకాదు; కేవలం బౌద్ధంకాదు; ప్రజలు సుఖంగా - ప్రశాంతంగా - స్నేహసౌహార్దాలతో - పరస్పర అవగాహనతో ఒకే రాజ్యంలో మనగలగడానికి అనువైన ప్రవృత్తిని పెంచే లౌకికతత్వం. కాని అశోకుని ప్రయోగ ఫలితాలు దేశంలో వేళ్ళూనక పూర్వమే బ్రాహ్మణ ప్రతిఘటన తారస్థాయిని చేరింది. బ్రాహ్మణ శుంగవంశస్థుడైన పుష్యమిత్రుడు మౌర్యవంశాన్ని నిర్మూలించి బ్రాహ్మణ మతాన్ని పునరుద్ధరించినాడు. అందుకు సూచనప్రాయంగా అశ్వ మేధం చేసినా, పుష్యమిత్రుడు ఆతని సంతతివారు క్రొత్తగా ప్రజాదరణ పొందుతున్న భాగవత మతానుయాయులు. వీరి పోషణలో భాగవత మతం నిలద్రొక్కుకొన్నది. వాయవ్య ప్రాంతం లోని గ్రీకులు కూడ వాసుదేవుని ఆరాధించసాగినారు. శుంగుల తరువాత ఉత్తరభారతం విదేశీయులైన కుషాణుల వశమయింది. వారిలో అగ్రగణ్యుడయిన కనిష్కుడు బౌద్ధమతం స్వీకరించినట్లు కన్పిస్తుంది. అందుకు కారణం బౌద్ధం ద్వారా మ్లేచ్ఛత్వాన్ని కోల్పోయి భారతీయ సాంఘిక ప్రతిపత్తి సాధించే ఆశయం అయి ఉండవచ్చు. కాని ఆతడు పోషించింది హిందూమతానికి చేరువగానున్న మహాయానం. ఆతని సంతతివారు క్రమంగా భాగవతులయి నారు. ఈ విధంగా భాగవత మతం ప్రచారమై 'గీతా' ప్రబోధం ప్రజల్లో వ్యాప్తిచెందుతున్న రోజుల్లో గుప్తులు అధికారంలోనికి వచ్చారు. హిందూ మతోద్ధారకులుగా గుప్తులకు చరిత్రలో

విశేష ఆదరాభిమానాలు లభిస్తున్నాయి. వారి కాలంలోనే మనుస్మృతి క్రోడీకరించడమ యింది. అష్టాదశ పురాణాలకు రూపాలేర్పడినాయి. వ్రతం, దానం, క్షేత్రం - మొదలైనవాని చుట్టు అల్లిన కట్టుకథలతో తల తోకాలేని పరస్పర వైరుధ్యాలతో వర్ణవ్యత్యాసాలను పూజారుల ఆధిక్యాన్ని సమర్థిస్తూ హిందూమతానికి ఈ పురాణాలే ప్రామాణికాలయినాయి. వైదికమతం పౌరాణిక మతంగా పరిణామం చెందింది. విచక్షణా జ్ఞానాన్ని నశింపచేసే మూఢ విశ్వాసాలను ప్రచారంచేసే పురాణాలు, భూస్వామ్యయుగ సాంఘిక - ఆర్థిక అసమానతలను సమర్థించే మనుధర్మశాస్త్రం ఆధారంగా మతము, సమాజము పునర్నిర్మింపబడినాయి. ఇది సాధించిన గుప్తయుగాన్ని స్వర్ణయుగం అనడం ఎంతవరకు సమంజసమో పునరాలోచించ వలసియుంది.

హైందవమత విజయం శంకరుని అద్వైత ప్రచారంతో పూర్తయింది. వాదబలమేగాక రాక్షసబలంకూడా ప్రయోగించి శంకరుడు జైన బౌద్ధాలకు భారతదేశంలో నిలువ నీడలేకుండా చేసినాడు. హిందూమతం పాతుకుపోయింది. దానికి పునాదిగా నేర్పడిన అద్వైతం "ఇహం మిథ్య, పరం సత్యం" అంటూ ప్రచారం చేసింది. షడ్దర్శనాలలో ప్రారంభమయిన శాస్త్రీయ దృక్పథం, జైన బౌద్ధాలు ప్రచారం చేసిన సామాజిక దృష్టి, సాంఘిక సమతాభావం మరుగునపడి పోయినాయి. ఎన్ని తుఫానులు వచ్చినా చలించనిది అయింది హిందూమతం. సర్వసమ త్వాన్ని బోధించిన ఇస్లాం, క్రిష్టియన్ మతాల ప్రభావం సయితం హిందూమతంలో పెద్దగా మార్పు తీసుకురాలేకపోయింది. ప్రజల్లో మతతత్వం జీర్ణించుకుపోయింది. ఆధునిక యుగంలో శాస్త్ర విజ్ఞానం వ్యాపిస్తున్నది. రాజ్యాంగం లౌకిక విధానాన్నీ సర్వసమత్వాన్ని ప్రకటించింది. గతశతాబ్ద జాతీయ రాజకీయాలు మతదృక్పథంవల్ల దేశానికి వాటిల్లే అనర్థా లను స్పష్టంగా చాటిచెప్పినాయి. అయినప్పటికి ప్రజానీకంలో మతమౌఢ్యం పెచ్చు పెరుగు తూనే ఉండడం శోచనీయం. మతమౌఢ్యం నుండి విముక్తి పొందినప్పుడే ఆధునిక వైజ్ఞానిక విలువలను నెలకొల్పడం సాధ్యమౌతుంది. ప్రజాస్వామ్యవాద సూత్రాల కనుగుణంగా సమాజ పునర్నిర్మాణము, ఆర్థిక ప్రగతి సాధ్యమౌతుంది. శతాబ్దాల బానిస మనస్తత్వం నుండి బయటపడి జాతి పురోగమించడానికి వీలువుతుంది. ఈ సవాలును భారత జాతి ఏ విధంగా ఎదుర్కొంటుందో పరిశీలించవలసి వుంది.



# 3. భారతీయ విస్మృత విజ్ఞాన యుగము

భారతీయ సంస్కృతి కేవలము ఆధ్యాత్మికమైనదనే విశ్వాసం సర్వ సాధారణమయింది. దైవచింతన, పారలౌకిక దృష్టి అనేవి ఆధ్యాత్మికతలోని ప్రధానాంశాలు. కొందరు భక్తులు ఆధ్యాత్మికతలోనేగాక, సమస్త సాంస్కృతికరంగంలోనూ భారతదేశమే ప్రపంచ రాజ్యాలన్నింటికీ గురుత్వం వహించిందంటూ ఉద్ఘాటిస్తారు. అది వేరే విషయం. "ఒక్క గ్రీసుదేశాన్ని మినహాయిస్తే ప్రాచీనకాలంలో భారతదేశమే సక్రమ ఆలోచనా విధానాన్ని అలవరచుకొని, మానవ సహజమైన విజ్ఞాన పిపాసతో-సత్యాన్వేషణాసక్తితో తాత్త్వికరంగంలో ప్రాచీన నాగరికతా కేంద్రాలకు తలమానికమయింది. గ్రీసుదేశం కూడా తన శాస్త్ర విజ్ఞానమునకు, తాత్త్విక ఆలోచనా పద్ధతులకు భారతదేశంనుండే ప్రథమ పాఠాలు నేర్చుకొని - వానిని పెంపొందించి పాశ్చాత్య దేశాల్లో ప్రచారం చేసింది" - అని రమేశచంద్ర దత్తు వ్రాసినాడు. ఇక్కడ మనకు-ప్రస్తుతమైన విషయము-ఇండియా నుండి గ్రీసు నేర్చిందా? గ్రీసునుండి ఇండియా నేర్చిందా? అనికాదు. పైన పేర్కొన్న పండితుని అభిప్రాయంలో - ప్రాచీన భారతదేశంలో పారలౌకికమైన దివ్యజ్ఞానమేగాక, లౌకిక ఆలోచనాక్రమంతో కూడిన యథార్థ విజ్ఞానము సైతం పెంపొందినట్లు స్పష్టము. వాస్తవానికి వైదికయుగం గడచినప్పటినుండి సహజ పరిణామక్రమంలో ఏర్పడిన సహజ పరిస్థితుల ఫలితంగా భారతీయులు యథార్థజీవిత సమస్యలపై దృష్టిమరల్చి ఆలోచించసాగినారు. అంధ విశ్వాసముకాక వివేకము, హేతువాదము, వారి ఆలోచనలకు మార్గదర్శకాలైనవి. ఈ ఆలోచనా క్రమంలోనే ప్రకృతిని పరిశీలించి తత్పరిజ్ఞానంతో విశ్వక్రమంలో మానవుని స్థానాన్ని నిర్ణయించే ప్రయత్నాలు జరిగినాయి. ఆధునిక యుగంలో విరివిగా ప్రచారానికి వచ్చిన భౌతికవాదాన్ని నాడే చర్చించి అందు అమూల్యమైన సంప్రదాయాలను మన ప్రాచీనులే స్థాపించినారు. కాని ఆ సంప్రదాయాలలో అధికభాగం కాలగర్భంలో లీనమైపోయినాయి; మరి కొన్నింటికి సంప్రదాయ పరిరక్షకులు తమకనుకూలమైన విపరీత వ్యాఖ్యానాలు కల్పించి తమ సహజరూపంలో వానిని పరిణామం పొందనీయలేదు. విల్ డురెంట్ అనే పాశ్చాత్య తత్త్వశాస్త్ర చరిత్రకారుడు చెప్పినట్లు భారతదేశ చరిత్రను పరిరక్షించుకుంటూ వచ్చిన బ్రాహ్మణులు హైందవమత సంప్రదాయాలను గురించి, వాని పవిత్రతను గురించి ఒకే ఒక అభిప్రాయమే ఉన్నట్లు ఉద్ఘాటించి మనలను మోసగించినారని చెప్పవచ్చు. భారతీయ సంస్కృతి కేవలం పారలౌకికమనే భావం కలగడానికి ఈ బ్రాహ్మణ ప్రచార ప్రభావమే కారణం! దీని ఫలితంగానే భారతీయ భౌగోళిక విజ్ఞానము దధిక్షీర సముద్రాలతో, వెండి బంగారు కొండలతో నిండిపోయింది; చరిత్ర వేలాది సంవత్సరాలు పరిపాలించిన చక్రవర్తులతో తలతోక లేకుండా తయారయింది. ఇట్టి బ్రాహ్మణ (అ)విజ్ఞానాన్ని పాశ్చాత్య పండితులు పరిహసించినారని మనము కోపించవలసిన అవసరము కనిపించదు; నాటి అంధవిశ్వాసాలను నిర్మూలించి హేతువాద దృష్టిని ప్రోత్సహించుటే దేశభక్తులయిన వారి ప్రథమ కర్తవ్యము. హేతువాద దృష్టి భారతీయ సంస్కృతిలో లేకపోలేదని పేర్కొన్నాము. విస్మృతమైన ఆ విజ్ఞాన సంప్రదాయాలను పునరుద్ధరించుటే నేటి జరూరు సమస్య.

## వైదిక మతము

ప్రాచీనకాలంలో ప్రతి తెగలోను పితృదేవతారాధన సర్వసాధారణము. ప్రకృతిలో కన్పించే ప్రతి వైచిత్ర్యము పితృదేవతల ఆగ్రహానుగ్రహాలకు ప్రతిబింబమని భావించి వారికి ప్రత్యక్ష ప్రతినిధులుగా ఏ చెట్టునో పుట్టనో పూజించడమే నాటి మతము. తమ సంతాన శ్రేయస్సులో పితృదేవతలు శ్రద్ధవహిస్తారనే భావంతో వారి తృప్తికై బలులు, సంతర్పణలు జరిపేవారు. జీవనోపాధికై దేశాలవెంట సంచరిస్తున్న దశలో ఈ తెగలు తమ పితృదేవతలకు ఒకప్పుడు ప్రాతినిధ్యం వహించిన రాయిరప్పలను దర్శించి పర్వతములను, వనములను, నదులను పూజించేవారు. భారతదేశానికి వచ్చినప్పుడు ఆర్యులీదశలోనే ఉన్నారు. సాంఘికంగా ఆర్యులందరిది ఒకే కుటుంబము; వారందరినీ నాడు కూడగట్టి ఉంచింది రక్తసంబంధ భావనమే; అనగా తామందరు ఒకే కుటుంబ సంతతి అనే బలీయమైన గుడ్డి నమ్మకము. కాని ఇండియాలో ప్రవేశించిన ఆర్యులు అనార్యులతో మొదట ఘర్షణ పడినప్పటికీ క్రమంగా రాజీపడక తప్పలేదు. ఉభయుల మధ్య సన్నిహితత్త్వమేర్పడసాగింది. అనార్యులు సహితము నాటికే మంచి నాగరికత నిర్మించుకొని యుండిరి. వారి మత ఆచారాలు, దేవతలు, వైదికార్యులపై బలమైన ప్రభావాన్ని ప్రదర్శించినాయి. ఈ ఆర్య-అనార్య సమ్మేళనము ఫలితంగా ఆర్యులు తమ దేవతలకు కల్పించుకున్న పైతృక వ్యాఖ్యానాలు అర్థం లేకుండా పోయినాయి. ఆర్య సమాజానికి పునాది ఐన రక్తసంబంధం విచ్ఛిన్నమయింది. ఈ కొత్త సాంఘిక పరిస్థితులలో ఆర్య-అనార్య జాతులకు చెందవలసిన సర్వజనీన స్వభావం పైగాక నైతిక విలువలపై సమాజాన్ని పునర్నిర్మించే అవసరం ఏర్పడినది. వైదిక బౌద్ధయుగాల మధ్యకాలంలో భారతదేశంలో జరిగిన మానసిక కృషి అంతటికీ, ఈ సమస్యలకు పరిష్కారము లను చూడడమే లక్ష్యమయింది.

## నూతన మార్గాన్వేషణ

ఉత్తరాపథమున ఆర్యులు స్థిరపడిన అనతికాలమునకే వైదికమతంలో అసంతృప్తి ప్రబలింది. అందుకు ప్రధాన కారణములను పైన పేర్కొనినాము. 1) దేవతలకు మనుజులకు మధ్య భావింపబడిన పైతృక సంబంధాలు తొలగిపోవడం, 2) నాటి సమాజానికి అవసరమైన నైతిక విలువలను వేదమతం రూపొందింపలేకపోవడము, 3) అనార్యమత ప్రభావము, వీనికి తోడుగ 4) వైదికమతం అర్థరహితమైన కర్మకాండలతో నిండిపోయి ఆలోచనాపరులలో విశ్వాసమును నీరసింపజేయడం. భారతీయ ఆధ్యాత్మికతపట్ల సానుభూతి ఉన్న సిల్వైన్ లెవీ పండితుడు వైదిక మతాన్ని గురించి ఈ విధంగా విమర్శించినాడు: "బ్రాహ్మణాలమతం కంటె హింసాత్మకమైనదీ, ప్రాపంచికమైనదీ మరొక మతాన్ని ఊహించలేము. నాగరికత అని చలామణి అవుతూ నీతిపూతలు పూయబడిన వారి భావాలు, ఆటవిక యథార్థతతో మనకు విస్మయాన్ని కలిగిస్తాయి." దాస్‌గుప్తా, రాధాకృష్ణ మొదలైన భారతీయ విద్వాంసులు సైతం వైదికమతాన్ని గురించి ఇటువంటి అభిప్రాయాలనే వెల్లడించినారు.

వైదిక కర్మల నిష్ప్రయోజకత్వాన్ని గుర్తించిన ప్రజలు నూతన మార్గాలను అన్వేషించసాగి నారు. వారి ఆలోచనలు బహుముఖంగా సాగినాయి. మోక్షమార్గం, సాంఘిక మాత్రాలేగాక జననమరణములు, కష్టసుఖాలు, వీటన్నిటికీ మూలకారణం - మొదలైన అంశాలను గురించిన చర్చలు, పరిశోధనలు ప్రారంభమయినాయి. శ్వేతాశ్వతరోపనిషత్తులోని ఈక్రింది ప్రశ్నలు పరిశీలించండి : "విజ్ఞుడవైన ఓ బ్రాహ్మణుడా! ఎందుకు జన్మించాము? ఏ విధముగా బ్రతుకుచున్నాము? మరణానంతరము పోవునది ఎక్కడికి? సుఖములోను, కష్టములోను ఇక్కడ ఎవరి ఆజ్ఞలకు బద్ధులమై బ్రతుకుచున్నాము? కాలము, ప్రకృతి, అవసరము, అదృష్టము, పంచభూతములు - ఇవియా? లేక పురుషుడు అని పిలువబడే అనంతశక్తియా కారణము? మాకు చెప్పువారెవరు." వారి ప్రజానీకంలో బయలుదేరిన ఆవేదన కీ వాక్యమే నిదర్శనము. అదేవిధముగా ఛాందోగ్య ఉపనిషత్తులోని 'అసతో మా సద్గమయ' అనే ఆరాటము!

## ఉపనిషత్తులు :

వైదిక కర్మమార్గానికి వ్యతిరేకంగా భక్తి, యోగ (తపః), జ్ఞానమార్గాలు ప్రారంభమైనాయి. వీనిలో జ్ఞానమార్గము ప్రధానమైంది. ఉపనిషత్తులది ఈ మార్గమే! జీవిత సమస్యలకు పరిష్కారముగా ఆత్మ సిద్ధాంతమును ప్రతిపాదించినవి ఉపనిషత్తులు. ప్రాణమునకు, జీవి కార్యకలాపములకు ఆత్మయే కారణమనిరి ఉపనిషదృషులు. వారి దృష్టిలో ఆధివ్యాధులకు కూడ కారణం ఆత్మయే. చివరకు స్వప్నాలకు కారణం - ఆత్మ తాత్కాలికంగా శరీరాన్ని వీడి వెళ్ళడమేనని బృహదారణ్యకోపనిషత్తు భావించింది. కాని ఆత్మ స్వరూపాన్ని గురించి ఉపనిషత్తులు ఏకాభిప్రాయానికి రాలేకపోయినాయి. మానవునిలో ఆత్మ ఉన్నదని తీర్మానించి నంతనే ప్రకృతిలో సైతం ఆత్మ ఉన్నదని అంగీకరింపవలసి వచ్చింది. ప్రకృతిలో వ్యాపించి యున్న ఆత్మయే విశ్వాత్మ. అదే శాశ్వత యథార్థము; ప్రకృతి మూలకారణము. 'వ్యక్తిలోని ఆత్మ, విశ్వాత్మ యొక్క అంశమే' - అనే జ్ఞానాన్ని పొందడమే జన్మరాహిత్యానికి సాధనము; అదే మోక్షము. ఆత్మ స్వరూపమును గురించి అభిప్రాయభేదములున్నప్పటికీ మోక్షానికి యజ్ఞాలుకాని, తపస్సుగాని, సాధనములుకావనీ, ఆత్మజ్ఞానమే ఏకైక సాధనమని ఉపనిషత్తులు చాటి చెప్పినాయి.

**ప్రజా ఉద్యమము :–** ఉపనిషత్తుల జ్ఞాన పిపాస, సత్యాన్వేషణాసక్తి దేశమంతటిని కదిలించినాయి. హాప్‌కిన్స్ చెప్పినట్లు, "ఇంతకు పూర్వమే బ్రాహ్మణమతం మహాసముద్ర మధ్యంలో ఒంటరి దీవిగా నిలబడింది. ఆర్యజాతిని కూడ పూర్తిగా తన ఏలుబడిలో నుంచుకోలేక పోయింది." ఇక ఇపుడు ఉపనిషత్తులతో నొక మహోద్యమము ప్రారంభమ యింది; సంప్రదాయికంగా విద్యావంతులు ఆలోచనా పరులతోనే ఈ ఉద్యమమం ఆగిపోలేదు; సమస్త ప్రజానీకము శ్రద్ధాసక్తులతో ఆ ఉద్యమంలో పాల్గొన్నది. ఉపనిషత్తుల తరువాత "బౌద్ధమత స్థాపనకు పూర్వం జరిగిన విజ్ఞానోద్యమాలు చాలావరకు సామాన్య ప్రజానీకము నకు సంబంధించినవేకాని పూజారులకు వానితో ప్రమేయం లేదు." మోక్షమార్గమైన జ్ఞాన సముపార్జనకు ప్రజలకు స్వాతంత్ర్యం ప్రసాదించినవి ఉపనిషత్తులు. ఇక వారు పూజారులచేతి కీలుబొమ్మలై యుండనక్కరలేదు. అందుచే యథేచ్ఛగా ప్రజలీ విజ్ఞాన మహోద్యమంలో

పాల్గొన్నారు. ''భారతజాతి దార్శనికుల జాతి'' అన్న మాక్సు ముల్లరు వర్ణన ఈ కాలానికే వర్తిస్తుంది.

**రాజపోషణ :-** ఈ సందర్భంలో మరొక ముఖ్యవిషయం సైతం గమనింపదగి ఉంది. అనాదినుండి ఆర్యుల రాజకీయాలు మతప్రోక్తములు. రాజులు పూజారుల ఆజ్ఞలను శిరసావహించేవారు. ఇట్టి మతరాజకీయ విధానాలలో సాధారణంగా రాజులకు, పూజారులకు మధ్య సంఘర్షణ తప్పదు. ఈ సంఘర్షణ మన చరిత్రలో వైదిక యుగంలోనే ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. పరశురామ కార్తవీర్యులమధ్య వైరం ఈ సంఘర్షణలోని చిన్న ఘట్టంగా భావించవచ్చును. ఉపనిషత్తుల కాలమునాటికి పూజారుల దౌర్జన్యం నుండి విముక్తి సాధించాలనే కాంక్ష రాజులలో బలపడింది. కర్మకాండలను తిరస్కరించడంద్వారా ఉపనిషద్విజ్ఞాన ఉద్యమం పూజారుల ప్రాబల్యమునకు గొడ్డలిపెట్టయినది. అందుచే నాటిరాజు లీ ఉద్యమాన్ని ఆదరించి పోషించినారు. తత్ఫలితంగా నాటి రాజాస్థానాలు తాత్త్విక వాగ్వివాదాలతో ప్రతిధ్వనించినాయి. జనక, కేకయ, ప్రసేనజిత్తు, బింబిసార, అజాతశత్రు మహారాజుల జిజ్ఞాస లోకవిదితమే; ఋష్యాశ్రమాలేకాక దేశం నలుమూలల విజ్ఞాన సమాజాలు వెలసినాయి వేలకువేలు పరివ్రాజకులు దేశసంచారం చేస్తూ తమతమ సిద్ధాంతాలను ప్రచారం చేసేవారు వీరి తాత్కాలిక నివాసార్థమై రాజులు, రాణులు సౌకర్యాలు కల్పించేవారు. శ్రావస్తిలో మల్లికా మహారాణి ఒక విడిది గృహం నిర్మించింది. లిచ్ఛవులు వైశాలిలో ఏర్పాటుచేసిన వాగ్వివాద మండపం, చంపక సరోవరతీరంలో గగ్గరామహారాణి నిర్మించిన భవనాలు, రాజగృహం దగ్గర మోరనివాసంలోని విడిది గృహాలు ఈ పరివ్రాజకులకు ఉద్దేశించినవే. ఈ విధంగా బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు విరుద్ధాశయాలతో దేశంలోని రెండు ప్రత్యేక వర్గాలకు ప్రాతినిధ్యం వహించాయి. ''బ్రాహ్మణులు అభివృద్ధి విరోధకులు; అపౌరుషేయములని విశ్వసింపబడే వేదాలే వారి కాధారములు. వేదాలను వ్యాఖ్యానించే హక్కు వారికి మాత్రమే వుంది. ఇక రెండవవారు క్షత్రియులు; సాంఘిక జీవితానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలో బాధ్యత ఉన్నవారు; కొంతవరకు అనార్య ఆచార వ్యవహారాలను సైతం అంగీకరించి ఆర్యలోకమున శాంతిభద్రతలను కాపాడడానికి తాపత్రయ పడేవారు. వీరిది విశాలదృక్పథం. స్వతంత్ర పరిశోధనలద్వారా వేదవిజ్ఞానాన్ని విస్తరింప జేయడమే వీరి ఆశయం.''

ఉపనిషత్తుల జ్ఞానవాదం అనేక సాంఘిక తాత్త్విక పరిణామాలకు కారణమయింది. ఆత్మ ప్రతివ్యక్తిలోనూ వుంది; ఆత్మ విశ్వాత్మ యొక్క అంశమే అనడం చేతను, ఆత్మజ్ఞానమే మోక్షసాధన మనటంచేతను, ఆర్యజాతి ఆధిక్యతకు, అగ్రవర్ణాల అధికత్యకు స్వస్తి చెప్పబడింది. ఆర్య అనార్య జాతి సన్నిహితత్వానికి సమ్మేళనానికి మార్గం కల్పింపబడింది. వైదిక కర్మకాండల సంస్కృతీ పరిరక్షకులైన పూజారుల అధికారం నుండి విముక్తిపొందిన రాజులు సమైక్య జాతీయ శ్రేయస్సులనుద్దేశించి పరిపాలన సాగించడానికి పూనుకొన్నారు. ఒకవిధంగా భారతదేశంలో, లౌకిక రాజకీయాల్లో ఇది ప్రథమ ప్రయత్నంగా భావించడంలో తప్పులేదు. మరొక విశేషం - ఆత్మ సిద్ధాంతంద్వారా ఉపనిషత్తులు మానవుడు ప్రకృతి అంశ అని చాటినాయి. ప్రాచీన ఉపనిషత్తులలో నొకటియైన 'శ్వేతాశ్వతరోపనిషత్తు' ప్రకృతియే సృష్టి కర్త, కాలమే లయకారుడు; వీరే లోకపాలకులు; మానవునకు సుఖదుఃఖాలనీయడంలో మంచిచెడ్డలలో వీరి ప్రమేయం లేదు-అంటూ, ఆత్మ సిద్ధాంతాన్ని సైతం తిరస్కరించి భౌతికవాదానికి నాంది పలికింది.

పైన పేర్కొన్న అంశాలవల్ల నాటి మానసిక వాతావరణంలోని అశాంతి, ఆందోళన, ఆవేదన స్పష్టమవుతాయి. అంతేగాక నాటి ప్రజలు అనుభవించిన మానసిక వాక్స్వాతంత్ర్యము లను గూడ గ్రహిస్తున్నాము. మతములో, ఆలోచనారంగంలో ప్రబలిన అవ్యవస్థనుండి పెక్కు సిద్ధాంతాలు బయలుదేరినాయి. బౌద్ధవాఙ్మయం నుండి, నాడు 62 సిద్ధాంత భేదములున్నట్లు తెలుస్తున్నది; జైన వాఙ్మయం 200లకు పైగా పేర్కొంటున్నది. ఒక్కొక్క సిద్ధాంతమున కొక పరివ్రాజక సంఘమేర్పడింది అట్టి సంఘాలలో నిగంధ, ఆజీవిక, ముండసావక, జటిలక, మాగంధిక, త్రిదండిక, అవిరుద్ధక, గోతమక, దేవదమ్మిక అనేవి ప్రధానమైనవి. క్రమంగా ఈ సిద్ధాంత విభేదములు నమసి, వానిసారమో అనునట్లు 'దర్శనములు' తయారైనవి. వీనిలో సాంప్రదాయక సిద్ధములైనవి సాంఖ్య, న్యాయ, వైశేషికాది షడ్దర్శనములు; సంప్రదాయేతరమైనది బార్హస్పత్య మనబడే లోకాయత దర్శనము. సాంఖ్య, బార్హస్పత్యములు బౌద్ధమునకు తాత్త్వికముగ పునాదులు నిర్మించినవి.

## సాంఖ్యము

దర్శనాలన్నింటిలో ప్రధానమైనది సాంఖ్యం. డేవిస్ పండితుని అభిప్రాయంలో, ''సృష్టి -మానవుడు, మానవుడు-అతని భవిష్యత్తుకు ఉన్న సంబంధం మొదలైన సమస్యలను గురించి ఆలోచనాపరుడైన మానవుని ఎదుర్కొనే విచిత్రప్రశ్నల పరంపరకు వివేకము, హేతుత్వము ఆధారంగా సమాధానా లీయడానికి చేసిన లిఖితరూపకమైన తొలిప్రయత్నమే'' సాంఖ్య దర్శనము. సాంఖ్యమే న్యాయవైశేషికాది ఇతర దర్శనాలకు మూలాధారమయింది. సాంఖ్య సిద్ధాంతకారుడు కపిలుడు; ఇతడు గౌతమ బుద్ధునకు రెండు దశాబ్దాలకు పూర్వం బుద్ధుని జన్మస్థలమైన కపిలవస్తు నగరంలోనే నివసించినట్లు తెలుస్తున్నది. సమకాలిక తాత్త్విక అరాజకతనుమాన్పి, మానవుని పీడించే శారీరక, మానసిక, ప్రాపంచిక, దైవిక బాధలను తొలగించి, యథార్థ విజ్ఞానాన్ని మానవునకు ప్రసాదించటమే తన ఆశయంగా ప్రకటించినాడు కపిలుడు!

నాటివరకు కేవలము అంతర్వాణియో, ఆకాశవాణియో. దివ్యజ్ఞానమో జ్ఞానార్జనకు సాధనాలుగా వుండేవి. వీని అసమర్థతకు, మోసానికి ప్రజల అజ్ఞానమే 'శ్రీరామరక్ష'. వీని ప్రయోజనాన్ని సామర్థ్యాన్ని నిరాకరించి శాస్త్రీయమైన మార్గాన్ని సూచించినాడు కపిలుడు. ఇంద్రియ గోచరం గానిది, ప్రయోగ సాదృశ్యాలకు నిలవనిది విజ్ఞానం కాదన్నాడు. 'దర్శనము' అనే మాటకు నిజమైన అర్థమే అది! ఈ ఆలోచనాక్రమంతోనే 'రక్తతర్పణలు కోరే దేవుడు' హేతువాదానికి నిలబడడనీ, అందుచే అతడు లేడనీ, తనది 'అనీశ్వరవాద'మని నిర్భయంగా చాటినాడు. సత్యాన్వేషణకు కపిలుడు సూచించిన సాధనలే ఐరోపాలో మధ్య యుగాంతంలో సర్ రోజర్ బేకన్ సూచించి క్రైస్తవమతాధికారుల ఆగ్రహానికి గురి అయినాడు.

కపిలుని సిద్ధాంతంలో ప్రకృతి, మానవుడు మాత్రమే పరిశీలనకు సాధ్యమైనవి; యోగ్యమైనవి. అందుచేత అతడు తన ఆలోచనలను, పరిశీలనలను వానిపైనే కేంద్రీకరించి తద్వారా ప్రకృతి - భౌతిక మతాలకు పునాదులను నిర్మించినాడు. కపిలుని దృష్టిలో ప్రకృతి శాశ్వతము;

స్వయం సమృద్ధము. ''ప్రకృతి పదార్థమయము; పంచభూతములు, ఇంద్రియములు, శరీరావయవములు మాత్రమే కాక బుద్ధి, పరిజ్ఞానము, మనస్సు అన్నీ పదార్థాలే. రూపంలో భేదమేకాని వస్తువులన్నియు ప్రాథమికమైన ఏకైక కుటుంబానికి చెందినవి. ప్రపంచంలో ఐక్యత యున్నది. ఆ ఐక్యతయే ప్రపంచం ఒకే పదార్థం నుండి ఉత్పన్నమైనదను విషయమును రుజువు చేస్తున్నది.

సృష్టిని, వివిధ వస్తు సముదాయాన్ని కపిలుడు కార్యకారణ సంబంధంతో వివరించినాడు ''ప్రకృతి పరిణామాత్మకము; నిరంతర అభివృద్ధి క్రమంలో విశ్వము క్రియాత్మకమైన పరిణామ సామర్థ్యాన్ని వ్యక్తీకరిస్తున్నది. ఈ సామర్థ్యం పదార్థానికి సహజ లక్షణము'' అన్నాడు ఈ సిద్ధాంతాలవల్ల 'ప్రపంచంగానీ, మానవుడుగానీ భగవంతుని సృష్టికాదు ప్రపంచానికి గానీ, పరిణామానికి గానీ సహజమైన కారణాలు అందులోనే ఇమిడి యున్నవి' అని స్పష్టమవుతున్నది. ఈ సిద్ధాంతాలను దృష్టియందుంచుకొనియే ''ప్రాచీనమైనా, అర్వాచీనమైనా పరిణామ సిద్ధాంతాలన్నీ తాత్త్వికముగా సృష్టికర్తకుగానీ, విశ్వ అధినేతకుగానీ తావీయజాలవు అదేవిధంగా సాంఖ్యసిద్ధాంతం సైతం తాను అనీశ్వరవాదమునని నిర్భయముగ ప్రకటించుకొన్నది'' అనినాడు మాక్సుముల్లర్ పండితుడు.

ప్రాణి జీవ కార్యక్రమానికి పంచవాయువులే - ప్రాణాపాన వ్యానోదాన సమానములు - కారణమని కపిలుని సిద్ధాంతము. అన్నిటికంటె ప్రధానమైనది జీవోత్పత్తి సమస్య; అనగా పదార్థమయమైన ప్రకృతినుండి జీవము ఎట్లు ఉద్భవించినది? ఈ సమస్యను పరిష్కరించడానికి కపిలుడు ఆత్మ సిద్ధాంతాన్ని అంగీకరింపక తప్పలేదు. కాని ఆత్మ భగవంతుడు కాదని కపిలుడు స్పష్టంగా వివరించినాడు. 'ఆత్మ పదార్థమునుండి స్వతంత్రమైనది; విశ్వవ్యాపకమైనది; పదార్థంతో ఆత్మ చేరడంతోనే జీవి ఏర్పడుతుంది. ఆత్మ, పదార్థంనుండి (శరీరము నుండి) శాశ్వతంగా విముక్తి పొందడమే మోక్షము. మోక్షానికి సత్ప్రవర్తనయే మార్గం'' అని కపిలుని సిద్ధాంతము. ''శాశ్వతమైన పదార్థంనుండి సర్వస్వతంత్రమైన ఆత్మను గుర్తించడమే కపిలునకు, ఆధునిక భౌతికవాదులకుగల ముఖ్యమైన భేదము'' అని ఆర్.సి.దత్ అభిప్రాయము.

## బార్హస్పత్యము

భౌతిక వాదాన్ని ప్రతిపాదించినప్పటికీ జీవిని వ్యాఖ్యానించడానికి సాంఖ్య దర్శనము 'ఆత్మ'ను ఆశ్రయించింది. ఉపనిషత్తుల ఆత్మ సిద్ధాంత మీవిధంగా షడ్దర్శనాలలో పరాకాష్ఠనందుకొన్నది. కాని నాటి జిజ్ఞాస ఆత్మవాదానికే పరిమితమైనదని భావించకూడదు. ఆత్మ ప్రాతిపదికను నిరాకరించి కేవలము కాలము, ప్రకృతి ఆధారంగా ప్రపంచాన్ని వ్యాఖ్యానించే ఆలోచనాక్రమం శ్వాసశ్వేతోపనిషత్తులోనే ప్రారంభమైనట్లు కనుగొన్నాము. క్రమంగా అనాత్మవాదము లనేకం ప్రచారంలోనికి వచ్చినాయి. ఈ అనాత్మ వాదాల సారంగా బార్హస్పత్యమనే చార్వాకదర్శనము వెలిసినది. దీనికే 'లోకాయత' మని మరొకపేరు. నాటి విజ్ఞాన విప్లవ మహోద్యమమున చార్వాకులను వామ పక్షీయులుగా వర్ణించడం సమంజసమనిపిస్తుంది. వీరిది అర్థరహితమైన ఉద్రేకంతో సాగించిన ప్రచారం కాదు. వీరి సిద్ధాంతాలు కేవలం విధ్వంసాత్మక

ములు కావు. హేతువాదం వీరిలో ఉన్నత స్థాయినందుకొన్నది. భౌతికవాదరీత్యా, నైతిక వాదరీత్యా సమాజ సంబంధాలలో వ్యక్తిగౌరవానికి ఔన్నత్యం సాధింపగల సూచనలే వీరి సిద్ధాంతాలు. వీరి దృష్టిలో "ప్రపంచాన్ని వ్యాఖ్యానించడానికి గానీ, అర్థం చేసుకోవడానికి గానీ సృష్టికర్త అనే ప్రాతిపదిక నిరుపయోగము. ప్రకృతి స్వభావసిద్ధంగా నేర్పడువది. నీరు చల్లగాను నిప్పువేడిగాను ఉండడం వాని ధర్మములే! మానవుని అనుభవంలోగాని, చరిత్రలో గాని, మానవుని కార్యకలాపాలలోగాని భగవంతుడు జోక్యం కల్పించుకొన్నట్లు తెలియ రాదు. పదార్థమే యథార్థమైన సత్యం; ఆలోచనాశక్తిగల పదార్థమే బుద్ధి. బుద్ధితో గూడిన శరీరమే ఆత్మ. అందుచే ఆత్మ శరీరంతోపాటు నశిస్తుంది." జీవోత్పత్తిని గురించి సైతము వీరి సిద్ధాంతాలు చాలా శాస్త్రీయమైనవి. "కొన్ని పదార్థాలు తమంత తాముగా ఉద్రేకాన్ని కలిగించవు; కాని వానితోనే తయారయిన పదార్థము (మదిర) ఉద్రేకాన్ని కల్గించినట్లే శరీర అవయవములు రూపొందినప్పుడు జీవి ఏర్పడుతుంది" - అని చార్వాకుల పరిశీలన. పరిణామక్రమంలో రసాయనిక మార్పు ఫలితంగా పదార్థ స్వరూపము, గుణము మారి జీవం ఉత్పన్నము కావడానికి గూడ అవకాశము లేకపోలేదనునది ఆధునిక రసాయనిక పరిశోధనలు తెల్పిన సత్యమేగదా! భౌతిక వాదంలో చార్వాకుల ఆలోచనలు ఎంతో సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తాయి. ఇక మతము, భగవంతుడు అనేవి బలహీనుల సాధనాలనీ చార్వాకుల నిర్ణయము. "చిరకాలంగా మానవులు మతమునకు అలవాటుపడి యున్నందున విజ్ఞానం విశ్వాసాన్ని నిర్మూలించడంతో తాము నిస్సహాయులైనట్లు తమ జీవితము దుర్భరము-భయానకముయిన శూన్యం ఏర్పడినట్లు బాధపడతారు". నీతిని గురించి సైతం వీరి సిద్ధాంతాలు హేతుబద్ధమైనవి. దేవుని స్మృతి అవినీతినుండి మానవుణ్ణి నీతి పథానికి నడిపించు కొరడావలె నుండనవసరం లేదనీ, వ్యక్తిలో ఆత్మవిశ్వాసము, మహోదార్యము, ఆత్మగౌరవము ఏర్పడినంతనే మతానికి, దేవునకు స్థానం ఉండదనీ చార్వాకులు చాటినారు. "నీతి మానవ సహజము; సామాజిక జీవితానికి నీతి అత్యంతావశ్యకము; సదుపయోగము." కావున నీతి మానవ సుఖజీవితము కొరకు. నీతికి భగవంతునకు సంబంధంలేదు. సహజంగా నీతిపరుడైన మానవుడు నీతిగానుండుటకు భగవంతుని ఆశ్రయించుట అతని దౌర్భాగ్యము. అట్టి అవినీతికర పరిస్థితినుండి రక్షించుకొని ఆత్మగౌరవాన్ని నిలుపుకోవలెనని చార్వాకుల ఉపదేశము!

## బౌద్ధ ధర్మము

ఈవిధముగ విస్తరించిన విజ్ఞాన మహోద్యమమునకు శిఖరప్రాయము బౌద్ధధర్మము. నాటి ఉద్యమాలన్నింటిలో చిట్టచివరిది బౌద్ధము. కాని ప్రసిద్ధమైనది - ప్రబలమైనది బౌద్ధమే. ఈ సిద్ధాంత స్థాపకుడైన గౌతమ బుద్ధునకు కపిల బృహస్పతులవలె సునిశితమైన బుద్ధితోపాటు విశాలమైన హృదయముంది. ప్రాణికోటిపట్ల సజీవమైన దాక్షిణ్యావాత్సల్యాలు అతనిలో మూర్తీభవించినాయి. కొత్త సిద్ధాంతాన్ని స్థాపించడమేగాక ఆ సిద్ధాంతంపై పరిపూర్ణమైన సమాజమును నిర్మించడమే - పునర్నిర్మించడమే - అతని జీవితకాంక్ష

సాంఖ్య బార్హస్పత్యాలపై నేర్పడిన బౌద్ధధర్మము సమకాలికమైన సాంఘిక తాత్విక సమస్యలకు పరిష్కార మార్గాలను సూచించింది. బౌద్ధధర్మము ప్రకారం "ప్రపంచము

నిస్సందేహముగా యథార్థము; జీవితమూ యథార్థమే. ఈరెంటిని నిర్లక్ష్య మొనర్చుటకాని, వీటినుండి తప్పించుకొనుటకు ప్రయత్నించడం కాని వెఱ్ఱితనము. మానవుని జీవిత గమనమాతని చేతిలోనిదే; ఆతని సుఖదుఃఖాల కతడే బాధ్యుడు.''

''ఆత్మ ఉన్నదా? లేదా?'' అనే ప్రశ్నకు బుద్ధుడు సూటియైన సమాధానం ఇవ్వడానికి నిరాకరించినాడు. కాని బౌద్ధం 'అనాత్మ సిద్ధాంతమే'నని పలువురు విమర్శకుల అభిప్రాయము.'' శరీరమున్నంత కాలము మానవుని దేవతలు-మానవులు చూడగలరు; ప్రాణము పోయి శరీరము నశించినంతనే అతణ్ణి దేవతలుగాని, మానవులుగాని చూడలేరని బ్రహ్మజాల సుత్తలో బుద్ధుని ఉపదేశము. అంతేగాక త్రివిధమోహములలో ఆత్మలో విశ్వాస మొకటియనీ, ఆ విశ్వాసమే మానవుని పాపకార్యాలకు పురికొల్పుతుందని బుద్ధుడు బోధించినాడు. వివిధభాగములు కలిపి రథమేర్పడునట్లుగానే, భౌతికములు, ఇంద్రియములు, మానసికము లనగు పంచస్కంధములు, కలిసి శరీరమేర్పడునని బుద్ధుని భావన. జీవితంలో మానవుని 'కర్మ' ద్వారా ఏర్పడిన సంస్కారమే పునర్జన్మకు కారణంగా బుద్ధుడు బోధించినాడు. కాని కొందరు విమర్శకుల దృష్టిలో బుద్ధునికి పునర్జన్మలో సైతం విశ్వాసం లేదు!

బౌద్ధధర్మంలో స్వర్గనరకములు లేవు. ఇహములోని సత్ప్రవర్తనకు పరలోకంలో బహుమతులుగాని, దుష్ప్రవర్తనకు శిక్షలుగాని లేవు. కాబట్టి బౌద్ధధర్మం ప్రకారం సత్ప్రవర్తన వ్యక్తి శ్రేయస్సుకు సమాజశాంతి, అభ్యున్నతులకే అని అనడంలో విప్రతిపత్తిలేదు. 'నిర్వాణం' అనేది ప్రపంచంలో సాధించి అనుభవించేది మాత్రమే. అది ఒక జీవితదశ. ''పవిత్ర మానసిక శాంతితోకూడి పాపరహితము, నిరామయం ఐన జీవితమే నిర్వాణము. పవిత్ర జీవితమే బుద్ధుని చరమ లక్ష్యం; అదే నిర్వాణం; అదే బౌద్ధుల స్వర్గం.''

''పతనోన్ముఖమైన సమకాలీన పూజారి గోప్యవిధానములకు బదులుగా, జిజ్ఞాసాత్మకమైన శాస్త్రీయవాదనా పద్ధతి నవలంబించినాడు బుద్ధుడు. ఆతని పద్ధతియే మతంలో ఉత్సాహకరమైన నూతన మార్గాలను చూపింది.'' వ్యర్థమైన వాగ్వివాదాలతో కాలహరణం చేయక, యథార్థ జీవిత సమస్యలకు సూటిగా పరిష్కారములు సూచింప బూనడమే బుద్ధునిలోని నవ్యత. ''ప్రపంచమెలా ఉద్భవించింది?' అనే ప్రశ్నకంటె, 'ప్రపంచము నేవిధంగా మరమ్మత్తుచేయవలె?' అనే సమస్య ప్రధానమైనది; పరిష్కారయోగ్యమైనది.

బౌద్ధధర్మము ''బీదలపాలిటి కొత్తసువార్త''; నైతిక, సాంఘిక సంబంధాలలో సామాన్య ప్రజలను ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కార పరిశోధనయే నాటి విజ్ఞానోద్యమమునకు ఆశయంగా పైన పేర్కొన్నాము. ఈ ఆశయంతో జరిగిన ప్రయత్నమునకు స్పష్టమైన రూపమునిచ్చి, ఆ పరిష్కారమార్గాన్ని ఆచరణలోకి తీసుకురావడమే బుద్ధునిలోని విశిష్టత. జాతి, వర్ణసమత్వము, వైదిక కర్మల నిష్ప్రయోజకత్వము, సత్య అహింసలతో గూడిన వ్యక్తి నైతిక ప్రవర్తన-అనేవి మూలసూత్రాలుగా గ్రహించి, సాధ్యమైనంతవరకు తాత్త్విక క్లిష్టతలను తొలగించి, నూతన జీవిత విధానాన్ని ప్రజలకు అందించినాడు బుద్ధుడు. అందుచేతనే ఒక విమర్శకుని దృష్టిలో ''బౌద్ధమును మత విప్లవమనడంకంటె, సాంఘిక విప్లవమనడం ఎంతేని సమజంసము.'' వేదకాలంలోను, ఇతిహాస కాలంలోను ఆర్యులు అనార్య జాతులపై జరిపిన యుద్ధాలకంటెకూడ, అనార్యులను వశపరచుకొనుటలో ఎక్కువ సామర్థ్యాన్ని ప్రదర్శించినది

బౌద్ధము. ఆర్య అనార్యజాతులను కూడగట్టడంలో బౌద్ధము దృఢమైన నైతిక సంబంధాన్ని ప్రసాదించింది.

నాటివరకు అగ్రవర్ణాల ఆధిపత్యంలోనున్న క్రిందివర్ణాలలో బౌద్ధమొక నూతన చైతన్యానికి కారణమయింది. బౌద్ధం ప్రబోధించిన సమతాభావం, ఆభావంపై సమాజాన్ని పునర్నిర్మించాలనే దీక్ష - ఈరెండూ క్రిందివర్ణాలను పైవర్ణాలపై తిరుగుబాటుకు పురికొల్పినాయి. ఇందుకు నిదర్శనమే మగధరాజ్యంలో జరిగిన రాజకీయ విప్లవము. క్షత్రియులైన శిశునాగులను నిర్మూలించి, శూద్రులైన నంద వంశస్థులు మగధసింహాసనాన్ని ఆక్రమించినారు. మతం లోనూ, సమాజంలోనూ మాత్రమేగాక, రాజకీయాలలో సైతం అగ్రవర్ణాల గుత్తాధికార విచ్ఛిత్తియే నందవిప్లవ ప్రాధాన్యము. తరతరాలుగా క్రింది వర్ణాలలో అగ్రవర్ణాలపై పెరిగిన ద్వేషానికి, ప్రతీకారకాంక్షకు నిదర్శనము మహాపద్మనందుని ''సర్వక్షత్రాంతక'' బిరుదము. నందరాజరికము బౌద్ధం సాధించిన సమగ్ర విప్లవానికి తార్కాణము!

## విప్లవ తిరోగమనము

కాని, ఇతిహాస కాలమున ప్రారంభమైన విజ్ఞాన మహోద్యమానికి నందవిప్లవమే ''భరత వాక్య''మైంది. అందుకు రెండు ముఖ్యకారణాలను పేర్కొనవచ్చు. మొదటి కారణం బౌద్ధంలోని లోపాలు; సాంఘిక సంబంధాలలో మార్పులను సూచించినదే గాని, బౌద్ధ ధర్మము ఆ సంబంధాలకు ప్రత్యక్ష ఆకృతులైన సంస్థలలో మార్పులు తేవడానికి ప్రయత్నించలేదు. ఆర్య రాజకీయ సిద్ధాంతాలను యథాతథంగా అంగీకరించింది. సమతా సిద్ధాంతంపై సమస్త ప్రజానీకము శ్రద్ధతో పనిచేయగల విశాల సంస్థను నిర్మింపజాలకపోవడమే బౌద్ధంలోని ముఖ్య లోపం. మరొక విశేషం; గౌతమ బుద్ధుడు, భారతీయుల దృష్టిని ప్రకృతి పరిశీలనమండి ఆత్మపరిశీలనపైకి మరలించినాడు. గ్రీకు సాంస్కృతిక చరిత్రలో సోక్రటీసుకు గల స్థానమే ఇండియాలో బుద్ధునకు ఉన్నదని చెప్పవచ్చు. సోక్రటీసు బోధనలన్నిటిలో ముఖ్యమైనది "Know thyself" అనికదా! తత్ఫలితముగా కపిల కణాదులలో ఉన్నత శిఖరాల నందుకొనిన విజ్ఞాన ఉద్యమము తిరోముఖం పట్టింది! ఇక రెండవకారణము: నంద విప్లవంవల్ల అగ్రవర్ణాలలో కలిగిన అలజడి. నాటివరకును క్షత్రియులు విజ్ఞాన ఉద్యమాన్ని పోషించినారు. కాని పరిస్థితులు విషమించినాయి. నందవిప్లవంతో వారి అధికారానికే ప్రమాదం సంభవించింది. అందుచే, బ్రాహ్మణులతో వైరము తమ అధికారానికి ముప్పుతెచ్చునని క్షత్రియులు, క్షత్రియులతో వైరము వర్ణధర్మాలకు, వైదికకర్మలకు తద్ద్వారా తమ మనుగడకు భంగం కల్గించగలదని బ్రాహ్మణులు గుర్తించినారు. అంతటితో బ్రాహ్మణ క్షత్రియ వర్గాలు రాజీపడి శతాబ్దాలుగా పెరిగివస్తున్న సాంఘిక తాత్త్విక విప్లవాన్ని ప్రతిఘటించే ఉద్యమానికి నాయకత్వం వహించారు. మగధలో క్షత్రియ వంశమైన మౌర్యులు ప్రతిష్ఠింపబడినారు. చాణక్య చంద్రగుప్తులు నందులచే పరాభవింపబడిన బ్రాహ్మణక్షత్రియ యువకులేకదా! ఈ రాజీఫలితంగా క్షత్రియులు వర్ణాశ్రమ ధర్మ రక్షణకు పూనుకొన్నారు. బ్రాహ్మణులు రాజకీయంగా క్షత్రియుల ఆధిక్యము నంగీకరించినారు. చంద్రగుప్తుడు జైన మతాభిమాని ఐనను చక్రవర్తిగా క్షత్రియుల బాధ్యతలనే నిర్వహించినాడు. ఈ వాతావరణంలోనే చాణక్యుడు తన అర్థశాస్త్రంలో లౌకిక రాజకీయాలకు పునాదివేయ ప్రయత్నించినాడు. అయినను రాజకీయ అధికారానికి మతం బలమైన సాధనంగా ఉపయోగించింది.

## విజ్ఞాన పునరుజ్జీవన ఆవశ్యకత

విజ్ఞాన యుగం అంతరించింది; వైదికులు తమ మతాన్ని, సంప్రదాయాలను పునరుద్ధరించి రక్షించుకొనే ఆశయంతో నాటి విజ్ఞానాన్ని బలిచేసినారు. కపిల కణాదుల సిద్ధాంతాలను విపరీత వ్యాఖ్యానాలు చేసి మతంలో కలుపుకొన్నారు. హేతుత్వానికి, స్వాతంత్ర్యానికి బదులు, విశ్వాసము, అధికారదాస్యం ప్రబలినాయి; వైదిక సంప్రదాయ రక్షణకై పుక్కిట పురాణాలు, ధర్మ సూత్రాలు తయారయినాయి. అదియే హిందూ ధర్మంగా, ఆధ్యాత్మిక సంస్కృతికి మూలంగా నేటికీ విశ్వసిస్తున్నారు; ప్రాచీన విజ్ఞాన సంప్రదాయాలు విస్మృతి పథంలో పడిపోయినాయి.

లౌకిక ప్రజాస్వామ్యం, శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి, సమతాసమాజము తన లక్ష్యాలుగా స్వతంత్ర భారతజాతి ప్రకటించుకొన్నది. ఈ లక్ష్యసాధనకై జాతికి అవసరమైన ఉత్తేజము మన పుక్కిటిపురాణములనుండి లభించదనడం నిర్వివాదాంశం; కపిల, కణాద, గౌతమ బుద్ధాది దార్శనికులు స్థాపించిన విజ్ఞాన సంప్రదాయాలు మాత్రమే మనజాతికీనాడు శరణ్యములు. కాబట్టి రెండువేల ఏండ్లనాడు నిరోధింపబడిన విజ్ఞాన ఉద్యమాన్ని పునరుద్ధరించి, నాటి సంప్రదాయాలను, యథార్థరూపంలో అవలంబించడమే మన కర్తవ్యం రాజకీయ, సాంఘిక సంస్కరణలు, ఆర్థిక విజయాలు, మన ప్రజలలో భావవిప్లవం జరిగిననాడే రుజువయిన శాశ్వతమైన ఫలితాల నియ్యగలవు. సమగ్రమైన జాతీయాభ్యుదయమే నిజమైన ఆధ్యాత్మిక ఔన్నత్యము!



# 4. ప్రాచీన భారతంలో స్వర్ణయుగము

భారతదేశ సమగ్ర చరిత్ర రచనకు ప్రథమంగా పూనుకున్నది మనదేశాన్ని ఆక్రమించిన ఆంగ్లేయులు. అందుకే భారతదేశ చరిత్ర అంగవైకల్యంతో జన్మించింది. భారతదేశాన్ని గురించి వారి మనస్సులలో ఎన్నో అపోహలుండేవి. వారికి లభించిన ఆధారాలు స్వల్పం. ఆ కొద్ది ప్రమాణికాలకు అపోహల రంగులు పులిమి వారు భారతదేశ చరిత్రను రచించారు. భారతదేశ నిజ చరిత్ర రచనకు ఆంగ్లేయులు ప్రతిపాదించిన సిద్ధాంతాలను మార్చటమో, పూర్తిగా తిరస్కరించటమో చేయక తప్పదు.

ప్రాచీన భారతదేశ చరిత్రలో 'గుప్తరాజుల కాలము స్వర్ణయుగము, అని తమ సాంప్రదాయిక భావాలతో ఆంగ్లేయులు ప్రచారం చేశారు. కాని ఈ అభిప్రాయం క్రమంగా మారుతోంది. గుప్తరాజుల కాపాడింపబడుతున్న ఘనతను ఆధార సహితంగా సవాలు చేస్తున్నారు. దీనికి భిన్నంగా, ప్రాచీన భారతదేశ చరిత్రలో స్వర్ణయుగమనదగిన కాలం గుప్తుల పూర్వయుగమే. అది బౌద్ధం ప్రబలంగా ఉన్న కాలం.

సామాజిక ఔన్నత్యము, సాంస్కృతిక వికాసము ప్రస్ఫుటమైన కాలాన్ని దేశచరిత్రలో స్వర్ణయుగమనటం సహజం. రాజకీయ ఐక్యత, దృఢత్వము, సమర్థమైన పాలనా యంత్రాంగము సుదీర్ఘకాలం ఉన్నప్పుడే దేశం శాంతిసౌఖ్యాలతో విరాజిల్లుతుంది; ఆర్థికంగా ముందంజ వేస్తుంది. సిరిసంపదలతో తులతూగుతున్న దేశంలో సృజనాత్మక సాహిత్యము, కళలు వికసిస్తాయి. గుప్తవంశ స్థాపకుడైన మొదటి చంద్రగుప్తునితో సహా ప్రఖ్యాతులైన గుప్తరాజుల కాలం 100 సంవత్సరములకు మించదు (క్రీస్తుశకం 320-415). ప్రతి గుప్తరాజు పాలన యుద్ధాలతో, సైనిక వ్యూహాలతో నిండినదే.

ప్రతి పాలకుని సింహాసనాధిరోహణ రక్తపాతంతోనే జరిగేది. సముద్రగుప్తుని, విన్సెంట్ స్మిత్ "భారత నెపోలియన్" అని కీర్తించాడు. ఆ సముద్రగుప్తుని సామ్రాజ్యం ప్రస్తుత బీహారు, ఉత్తరప్రదేశ్ లో కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితం! విక్రమాదిత్యునిగా ప్రసిద్ధిగాంచిన సముద్రగుప్తుని కుమారుడు, సోదరుని చంపి అతని భార్యను పెండ్లాడి సింహాసనాన్ని అధిష్ఠించాడు. మాళవ, గుజరాతు, పంజాబు, బెంగాలులోని కొన్ని ప్రాంతాలను తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. మిగిలిన ఉత్తర భారతం అంతా గుప్తసామ్రాజ్య పరిధికి వెలుపలే ఉంది. అంతేకాదు యౌధేయులు, పుష్యమిత్రులు, కాకేయులు గుప్తులకు నామమాత్రపు సామంతులుగా ఉండి, అవకాశం దొరికిన వెంటనే తిరుగుబాటు ప్రకటించేవారు. గుప్తులు భారతసార్వభౌములు - అంటే దేశాన్నంతటినీ ఒక త్రాటిపైకి తెచ్చారనటం, కనీసం ఉత్తర భారతాన్నైనా ఒక గొడుగు నీడకు తెచ్చారనటం సత్యదూరం.

భారతీయ వ్యవస్థలోని సాంప్రదాయిక లొసుగులన్నీ గుప్తుల పాలనా యంత్రాంగంలో ప్రతిబింబించాయి. రాజ్యంలోని అన్ని ప్రాంతాలపైన అదుపు ఉండటము, విదేశీ దాడులనుండి

ప్రజలను రక్షించటము - ఏ ప్రభుత్వ బలసామర్థ్యాలకయినా కొలబద్దలు. కానీ హూణదండయాత్రలు, ప్రాంతీయ పాలకుల తిరుగుబాట్లు కారణంగా గుప్తసామ్రాజ్యం పేకమేడలా కూలిపోయింది. తరచు వారసత్వపు యుద్ధాలు, ప్రాంతీయ తిరుగుబాట్లు, విదేశీ దండయాత్రలతో తల్లడిల్లుతున్న రాజకీయ వాతావరణం పారిశ్రామికాభివృద్ధికి, వాణిజ్య విస్తృతికి అనుకూలం కాదు. ఆర్థికాభివృద్ధికి గుప్తరాజులు ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపినట్లు ఆధారాలు లేవు. గుప్తుల బంగారు నాణేలను వారి సంపదకు గుర్తుగా కొందరు పేర్కొంటారు. అదే నిజమైతే శాతవాహనుల సీసపు నాణేలు వారి సామ్రాజ్యంలో దారిద్ర్యానికి ఆర్థిక మాంద్యానికి చిహ్నం అనగలమా? నిజానికి శాతవాహన - కుషానుల కాలంలో దేశం సర్వతోముఖమైన ఆర్థికాభివృద్ధిని సాధించింది. రోమను బంగారం పెద్ద మొత్తంలో వీరి సామ్రాజ్యానికి చేరిందనటానికి బలమైన సాక్ష్యాధారాలు ఉన్నాయి. ఆ సంపదను గుప్తరాజులు వారసత్వంగా పొందారు. ఆ బంగారాన్ని తమ నాణేలుగా ఉపయోగించి ఉంటారు.

ఉత్తమ సాహిత్య సృష్టి, కళాభివృద్ధి ఏ స్వర్ణయుగానికయినా ప్రత్యేక సూచికలు. దురదృష్టవశాత్తు గుప్తరాజుల పాలనా కాలంలో ఏ మహాకవి ఉన్నట్లు ప్రామాణికంగా చెప్పలేము. మహాకవి కాళిదాసు కాలం వివాదాస్పదం. ఏ గుప్తరాజా గౌరవ ఆదరణలు కాళిదాసు పొందినట్లు ఆధారాలు లేవు. గుప్తుల కాలంనాటి వారుగా చెప్పబడే ఇతర కవులు గుప్తరాజ్యానికి వెలుపలే ఉన్నారు. శిల్పము, చిత్రలేఖనాది కళల విషయమూ అంతే. గుప్తరాజులు నిర్మించినవిగా చెప్పబడే దేవాలయాలు విస్తీర్ణతాపరంగా సంఖ్యాపరంగా గణనీయమైనవి కావు. గుప్తరాజులకు ఆపాదిస్తున్న సార్వభౌమిక వైభవాన్ని అవి ప్రతిఫలించటం లేదు. గుప్తరాజుల కళాపోషణకు చిహ్నంగా 'అజంతా'ను ఉదహరిస్తారు. కాని అజంతా వారి రాజ్యానికి వెలుపలే ఉంది. అందులోని కుడ్య చిత్రాలు గుప్తులు పెంచి పోషించిన మతభావాలకు అనుగుణంగా లేవు.

గుప్తుల కాలంలో 'హైందవ పునరుజ్జీవనం' వెల్లివిరయటం నిజం. గుప్తులకాలం నాటికి వైదికమతం (Brahmanical Religion) నేడు మనం పేర్కొనే 'హిందూమతం' (నవ హైందవం)గా రూపాంతరం చెందింది. ఈ రూపాంతరానికి కారణం బౌద్ధమత ప్రభావమేనని మనం గ్రహించాలి. ఈ నవ్యహిందూ మతానికి ఏ పటిష్టమైన తాత్త్విక చింతన ప్రాతిపదికగా లేదు. ఉపనిషత్కారులంతటి దీర్ఘదర్శులు, మౌలిక చింతనాపరులు జ్ఞానధనులు గుప్తుల కాలంలోనూ, ఆ తర్వాత కూడా హిందూ మతంలో ఉద్భవించకపోవటం ఆశ్చర్యకరమైన సత్యం. శంకరాచార్యుని భాష్య రచన మినహా హైందవ తాత్త్వికత అంతా స్తబ్దతతో కూడినదే. ఈ నవ్య హిందూ మతానికి పురాణాలు ప్రాతిపదికలు. పరస్పర విరుద్ధ భావజాలంతోను, విస్తృష్టతా లోపంతోను పురాణాలు ఉన్నాయనీ స్పష్టమైన ఆలోచనకు, విచక్షణాయుత నిర్ణయ సామర్థ్యానికి అవి పనికిరావనీ ప్రొఫెసరు ఆర్. సతియనాథ్ అయ్యర్ వంటి సనాతన చరిత్రకారులే అభిప్రాయపడ్డారు. నిజానికి పురాణాలు మూఢవిశ్వాసాలను ప్రచారం చేసాయి. అసంఖ్యాకులైన దేవతలను పూజించటం పురాణమత ముఖ్య లక్షణం. ప్రతిదేవతకూ ఒక ప్రత్యేక రూపం ఇవ్వబడింది. ప్రజలలో శాఖాపరమైన ద్వేషాలు, అసూయలు చోటు చేసికున్నాయి. విగ్రహారాధనకై ఆలయనిర్మాణం జరిగింది. దేవాలయాలు ప్రజల సాంఘిక, మత జీవనాలకు కేంద్రస్థానాలైనాయి. (యూరపులోని మతాధికారివలెనే) దేవాలయాలు 'యథాస్థితికి' రక్షణ కవచాలయి సామాజిక పరివర్తనానికి ప్రతిబంధకాలయినాయి. బ్రాహ్మణు

లకు ఉన్నత సామాజిక స్థానాన్ని కలిగించిన కులవ్యవస్థ పురాణమతంలో ప్రధాన అంశమైంది. అసంఖ్యాక దేవతారాధన, కులవ్యవస్థ - సాంఘిక ఐక్యతా ప్రాముఖ్యతను, పటిష్టతను తగ్గించివాయి. నవ్య హిందూమతానికి ప్రామాణికంగా కీర్తించబడే మనుస్మృతి గుప్తులకాలంలో క్రోడీకరింపబడింది. మనుస్మృతి కులవ్యవస్థను బలపరిచింది; విదేశ పర్యటనను నిషేధించింది. దీనితో భారతదేశం చాలాకాలం ఒంటరిగా ఉండిపోయింది.

'రాజకీయ స్థిరత్వము, ఆర్థిక ఔన్నత్యము, ఉత్తమ కళాసాహిత్యాల సృజనతో భారతీయ సంస్కృతి వెల్లివిరిసింది' అని గుప్తరాజుల కాలాన్ని కీర్తించలేము. వారి పాలనా కాలంలో దేశం అంతరంగికంగా మతవిద్వేషాలకు, సాంఘిక అసమానతలకు - అనైక్యతకు ఆలవాలమైంది; బాహ్య ప్రపంచంతో సంబంధాలు కోల్పోయింది. ఇస్లాము దండయాత్రల ధాటికి హైందవులు దాసోహం అనటానికి ఇవే ముఖ్య కారణాలు.

ఇక బౌద్ధాన్ని విశ్లేషణాత్మకంగా పరిశీలిద్దాం. గుప్త రాజులకు పూర్వం సుమారు ఆరువందల సంవత్సరాలపాటు భారతదేశంలో బౌద్ధం ప్రబలంగా ఉంది. క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దంలో సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక రంగాలలో అరాచకం ప్రబలి భారతదేశం క్లిష్టపరిస్థితిని ఎదుర్కొంటున్నది. అది సమస్యల కాలం. జాతివైషమ్యాలు, కులవిద్వేషాలు, సాంఘిక అసమానతలు సమాజాన్ని పీడిస్తున్న కాలం; రాజకీయంగా ఆర్థికంగా సంధికాలం; చిన్న గణతంత్రాలన్నీ కేంద్రీకృత సార్వభౌమాధికారానికి తలలొగ్గుతున్న కాలం; పెద్ద రాజ్యాలకు అవసరమైన రాజ్యాంగ వ్యవస్థ రూపకల్పనకు ప్రయత్నాలు జరుగుతున్న కాలం. వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమలు వేళ్లూనుతున్నాయి. ఆర్యేతర జనుల సహాయ సహకారాలు అవసరమైనాయి. వారిని సమాజంలో విలీనం చేయటానికి రక్తసంబంధ భావన ఉపకరించదు. విస్తృత మానవతా సంబంధమైన కొత్త భావన అవసరమయింది. ఈ సమస్యలకు జవాబుగా బౌద్ధం అవతరించింది.

బౌద్ధం ప్రాయికంగా ఒక దర్శనం. అది శూన్యం నుండి వెలువడలేదు. అప్పటికి ఉపలబ్ధమైన సమస్త విజ్ఞాన - అనుభవాల సమన్వయ ఫలితంగా ఉద్భవించింది. ఉపనిషత్తులు, బార్హస్పత్య దర్శనంతోసహా అన్ని దర్శనాలు బుద్ధుని జ్ఞానతృష్ణను తీర్చి అతని తాత్త్విక చింతనకు మార్గదర్శకత్వం వహించాయి. ఫలితంగా సమకాలీన సమస్యలకు పరిష్కారంగా ఒక నూతన జీవిత విధానాన్ని బౌద్ధం ప్రతిపాదించింది. తృణీకరించటం ద్వారాకానీ, అంగీకరించటం ద్వారాకానీ బుద్ధుడే రహస్యజ్ఞానానికి (ఉపనిషత్తులకు) బహుళ ప్రచారం కలిగించాడు.

ఉపనిషత్తులకు పునాది అయిన 'ఆత్మ'ను బుద్ధుడు త్రోసిపుచ్చాడు. ఆత్మపట్ల విశ్వాసం వ్యక్తిగత అహానికి, స్వార్థానికి హేతువనీ స్వార్థం నుండే అన్ని పాపాలు పుడతాయని బోధించాడు. కానీ, అదే సమయంలో బుద్ధుడు 'అద్వయవాది'. సర్వమానవులే కాదు, ప్రాణులందరి బాహ్యం వైవిధ్యం అయినప్పటికీ, అంతఃమాత్రంగా నిబద్ధీకృతమైన ప్రాథమిక ఐక్యతను బుద్ధుడు గుర్తించాడు. ఈ వాదం ప్రకారం సర్వప్రాణులకు 'జీవం' ప్రధాన లక్షణం. జీవం 'అద్వయం' 'అవిభాజ్యం'. అందువలనే జీవుల సుఖదుఃఖాలకు వ్యక్తి హృదయం స్పందిస్తుంది. మైత్రి, కరుణ, ముదిత (Equanimity) మున్నగు భావాలు ఉత్పన్న

మౌతాయి. అయితే వృక్షాల్లో, పశుపక్ష్యాదులలో భిన్న జాతులున్నాయి కానీ మానవజాతి ఏకైకము. ఈ విధమైన గ్రహింపువలన వ్యక్తి మానవులలో 'తనను' గ్రహిస్తాడు. ఈ గ్రహింపే కరుణ, ముదితలు పెల్లుబకటానికి దారితీస్తుంది. ఆత్మను అంగీకరించకపోవటం, అద్వ యాన్ని గుర్తించటం బౌద్ధ దర్శనానికి ఆయువుపట్టు. దయ, సమతాభావాలు, వైయక్తిక నైతికత, సామాజిక విలువలు గట్టి పునాదులు. దీనిని కఠోర దీక్ష, దృఢ సంకల్పంతో వ్యక్తి తనకు తానే సాధించాలి. మానవుని శక్తి సామర్థ్యాలు, నిజాయితీపై బుద్ధునికి విశ్వాసం. తన భవిష్యత్తును నిర్మించుకునే ఆత్మ విశ్వాసాన్ని మనిషిలో కలిగించాడు. అంతేకాదు, తాను నివసించే సమాజాన్ని నిర్మించటానికి, పునర్ వ్యవస్థీకరించటానికి అవకాశం కల్పించాడు. అందుకే బౌద్ధం చైతన్యానికి, సామాజిక ప్రగతికి ఉద్భవించిన దర్శనం అయింది.

జాతుల - కులాల అడ్డుగోడల్ని కూలద్రోసి ఐక్య సంఘటనదిశగా ప్రజల్ని మేలుకొలిపింది బౌద్ధం. ఆ చైతన్యమే మహాపద్మనందునికి అండగా నిలిచింది. దానితో అతడు భారతదేశంలో చారిత్రాత్మకమైన మహాసామ్రాజ్యాన్ని స్థాపించిన మొదటివాడయాడు. అతని సామ్రాజ్యం సింధునది నుండి గోదావరి వరకు విస్తరించింది. ముందున్న క్షత్రియ రాజులకు సాధ్యంకాని అపూర్వము, అద్వితీయము అయిన ఘనతను సాధించాడు. కొత్తమతాలైన బౌద్ధ జైనాలు ప్రసాదించిన ఉత్తేజమే దానికి కారణం. బ్రాహ్మణ వాఙ్మయం మహాపద్మనందుని 'అజ్ఞాతకుల జుని'గాను, 'అధార్మికు'నిగాను పేర్కొంది. నందసామ్రాజ్య పునాదులపైననే అశోకమౌ ర్యుడు తన రాజ్యాన్ని దాదాపు భారత ఉపఖండమంతటా విస్తరింపజేసాడు. అశోక చక్రవర్తినికూడా బ్రాహ్మణ వాఙ్మయం 'అధార్మికు'నిగానే పేర్కొంది. అశోకుడు భారతదేశ సమైక్యతకు అనేక విధాల కృషి చేశాడు. అసంఖ్యాక ప్రజానీకానికి అర్థమయే ఒకే భాష - పాళీ, ఒకే లిపి - బ్రాహ్మి దేశమంతటా ప్రవేశపెట్టాడు. ఆర్థిక ప్రమాణాల మెరుగుదలకు దోహదపడే రహదారులను సుదూర ప్రాంతాలను కలుపుతూ సామ్రాజ్యమంతటా నిర్మిం చాడు. దండసమత, వ్యవహార సమత (న్యాయం దృష్టిలో, శిక్షాస్మృతి దృష్టిలో అందరూ సమానులే) అనే విధానాన్ని ప్రవేశపెట్టాడు. అన్నిటినీ మించి 'ధర్మం' ప్రాతిపదికగా నూతన జీవనవిధానాన్ని రూపొందించే ప్రయత్నం చేసాడు. బౌద్ధమతమే అశోకుని 'ధర్మా'నికి మూలం. అతని 'ధర్మం' వర్గరహితం. లౌకికత, సాంఘిక విలువలు దాని ఆయువు పట్టులు. కారణం అతని రాజనీతిజ్ఞత. అశోకుని మరణానంతరం అశోకధర్మం కూలద్రోయబడింది. అశోకుడు సాధించిన అఖండ భారత ఐక్యత తిరిగిపొందలేనంతగా విచ్ఛిన్నమయింది.

బౌద్ధం జ్ఞానవాహినికి అడ్డుకట్టలు కూలద్రోసి అందరి జ్ఞానతృష్ణను తీర్చింది. బ్రాహ్మణ మతం 'గురుకులాలు' స్థాపించింది. గురుకులం అంటే అధ్యాపకుని పరివారం అని అర్థం. అధ్యాపకుని పరివారానికి మాత్రమే పరిమితం. అధ్యాపకులు చాలవరకు బ్రాహ్మణులే. దీనికి దీటుగా బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించారు. వ్యత్యాసాలకు తావులేక అందరికీ అన్ని విద్యలు ప్రసాదించే ఆలయాలు అవి. బౌద్ధ సాహిత్యానికి, తాత్త్విక చింతనకు అన్ని స్థాయిల స్త్రీలు, పురుషులు దోహదం చేసారు. కారణం బౌద్ధంలోని ఉదారతే. దీనికి ఒక ఉదాహరణ 'ఉపాలి'. ఉపాలి వృత్తిరీత్యా మంగలి. అతని మార్గదర్శకత్వంలో బుద్ధుని ఉపదేశాలు 'వినయ'గా క్రోడీకరించబడినై. పిటకాలలోకెల్ల ముఖ్యమయింది 'వినయపిటక'. ఉపనిషత్తుల, దర్శనాల కాలం తర్వాత బౌద్ధకాలం నాటి సర్వసమభావ వాతావరణం భారతీయ దర్శనాన్ని

సుసంపన్నం చేసింది. మౌద్గల్యాయన, అశ్వఘోష, వసుమిత్ర, నాగార్జున, ఆర్యదేవ, అసంగ, వసుబంధు, భవ్య, దిన్నాగ, ధర్మకీర్తి చంద్రకీర్తి యింకా అనేకానేకులు భారతీయ తాత్విక తను అత్యున్నత శిఖరాలను చేర్చారు. అశ్వఘోషుడు అరిస్టాటిల్ సమఉజ్జీ. దిన్నాగుడు భారతీయ తర్కశాస్త్రానికి ఆద్యుడు. హిందూ దార్శనికతాపారమని కీర్తింపబడే ఆచార్య శంకరుని 'అద్వైతం' నాగార్జునాచార్యుని శూన్యవాదం నుండి ఉద్భవించిందే. అందుకే శంకరుని వ్యతిరేకులు అతనిని ప్రచ్ఛన్న బౌద్ధునిగా తూలనాడారు. బౌద్ధంలోనే కాక సనాతన బ్రహ్మణమతంలో విద్యావిషయంలో అనేక నిషేధాలు, నిబంధనలు విధించబడి నాయి. ఆ నిబంధనల భారంతో ఎంతటి సృజనాత్మక మేధాసంపత్తి నమసిపోయిందో ఊహించటం అసాధ్యం.

శిల్పము మొదలైన ఇతర కళలలోకూడా సృజనాత్మక క్రియాశీలతకు బౌద్ధమే ప్రేరణ ఇచ్చింది. భారతకళా చరిత్ర బౌద్ధకళల అధ్యయనంతోనే మొదలవుతుంది అనటం అతిశ యోక్తికాదు. ఆ అధ్యాయం బౌద్ధచక్రవర్తి అశోకునితో మొదలవటం గర్వించదగిన విషయం. అశోకుడు అనేక స్థూపాలు నిర్మించాడు. నున్నగా జలతారువలె మెరుగుపెట్టిన ఏకశిలాస్తంభా లను నెలకొల్పాడు. అశోకుడు మినహా పేర్కొనదగిన ఏ దేశీయ చక్రవర్తీ బౌద్ధాన్ని ఆదరించలేదు. మినాందరు, కనిష్కుడు విదేశీయులు. అశోకుని విషయంలో కూడా అతని ఉదార భావానికి, విశాల దృక్పథానికి అతని విదేశీ వారసత్వం కారణమని కొందరంటారు. మహోన్నతమైన సాంచీ ధాన్యకటక స్థూపాలు, పశ్చిమభారతంలో అపూర్వము, అద్వితీ యము అయిన శిలాచైత్యాలు - విహారాలు, బార్హుత్, అమరావతిలలోని అందమైన శిల్పసంపద, ప్రసిద్ధిచెందిన అజంతా కుడ్యచిత్రాలు ఆనాటి బౌద్ధుల కళాహృదయానికి ప్రత్యక్ష సాక్ష్యాలు; తర్వాతి కళాకారులకు స్ఫూర్తిదాయకాలు. కుతూహలం కలిగించే విషయమేమిటంటే, బౌద్ధకళ ప్రాయికంగా ప్రజాకళ. అంటే చాలవరకు సామాన్యప్రజలే సృష్టించారు, పోషించారు.

బౌద్ధస్థూపాలు, చైత్యాలు, విహారాలు యితర చిహ్నాలు సామాన్య ప్రజలే నిర్మించారు. వీరిలో చాలమంది వణిజులు, వృత్తిపనివారు. 'విధిక'డనే చర్మకారుడు సకుటుంబంగా స్థూపాన్ని దర్శించి పారితోషికాన్ని సమర్పించినట్లు అమరావతి స్థూపంలోని ఒక శాసనం ద్వారా తెలుస్తోంది. చెప్పులు కుట్టే వ్యక్తి మతసంస్థను దర్శించటం, పారితోషికాన్ని అర్పిం చటం హిందూమతంలో ఊహించలేని విషయం. భారతదేశ చరిత్రలో ఏ ఇతర కాలంలోనూ సామాన్య ప్రజలింతగా మతసంబంధమైన విషయాలలో - రచనలు, నిర్మాణాలు - పాలుపంచు కోవటం కన్పడదు. అతి తక్కువ స్థాయికి చెందిన వ్యక్తులు కూడా బౌద్ధసంస్థల సర్వతోముఖా భివృద్ధికి ఉత్సుకత కనపరచారు. బౌద్ధం పొందిన ప్రజాదరణకు, కలిగించిన చైతన్యానికి, చూపిన విశ్వసమభావతత్వానికి 'విధిక'ని ఉదాహరణ ఒక్కటే చాలు.

ఉత్కృష్టమైన ప్రపంచ గురుత్వస్థానాన్ని భారతదేశానికి బౌద్ధం ప్రసాదించింది. అశోకుడు పంపిన మతసంస్థలు, రాయబారులు తెలిసిన ప్రపంచపుటంచుల దాకా 'ధర్మ' జ్యోతిని తీసుకువెళ్లారు. ధర్మంతోపాటు భారతీయ నాగరికతా సంస్కృతులలోని అనేక వైశిష్ట్యాలను తీసుకువెళ్లారు. ప్రతి భారతీయుడు గర్వించగల మహోన్నత భారతీయ సాంస్కృతిక సామ్రాజ్యానికి పునాదులు వేసారు. బౌద్ధ తాత్విక చింతన - ఆచరణల నుండి క్రమం

ఇస్లాము చాలవరకు ప్రభావితమయినాయి. ప్రముఖ ఆంగ్లకవి ఆర్నాల్డ్ బుద్ధునిలో 'ఆసియా ఖండపు జ్యోతి'ని మాత్రమే చూచాడు. నిజానికి బుద్ధుడు ఆసియా ప్రసాదించిన 'ప్రపంచ జ్యోతి'. శంకరాచార్యుని 'జగద్గురువు'గా కీర్తించటానికి హిందువులు ఉబలాటపడతారు కానీ హిందువులలో కొద్దిమంది మాత్రమే శంకరాచార్యునికి ప్రణమిల్లుతారు. అందువల్ల జగద్గురువుగా తథాగతుడైన బుద్ధుని కీర్తించటమే జగద్గురు బిరుదానికి నిజమైన అర్థం చెప్పటం అవుతుంది.

బౌద్ధయుగంలో భారతదేశాన్ని ఒక గొడుగు క్రిందికి తీసుకురావటానికి ప్రయత్నాలు జరిగాయి; చాలవరకు ఫలించాయి. భారతీయ తాత్త్వికత మహోన్నత శిఖరాలనధిరోహించింది. కళా సాహిత్యరంగాలలో సృజనాత్మక నైపుణ్యం అద్భుతాలను సృష్టించటానికి బౌద్ధం స్ఫూర్తినిచ్చింది. శాంతి సౌభ్రాతృత్వాలకు మార్గదర్శిగా భారతదేశం ప్రపంచమంతటా గౌరవాన్ని పొందింది.

ప్రాచీన భారతదేశంలో ఏది స్వర్ణయుగం? గుప్తుల పాలనా కాలమా? బౌద్ధయుగమా? విజ్ఞులకే వదిలి వేస్తున్నాను.



# 5. ప్రాచీన భారత గణతంత్ర దేశాలు - వర్ణసామరస్యము

'చరిత్ర నిదర్శన పూర్వకంగా బోధించే దర్శనము; యుగ యుగాల అనుభవంతో మానవుని జ్ఞానవృద్ధుని చేయగల సాధనము' అని చరిత్రను గురించిన వ్యాఖ్యానం ఎంతో సత్యం. ఏ జాతి అయినా తన సాంస్కృతిక వారసత్వంలో నిబిడీకృతమైన దేశీయప్రతిభకి అనుగుణంగా తనను తాను మలచుకుంటుంది. ప్రేరణకు, మార్గదర్శకత్వానికి మాత్రమే ప్రజలు చారిత్రక వారసత్వాన్ని చూడరు. తమ లక్ష్యాలూ తాము పయనిస్తున్న ప్రగతిమార్గమూ, తమ వారసత్వానికి భిన్నమైనవి కావనీ తమ పూర్వీకులు పాదుకొల్పిన విశిష్ట విలువలకు అనుగుణంగానే ఉన్నాయి అనే నమ్మిక కోసం చరిత్రను అధ్యయనం చేస్తారు. చరిత్ర సత్యాలను ఆవిష్కరించి మార్గాలను చూపుతుంది. ప్రాచీన భారతీయ గణతంత్రదేశాల విశ్లేషణాత్మక అధ్యయనం ఈ విషయాన్ని సుస్పష్టం చేస్తుంది.

## ప్రాచీన గణతంత్ర దేశాలు

ఉత్తర భారతంలోని గణతంత్రదేశాల, రాచరిక దేశాల గురించి ప్రాచీన సంస్కృత ప్రాకృత వాఙ్మయాలు విశదీకరిస్తున్నాయి. 'కేచిద్దేశా గణాధీనాః కేచిత్ రాజాధీనాః'

గణతంత్రదేశాలు ముఖ్యంగా రెండు ప్రాంతాలలో కేంద్రీకృతమైనాయి. అవి: (1) భారతదేశ వాయవ్య ప్రాంతమైన 'సింధు-దాని ఉపనదుల లోయలు (పరీవాహక ప్రాంతాలు) (2) ఈశాన్య ప్రాంతాలైన నేటి ఉత్తరప్రదేశ్, బీహారులోని దక్షిణ హిమాలయ పర్వతసానువులు. ఉత్తర భారతదేశంలోని గణతంత్రదేశాల ఉనికిని ప్రసిద్ధ గ్రీకు మహాకావ్యాలు పేర్కొన్నాయి; ఆయా ప్రాంతాల్లో లభించిన నాణేలు ముద్రలు మొదలైన పురావస్తు ప్రామాణికాల స్పష్టం చేస్తున్నాయి. గణతంత్రదేశాలు అనేకం ఉండేవి. సుప్రసిద్ధ జైన వాఙ్మయం 'అచరంగ సూత్ర' (Acharangasutra) గణతంత్ర దేశాలను 6 విధాలుగా వర్గీకరించింది. కానీ మొదటి ఇండాలజిస్టులు (Indologists) వీటిని ఏ విశేషమూ లేని పురాతన ఆదిమ తెగలుగా కొట్టివేసారు. దీనికి ముఖ్యకారణం - వారు ఆంగ్ల సామ్రాజ్యవాదులో వారి తొత్తులో కావటమే. ఆంగ్ల సామ్రాజ్యవాద దురాక్రమణదారులకు లేని గొప్పతనాన్ని ఆపాదించే ప్రయత్నం అది. ప్రాచ్య మూఢ శృంఖలాలనుండి భారత జాతిని విముక్తం చేసి భారత ఉపఖండంలో శాంతి సౌహార్దతలను పాదుకొల్పిన ఉత్తమోత్తమ జాతిగా తెల్లవారు కీర్తింపబడాలనే ఆకాంక్షతోనే మొదటి 'ఇండాలజిస్టులు' నిజాల్ని కప్పిపుచ్చారు; మసిపూసి మారేడుకాయ చేసారు.

## ఉద్భవం - అభివృద్ధి

గణాలు ప్రాచీన కాలంలో ఆవిర్భవించిన మాట సత్యం. జీవితాన్ని సుగమం చేసుకునే దిశలో ప్రకృతిపై ఆధిపత్యం అవసరం అయింది. సహచర మానవుని సహాయ సహకారాంతో

ప్రకృతిని మిక్కిలి శక్తివంతంగా ప్రతిఘటించగలమని గ్రహింపు కలిగిన నాడే గణాలు ఏర్పడినాయి. నాటినాగరికతా ప్రథమ దశలో, వ్యవసాయ భూమి-ఫలం సమంగా అనుభవించే వారు. ఈ విధమైన ఆర్థిక పరిస్థితులు 'అందరికై ఒకరు - ఒకనికై అందరూ' అనే భావాన్ని పెంపొందించి 'వ్యక్తి - తెగ (జాతి)' భావ ఐక్యతకు దారితీసినాయి. ఇదే గణతంత్రానికి పునాది అయింది. గణాలు ఈ ఆదిమ ఆర్థిక స్థితుల్ని అధిగమించిన తర్వాత కూడా చాలాకాలం 'తెగ' భావం వారిని బంధించి ఐక్యంగా ఉంచింది. ఈ తెగ భావానికి కారణం 'రక్తసంబంధం' అనే నమ్మకం. ఒక తెగ ప్రజలందరి మూలపురుషుడు ఒకడే అనే విశ్వాసం. అతడు పురాణ పురుషుడో, ఇతిహాస నాయకుడో అయి ఉండేవాడు. ఉదాహరణకి వాయవ్య ప్రాంతంలోని యూధేయులు, అర్జునయానులు తమ మూలపురుషులు మహాభారత నాయకులైన యుధిష్ఠిరుడు, అర్జునుడు అని విశ్వసించేవారు. గణాలను ఐక్యంగా ఉంచటానికి, తెగ భావానికి తోడు యితర కారణాలు కూడా తోడ్పడినాయి. ఈశాన్య పర్వతసానువులలోని ఆర్థిక ఇబ్బందులు, వాయవ్య ప్రాంతంపై తరచూ విదేశీదండయాత్రలు వీరిని ఏకమత్యంగా ఉంచాయి. ఈ కారణాల వలన గణతంత్ర దేశాలు క్రీస్తు శకం 4వ శతాబ్ది మధ్యవరకు కొనసాగాయి.

గణతంత్రాలను అనాగరిక తెగలుగా భావించటం సాహసమే అవుతుంది. విస్తీర్ణత దృష్ట్యా, రాజకీయ యంత్రాంగం దృష్ట్యా ఇవి ప్రాచీన గ్రీకు గణతంత్రాలకు ఏమాత్రం తీసిపోవు. 'లిచ్ఛవి' గణతంత్ర దేశం ప్రాచీన గ్రీకు గణతంత్ర దేశాల్లోకెల్లా పెద్దదయిన 'స్పార్టా'తో అన్ని విధాలా సమానము. 'శాక్య' దేశం 'ఏథెన్స్'కు సమాన వైశాల్యం కలిగి ఉండేది. భారత వాయవ్య ప్రాంత గణతంత్రదేశాలు ఇంకా పెద్దవి. అలెగ్జాండరుతో యుద్ధానికి మాళవులు ఒక లక్ష సైన్యం సమీకరించగలిగారు. 500 రథాలు, 6000 అశ్వికదళం, 60వేలు పదాతిదళాలతో 'అంబష్ఠ' సైన్యం విలసిల్లింది. ఈ లెక్కలు ప్రాచీన భారత గణతంత్రదేశాల వైశాల్యాన్ని, శక్తిసామర్థ్యాలను చాటుతున్నాయి. గణాల సాంస్కృతిక ఔన్నత్యం కూడా తక్కువయింది కాదు. కపిలుడు, మహావీరుడు, గౌతమ బుద్ధుడు - మున్నగు సార్వకాలిక మేధస్సంపన్నులను మానవాళికి ప్రసాదించిన ప్రాచీన భారత గణతంత్ర ప్రజలను ఆదిమ అనాగరిక తెగలుగా గణించటం క్షమార్హం కాదు.

## వర్ణ సామరస్యము

రాచరిక దేశాలు : ప్రాచీన భారత గణతంత్రదేశాలలో పూర్తి వర్ణ(కుల) సామరస్యం ఉండేది. రాచరిక దేశాలకు గణతంత్రదేశాలకు ముఖ్య భేదం అదే. బ్రాహ్మణ, ఇతర కులాల మధ్య సంఘర్షణ గురించి బ్రాహ్మణ వాఙ్మయం విపులంగా వివరించింది. పరశురామ - కార్తవీర్యుల స్పర్థ దీనికి ఉదాహరణ. క్షత్రియులు వైశ్యులు బ్రాహ్మణులకు అధీనులై ఉండే విషయమై 'పంచవింశ బ్రాహ్మణ' కొన్ని క్రతువులను పేర్కొంది. అర్హులయిన మఠాధిపతులను నియమించని రాజునుండి తర్పణాలను దైవం స్వీకరించదని 'ఐతరేయ బ్రాహ్మణం' నిర్దేశించింది. బ్రాహ్మణుల ఆస్తులను జప్తుచేసిన రాజులను 'అధర్వవేదం' శపించింది. బ్రాహ్మణులు అనుభవించే ప్రత్యేక హక్కులు ఇతర వర్ణాలలో కోపాన్ని కలిగించాయి. బ్రాహ్మణుల ప్రత్యేక హక్కులను తీసివేసి సమాజంలోని ఉన్నత స్థానం నుండి వారిని తొలగించటానికి, ముఖ్యంగా క్షత్రియులు ప్రయత్నించినట్లు తెలుస్తోంది.

**1. సాంఘిక ఉదారభావం:** గణాలలో సమాజం కుల పునాదులపైననే నిర్మింపబడింది. ఒక అభిప్రాయం ప్రకారం - క్షత్రియ (శస్త్రోపజీవి), బ్రాహ్మణ, వైశ్య గణాలుండేవి; అంటే ఆ వర్ణం (కులం) వారు గణపాలకులు. కులాలు వృత్తి సంఘాలకు పరిమితమై ఉండేవి. అప్పటికింకా స్వలాభాపేక్ష వెర్రితలలు వేయలేదు. ద్వేషం అసూయలకు అవకాశం లేని విధంగా మొత్తం యంత్రాంగం ఉదారభావంతో ఉండేది. 'వైరాజ్యగణం' లోని జనులు 'నాది-నీది' అనే భేదాన్ని పరిగణించేవారు కారని 'అర్థశాస్త్రం' చెబుతోంది. 'అరాజకగణం' లోని ప్రజలు ఆహారపానీయాలను సమంగా పంచుకునే వారని 'అథర్వవేదం' చెబుతోంది. పంజాబులోని 'మద్ర', 'వాహిక' తెగలు వారి కులాన్ని వరసక్రమంలో (Rotation) మార్చుకునేవారు. అంటే ఒక వ్యక్తి మొన్న బ్రాహ్మణుడు, నిన్న క్షత్రియుడు, నేడు వైశ్యుడు రేపు శూద్రుడు. ఆ మరుసటి దినాన తిరిగి బ్రాహ్మణుడయేవాడు. ఈ కారణం వలనే సనాతన న్యాయనిర్దేశకులు (Law-givers) 'మద్ర', 'వాహిక' దేశాలకు బ్రాహ్మణులు వెళ్లరాదని నిషేధాజ్ఞలు విధించారు.

**2. లౌకిక దృష్టి:** వృత్తిసంఘాలు కరుడుకట్టిన కులాలుగా స్థిరపడటాన్ని తెగభావమూ వాయవ్య ఈశాన్య ప్రాంతాలలో ఇంతకుముందు వివరించిన పరిస్థితులు నివారించినాయి. బౌద్ధ జైన వాఙ్మయాలు క్షత్రియుల తర్వాతిస్థానాన్ని బ్రాహ్మణులకిచ్చినాయి. సమాజ స్థాయిలో ఈ పద్ధతి లౌకిక శక్తికి మతతత్వం లొంగుబాటును తెలియజేస్తుంది. గణతంత్రదేశాల్లోని ప్రజాజీవనం సుఖసంతోషాలకు ఆలవాలమయి ఉండేది. జీవితం సంతోష భరితంగా సౌందర్యమయంగా ఉండాలన్నది నాటి ప్రజాదృక్పథం. వ్యవసాయక, పారిశ్రామిక, వాణిజ్య రంగాలలో సమృద్ధిని సాధించి మన ప్రాచీన గణతంత్రదేశాలు సిరిసంపదలతో సుఖసంతోషాలతో ఉండేవని ప్రామాణిక మహాకావ్యాలు ధృవీకరిస్తున్నాయి.

**3. ప్రజాస్వామ్య సంప్రదాయాలు:** సామాజిక ఉదారభావమూ, భౌతిక సంపదలు ప్రజాస్వామ్య సంప్రదాయాలు మొలకెత్తి చిగురించి సర్వతోముఖాభివృద్ధి చెందటానికి దోహదపడినాయి. అవే వర్ణసామరస్యాన్ని వృద్ధి చేసినాయి. ప్రజాస్వామ్యానికి నేడు మనం చెప్పుకునే అర్థానికి నాటి గణతంత్రదేశాలు పూర్తి అనుగుణంగా లేవిమాట వాస్తవమే. రెండు విధాల మాత్రమే అవి అసంపూర్ణం. మొదటిది - గణాలలో రాజకీయాధికారం సాధారణ శాసనసభ (General Assembly) పరంగా ఉండేది. ఈ సభ ఒకే కులానికి (వర్ణానికి) చెందిన కుటుంబ పెద్దల ఆధిపత్యంలో ఉండేది. ''కులానాంహి సమూహస్తు గణః సంపరికీర్తితః'' అని 'వీరమిత్రోదయ' చెబుతోంది. శాసనసభ (చట్టసభ) సభ్యులను రాజా (రాజన్) అని పిలిచేవారు. సభ్యత్వం వంశ పారంపర్యంగా సంక్రమించేది. రెండవలోపం - గణాల ఆర్థిక వనరులన్నీ పౌరసత్వం లేని బానిసలపైననే ఆధారపడి ఉండేవి. ప్రాచీన గ్రీకు గణతంత్ర దేశాల్లో కూడా ఈ పద్ధతే ఉండేది. ఈ లోపాలు ఉన్నప్పటికీ ప్రాచీన భారతీయ గణతంత్రదేశాలు ప్రజాస్వామ్య సాంప్రదాయాలను ప్రతిపాదించి ఆచరించి ముందుతరాలకు గణనీయమైన మార్గదర్శక సూత్రాలను ప్రసాదించినాయి.

కేంద్ర ఆధిపత్యానికి స్థానిక పరిపాలనకు అర్థవంతమైన సమతూకాన్ని గణతంత్ర రాజ్య యంత్రాంగం పాటించేది. కేంద్ర శాసనసభ గొప్ప సభగా అలరారుతుండేది. సరిహద్దు దేశాలతో సంబంధాలు, శాంతి - యుద్ధం మున్నగు జనులందరికీ వర్తించే సర్వసాధారణ విషయాలపై శ్రద్ధ వహించేంది. స్థానిక చట్టసభలకు మిగిలిన అన్ని అధికారాలు ఉండేవి. స్థానిక సభల పాలనాధికారంలో కేంద్రం సాధారణంగా తలదూర్చేదికాదు. స్థానిక సభలలో అన్ని కులాల ప్రజానీకానికి సభ్యత్వం ఉండేది. తనజాతి అవసరాలను తీర్చే కృషిలో ఉడుతాభక్తిగా పాలుపంచుకునే అవకాశం తనకుకూడా ఉన్నట్లు ప్రతివ్యక్తి భావించేవాడు. 'ప్రభుత్వం తమది - తామే ప్రభువులు' అని అందరూ భావించేవారు.

శాసన సభ్యులెవ్వరూ నిష్క్రియులు, నామమాత్రపు సభ్యత్వం కలవారు కారు. చురుకైన, జ్ఞానవంతులైన పౌరులుగా శిక్షణపొందేవారు. సమర్థులైన పాలకులుగా తమ స్థానాన్ని పదిలపర చుకునేవారు. ఇతరుల అవహేళనలకు గురి అయేవారు కారు. అదే సమయంలో, ప్రజల విషయంలో తమ బాధ్యతను విస్మరించేవారు కారు. జాతి సంక్షేమం ఎల్లవేళలా వారి హృదయాలలో పదిలంగా ఉండేది. తమ జాతి కష్టనష్టాల గురించి స్వేచ్ఛగా చర్చించేవారు; ఏకగ్రీవంగా నిర్ణయాలు తీసికొనేవారు. హేతుబద్ధమైన తర్కంతో ప్రతిసభ్యుడు సభాసదుల నందరినీ ఆకట్టుకునేవాడు. నీతిబాహ్యమైన పద్ధతిలో సభ్యులపై ఒత్తిడి తేవటం, తన పలుకుబడితో సభనంతనీ లోబరుచుకోవటం ఆకాలంలో తెలియవు. రాజకీయాల్లో రాణించ లేని వ్యక్తి రాజకీయాలను వదిలివేసేవాడు. వ్యవసాయ వాణిజ్య రంగాలలో తన అదృష్టాన్ని పరీక్షించుకునేవాడు. అంతేకాని, రాజకీయాలను వృత్తిగా ఎవరూ స్వీకరించేవారు కారు.

రాజకీయవేత్తల నీతిబద్ధత, ప్రజాసంక్షేమంపై వారి శ్రద్ధాసక్తులు ప్రజల్లో తమపాలకులపై విశ్వాసాన్ని కలిగించేవి. తమ అవసరాలు గుర్తించి తీరుస్తారనీ, ప్రజల సుఖసంతోషాలకై పాటుపడుతున్నారనీ, తమ భవిష్యత్తు వారి చేతుల్లో, చేతల్లో సురక్షితమనీ ప్రజలు నమ్మేవారు. సభానిర్ణయాలను తు.చ. తప్పకుండా ప్రజలందరూ పాటించేవారు. ఈ పరిస్థితులు సామాజిక సామరస్యాన్ని పెంపొందించి పాలకుల - పాలితుల మధ్య సంపూర్ణ సదవగాహనకు సఖ్యతకు తోడ్పడినాయి. 'వజ్జియన' గణతంత్ర దేశాన్ని గురించి బుద్ధుడు ఆనందునితో యిలా అన్నాడు. ''వజ్జియనులు కలిసి సంపూర్ణసహకారంతో తమ సంబంధా లను సమస్యలను చర్చించి పరిష్కరించుకున్నంత కాలం వారు పతనం చెందరు; అభివృద్ధి చెందుతారు.''

## దేశభక్తి

గణతంత్ర దేశాలలోని ప్రజలమధ్య ఆత్మీయత, ప్రభుత్వంతో తాదాత్మ్యత దేశభక్తి బీజాలుగా మనం గ్రహించవచ్చు. గ్రీకు ఆక్రమణదారుడైన అలెగ్జాండరుపై యుద్ధానికి మాళవుల - ఇతర గణాల మధ్య సామరస్యం, అజాతశత్రు దండయాత్రలకు వజ్జియనులు అడ్డుపడిన విధానము ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. గణతంత్రదేశాలలోని జనులు తమ ప్రభుత్వానికి ప్రాణాలర్పించటానికి సిద్ధపడేవారు కాని శక్తివంతుడైనప్పటికీ ఆక్రమణ

దారునికి తలవొగ్గేవారు కాదు. ఈ విధంగా భారత ప్రాచీన గణతంత్ర దేశాలలోని ప్రజాస్వామ్య నైతిక విలువలపాదులో దేశభక్తి వెల్లివిరిసింది.

భారతభూమిపై గణతంత్ర సాంప్రదాయాలు ప్రాచీనకాలంలోనే వెల్లివిరిసివాయి; కుల (వర్ణ) సామరస్యం, లౌకిక దృష్టి, నిజాయితీతో కూడిన రాజకీయాల ఆధారంగానే నిజమైన, అర్థవంతమైన ప్రజాస్వామ్యం మనగలదు; అనే సత్యాలను ప్రాచీన భారత గణతంత్ర దేశాలు గురించిన సమగ్ర విశ్లేషణాత్మక అధ్యయనం ఆవిష్కరిస్తోంది.



# 6. భారతీయ వస్త్ర ధర్మ సంస్కృతి

వస్త్రధారణలో భారతీయులు సనాతనము విశిష్టమునైన సంప్రదాయాలు నిర్మించుకొన్నారు. ప్రాచీన నాగరికతా కేంద్రాలైన మొహంజొదారో హరప్పాలలో దొరికిన శిథిలాలను బట్టి ఐదువేల సంవత్సరాలకు పూర్వమే ఈ సంప్రదాయాల చరిత్ర ప్రారంభమైనట్లు స్పష్టమవుతున్నది. కాని హరప్పాలోనే నగ్న నర్తకీ ప్రతిమ, నగ్న పురుష ప్రతిమలు కూడా బయల్పడినాయి. ప్రాచీన ఈజిప్టులోవలె సింధు ప్రజల్లోకూడ నట్టువరాండ్రు కొన్ని [illegible]మలు వివస్త్రలుగా ప్రదర్శించే ఆచారం ఉన్నట్లు విమర్శకుల అభిప్రాయము. నగ్నపురుష ప్రతిమే 'శిశ్నదేవతా' ప్రతిమ. ఈతడే తరువాతి కాలంలో 'దిగంబరు'డని ప్రసిద్ధి పొందిన మహాదేవుడైనాడు. కాబట్టి సింధుప్రజల్లో నగ్నత సర్వసామాన్యం కాదని గ్రహించవచ్చు.

ఐతే ఋగ్వేదంలో 'సువసన', 'వస్త్రేవభద్ర సుకృతా' అనే ప్రయోగాలు, వస్త్రాలను బహూకృతిచేసే ఆచారమూ కన్పిస్తున్నాయి. సాధుస్త్రీలు వివస్త్రలుగా జలకమాడడాన్ని సైతం స్మృతిశాస్త్రం నిషేధిస్తున్నది. హత్యానేరం చేసిన విప్రునికి దిసమొలతో గాడిదపై ఊరేగించుటే తగిన శిక్షగా మనుధర్మశాస్త్రం విధించింది. ఇంతకంటే మరణశిక్ష మేలుగదా! భారత రామాయణాలలోను కాళిదాసాది మహాకవుల కావ్యాల్లోను ఒంటినిండ వస్త్రాలు ధరించడం సౌజన్యానికి నచ్ఛీలానికి లక్షణమైనట్లు వర్ణించబడింది. దీనికి అనుగుణంగా 'ఇండియాలోని స్త్రీలు పాదాలు, బుజాలు కన్పించని రీతిగా దుస్తులు ధరిస్తారని' ఏడో శతాబ్దంలో హుయాన్‌త్సాంగ్ ఇచ్చిన యోగ్యతా పత్రం.

భారతీయ సంస్కృతిలోని భిన్నత్వమే భారతీయ వస్త్రధారణ పద్ధతిలో ప్రతిఫలిస్తుంది. దేశం సువిశాలమై భిన్న భౌగోళిక పరిస్థితులున్నందున వస్త్రధారణలో సైతం భిన్నత్వం కనిపించడం చాల సహజం. ఈ పరిస్థితులకు తోడు శక యవన కుషాణ తురుష్కాది జాతులు దండెత్తివచ్చి వారివారి దుస్తులను ప్రవేశపెట్టినారు. హిందూసమాజంలో వర్ణ ఆశ్రమ ధర్మాలను వృత్తులను అనుసరించి ప్రత్యేక వస్త్రధారణా పద్ధతులు రూపొందినాయి. ఇంతటి విపరీత వైవిధ్యంలోకూడ భారతీయ వస్త్రధర్మ సంస్కృతిలో ప్రాథమికమైన ఏకత్వం గోచరిస్తుంది. వైదేశిక విభేదాలు అచిరకాలంలోనే స్థానిక సంప్రదాయాలతో సామరస్యం పొందినాయి. రాజుల ఆస్థానంలోను ధనిక ఉద్యోగివర్గాలలోను మినహాయించి సామాన్య ప్రజానీకంలో స్వల్ప విభేదాలు వినా అనాదిగానున్న మౌలిక సంప్రదాయాల్లో మార్పులు రాలేదనియే చెప్పవలెను.

సింధువేషము : హరప్పాయుగం నుండి నేటివరకు భారతీయుల దుస్తులలో ప్రధానమైనవి అంతరీయము, ఉత్తరీయము; ధోవతికి మరోపేరు అంతరీయము. ధోవతి ఉత్తరీయాలు ధరించడం ద్రావిడ ఆచారమని చరిత్రకారుల అభిప్రాయం. సింధు ప్రజలు ధోవతిని బిగుతుగా కట్టి ఉత్తరీయాన్ని ఉపవీతంగా ధరించేవారు. మోకాళ్ళ కిందివరకు జుబ్బాలు ఉండేవి. స్త్రీలు

అంతరీయాన్ని మొలకుచుట్టి, బిగుతైన మెడపట్టి ఉన్నచోళీ దానిమీద అంగరఖావంటి ఉడుపును ధరించేవారు. అంతరీయానికి బిగుతైన పూసలపేర్ల కక్ష్యా బంధాలుండేవి.

వైదిక వేషము: వైదిక వాఙ్మయంలో నీవి, వస, అధివస అనే పదాలు కన్పిస్తున్నాయి. నీవి యే అంతరీయమవి అధివస ఉత్తరీయమని 'వస' అనేది కంచుకాన్ని బోలిన వస్త్రవిశేషమని భావిస్తున్నారు. నీవి అనేది అంతరీయం కింద స్త్రీలు ధరించే పావడా అని కొందరు అభిప్రాయము.

కచ్చె: స్త్రీపురుషు లుభయులు అంతరీయాన్ని కచ్చెపోసి కట్టేవారు. పురుషుల కచ్చెలలో హస్తిశొండక, పంచకచ్చ, తాళవృంతక, మత్స్యవాళక, శతవల్లిక మొదలైన రకాలు ఉన్నట్లు శిల్పాగమాల ద్వారా తెలుస్తున్నది.

కక్ష్యాబంధము: అంతరీయాలపై వస్త్రకక్ష్యాబంధాలు, అంటే నడికట్లు, బిగించి వాని కుచ్చెళ్ళను చిత్రవిచిత్రంగా మలచి ధరించేవారు. మహాభారతంలో సువర్ణ కక్ష్యల ప్రసక్తివల్ల కక్ష్యాబంధాలు క్రమంగా ఆభరణాలుగా మారినట్లు గ్రహించవచ్చు. చివరికిది పురుషులలో కటిమాత్రంగాను స్త్రీలలో శ్రోణిమాత్రంగాను మిగిలింది. కాని నేటికీ పితృకార్య సందర్భా లలో వస్త్రంతో వడికట్టు ధరించడం విధ్యుక్త ధర్మంగానే పాటిస్తున్నారు.

చణ్డాతకము: స్త్రీల అంతరీయాలు సాధారణంగా గుల్ఫావలంబాలు. కాని చణ్డాతకములను అర్ధోరుకములను గూడ ధరించేవారు. చణ్డాతకములను నాట్యకత్తెలు మాత్రమే వాడినట్లు తెలుస్తున్నది. నిఘంటువులు మాత్రం చణ్డాతకాన్ని 'వరస్త్రీవిశేషం'గానే పేర్కొంటు న్నాయి.

వధూయం: నవవధువుకు 'వధూయం' అనే ప్రత్యేక వస్త్రాన్ని కట్టబెట్టేవారు. వధూయానికి హంస మిథునాల అంచులు ఉండేవి. 'వధూదుకూలం కలహంస లక్షణం' అని కాళిదాసు వర్ణించినాడు.

పైట, పైఠిణీ: స్త్రీలు స్తనాంశుకాన్ని దానిపై స్తనోత్తరీయాన్ని ధరించేవారు. స్తనోత్తరీయానికి తెలుగే పయ్యెద. ఇది 'మేలిముసుగు'గా 'దుపట్టా'గా రూపొందింది. స్తనాంశుక మే 'రవిక'గా మారింది. శాతవాహనయుగంలో రవికలు విలక్షణంగా ఉండేవని గాథాసప్తశతి నుండి తెలుస్తుంది. వాని వారోజుల్లో 'కంచులిక'లు అనేవారు. స్తనసంధిబంధ స్థలంలో 'కంచులిక' రెండుభాగాలను 'కవాటము' అనే పీలిక జత చేస్తుండేది. ఆంధ్రదేశంలో రవికకు పైఠిణి అని పేరు. రవిక జన్మస్థలం పైఠాన్ నగరమైనందున ఆపేరు వచ్చి ఉంటుంది.

కూర్పాసము: తరువాతి కాలంలో కంచుకాన్ని యవనులు దిగుమతి చేసినారు. కంచుకాన్ని ధరించినవాడే 'కంచుకి' లేక ప్రతిహారి. పూర్వకాలంలో మనరాజులు యవనులనే ప్రతీహారు లుగా నియమించుకొనేవారు. 'కంచులిక' గూడ కంచుకంనుండే వచ్చివుంటుంది. తరువాత కుషాణులు షేర్వాణివంటి 'అంగరఖా'ను తెచ్చినారు. శ్రీనాథుని కాలానికి ఇదే మహాకూర్పా సంగా రూపొంది వుంటుంది.

యజ్ఞోపవీతము : ఇక ఉత్తరీయాన్ని సంవీతం పద్ధతిలో ధరించేవారు. దేవ పితృ కార్యాలసంద ర్భాల్లో ఉత్తరీయాన్ని ఉపవీతంగా వేసుకునేవారు. అదే యజ్ఞోపవీతము. అగ్రవర్ణాలకు ఉపనయనకాలంలో యజ్ఞోపవీత ధారణ జరిగేది. యజ్ఞసమయాల్లో స్త్రీలు సయితం యజ్ఞోపవీతాలు ధరించేవారు. మహర్షులకు అజినయజ్ఞోపవీతా లుండేవి. గుప్తయుగ శిల్పా లలో పాదాలనంటే వస్త్రయజ్ఞోపవీతాలు స్పష్టంగా కన్పిస్తాయి. నేటికీ శూద్రులు సైతం పితృకార్యాలలో వస్త్రయజ్ఞోపవీతాన్ని ధరిస్తారు. క్రమంగా కక్ష్యాబంధంవలెనే యజ్ఞోపవీతం సయితం ఆభరణంగా మారిందనడానికి రఘువంశ కావ్యంలోని 'ముక్తాయజ్ఞోపవీత' పదమే నిదర్శనం. తుదకిది అగ్రవర్ణాలలో లాంఛనప్రాయమైన 'నూలుపోగు'గా మిగిలింది.

ఉష్ణీషము : హరప్పాయుగం నుండి భారతీయుల దుస్తులలో ఉష్ణీషం ప్రధానాంగమైనట్లు కన్పిస్తుంది. యజ్ఞసమయంలో యజమాని ఉష్ణీషం ధరించవలెనని శతపథబ్రాహ్మణం విధిస్తు న్నది. 'ఉష్ణం ఈషత్ హినస్తి ఇతి ఉష్ణీషం' అని నిఘంటువు. ఈమాటకు తెలుగే 'తలపాగ'. నిడుపైన చలవమడతతో తలపాగాను పలురకములుగా అందంగా చుట్టేవారు. పింఛంవలె కుచ్చును పైకివదిలే పద్ధతి హరప్పా ప్రజలదే. 'మణిముక్తకాంచన విచిత్రమౌలిబద్ధో' అనే జాతకవాక్యాన్ని బట్టి తలపాగకు మణులు, కాంచన ముత్యాలసరాలు ఉపయోగించి మనోహ రంగా చుట్టుకొనేవారని తెలుస్తుంది. తలపాగాలమీద పట్టుబంధాలు, వాటికి ఆధారంగా టోపీలు ధరించేవారు. 'కుళ్ళాయుంచితి కోక చుట్టితి' అని శ్రీనాథమహాకవి చెప్పుకున్నాడు గదా! హిందువులలో కులానికొక తీరైన తలపాగా రూపొందినట్లు నాగానందము మొదలైన గ్రంథాలద్వారా తెలుస్తున్నది.

నూలు, పట్టు, ఉన్ని వస్త్రాలు : సింధు వాగరికతా కాలంనుండి భారతీయులు నూలు, పట్టు, ఉన్ని వస్త్రాలు నేసి ధరించేవారు. నూలు వస్త్రాలకు ఎరుపు, పసుపు, నీలం రంగులు వేసేవారు. ఆంధ్ర స్త్రీలకు ఎర్రని చీరలు, నీలి కంచుళికలు అనిన మహాప్రీతి అని గాథాసప్తశతి చెబుతున్నది. అద్దకపుబట్టను ఆపస్తంబశ్రౌత సూత్రాలు 'చిత్రవస్త్రాల'ని వ్యవహరించింది. వీనికే కలంకారీచీరలని మరొక పేరు. ఆంధ్రదేశంలో కలంకారీ చీరలకు నిన్నమొన్నటి వరకూ మచిలీపట్టణం ప్రసిద్ధి వహించింది.

అనాదిగా మనదేశంలో పట్టుబట్టల కొక ప్రత్యేక గౌరవం ఉంది. యజ్ఞసమయంలో 'తార్ప్యవసనము' ధరించవలెనని బ్రాహ్మణాలు విధించినాయి. 'చీని చీనాంబరాలు' అనే పదాలవల్ల పట్టుబట్ట చైనా నుండి దిగుమతి అయినట్లు గ్రహిస్తున్నాయి. పట్టుబట్టల్లో జయరంజి, భావజతిలకము, వాయుమేఘము, ఉదయరాగము మొదలైన ఏబది రకాలను తెలుగు బసవపురాణం పేర్కొంటున్నది. నూలు, పట్టు వస్త్రాలకు తరచుగా వెండి, బంగారు జలతారు ఉపయోగించేవారు.

సిద్ధాంత కౌముదిలోని 'హైమనః ప్రావరః' అనే వాక్యాన్నిబట్టి శీతకాలంలో ఉన్నిదుస్తుల నెక్కువగా వాడేవారని తెలుస్తుంది.

సౌచిక వృత్తి: దుస్తులనుకుట్టి ధరించే ఆచారంకూడా సింధుకాలం నాటిదే. హరప్పా శిథిలాలలో సూదులు, కంచు, రాగి బొత్తాములు బయల్పడినాయి. 'సూచీవానకర్మ'ను

చతుష్షష్టికళలలో నొకటిగా వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. వైశ్యునకు శూద్రస్త్రీయందు జన్మించిన వానిది సౌచీవృత్తిగా ధర్మశాస్త్రాలు నిర్ణయించినాయి.

రజకవృత్తి: మలిన వస్త్రాలను శుభ్రపరచడానికై వైదికయుగంలోనే రజకవృత్తి యేర్పడినది వస్త్రాల రంగుని బట్టి వానిని శుభ్రంచేసే కాలపరిమితినీ, వస్త్రాల రంగు పోగొట్టితే రజకునికి విధింపదగిన అపరాధాన్ని కౌటిలీయార్థశాస్త్రం వివరిస్తున్నది. కౌటిల్యుని కాలానికే రజకులలో దుస్తులను అద్దెకిచ్చు దురాచారం ప్రబలినది.

## ముస్లిం సంప్రదాయాలు

మొహమ్మదీయుల రాకతో భారతీయ వస్త్రధారణలో పెక్కు మార్పులు ప్రవేశించినాయి. వస్త్రధారణలో సైతం హిందూ ముస్లిం సామరస్యానికి అక్బర్ చక్రవర్తియే ప్రయత్నించినాడు. 'బురఖా'కు 'చిత్రసుపిత' అనీ, 'కుళ్ళా'కు 'శిరశోభ' అనీ, ముస్సేలుకు 'పరిధారణ్' అనీ, అక్బర్ పేర్లు పెట్టినట్లు అబుల్ ఫజల్ వ్రాతలవల్ల తెలుస్తుంది. ఈ యుగంలో క్రమంగా 'చుడేదార్ పైజమా', 'చోగా' అనే అంగరఖా, నడుముకు 'పట్కా'గానీ కమరబంధంగానీ, రంగుల ఉష్ణీషము సర్వసాధారణమైనాయి. పట్కాలను అత్యంత రమణీయంగా తయారుచేసేవారు. పట్కా పరిశ్రమకు గోల్కొండ ప్రధాన కేంద్రమయింది. మొగలాయి యుగంలో ప్రపంచవస్త్ర పరిశ్రమకే ఇండియా కార్ఖానా అయింది. ఆంధ్ర దేశంలో ఆనాడు బురుసాలు, ముసజ్జీలు, బుర్నీసులు, కబాయిలు, బనాతులు, చారలు, అవురంగ జేబీలు మొదలైన దుస్తులు వాడేవారని హంసవింశతి కావ్యం పేర్కొంటున్నది.

తరువాతి కాలంలో ఆంగ్లేయులు దేశంలో ప్రవేశించి అచిర కాలానికే ప్రభువులైనారు. 'యథారాజా తథాప్రజా' అన్నట్లు భారతీయులు ఆంగ్లేయులను అనుకరించసాగినారు.

సాంప్రదాయ ప్రియత్వము: గ్రామసీమలోని రైతు, ఉపకారవేతనం పుచ్చుకొనే ప్రభుత్వోద్యోగి హరప్పానాటి ధోవతి ఉత్తరీయాలనే ఆశ్రయిస్తున్నారు. అదియే గాంధీయమైన వేషంగా ఆదరణీయమవుతున్నది. యుగ యుగాలుగా అవిచ్ఛిన్నంగావచ్చే సంప్రదాయాల పట్ల అభిమానమే భారతీయ సంస్కృతిలోని ప్రత్యేకత!



# 7. భారతదేశంలో కులవ్యవస్థ – పుట్టుపూర్వోత్తరాలు

మన సమాజాన్ని గురించిన అనేక అపోహలు, అనేక దురభిప్రాయాలు మనలో చాలమం దికి, విద్యావంతులకు కూడా, ఉన్నాయి. ఈ కుల వ్యవస్థను ఆర్యులు మనదేశంలోకి తీసికువచ్చారనీ, అనార్యులను తమకు బానిసలుగా చేసికోవటానికి ప్రయత్నించారనీ, ఆర్యులలోని పూజారులు ఆధిపత్యం వహించి కులవ్యవస్థకు దైవత్వం ఆపాదించి ప్రజల నోళ్లు మూసారనీ ఒక దురభిప్రాయం ఉంది. ఈ కులాలు వర్ణాలు ఎలా వచ్చాయి? వర్ణము కులము ఒకటి కాదు. జాతి అనే మాటకూడ ఉంది. జాతి కుల వర్ణ అనే మూడు మాటలను మనం సమానార్థకాలుగా వాడుతున్నాము. అది పొరపాటు.

## సమాజ పరిణామము – పని విభజన

ప్రతి నాగరికసమాజ పూర్వదశలోనూ మానవజాతి సంచారదశలో ఉండేది. ఆహార సంపాదన నిమిత్తం ఒక ప్రాంతం నుండి మరొకప్రాంతానికి సంచారం చేస్తూ ఉండేది. అటువంటి దశను విడిచిపెట్టి గ్రామాలలో నివాసాలు ఏర్పాటు చేసుకున్న తర్వాత ఆర్థిక వ్యవస్థ కొంత క్లిష్ట రూపాన్ని ధరించింది. వ్యవసాయము, వ్యవసాయంతోపాటు కుమ్మరము, కమ్మరము - వడ్రంగము మున్నగు అనేక వృత్తులు వచ్చాయి. దీనితో సమాజంలో వృత్తి విభజన జరగటం సర్వసాధారణమైన పరిణామము. అది ప్రతి నాగరిక సమాజంలోనూ జరుగుతుంది. ఈజిప్టులో అలాగే జరిగింది. చాల పురాతనమైన నాగరికత ఉన్న గ్రీసులోనూ అలాగే జరిగింది. చైనాలో అలాగే జరిగింది. వృత్తిని బట్టి సమాజ విభజన జరుగుతుంది అది వృత్తి విభజన. అప్పుడు కులాలు - వర్ణాలు అన్న ప్రసక్తి లేదు.

మానవునికి రెండు లక్షణాలు ఉన్నాయి. ఒకటి భయం, రెండవది ఆశ. ఈరెండు మానసిక అవస్థలవల్ల 'మతం' అనేది పుట్టుకొని వచ్చింది. మతం ఎప్పుడైతే వచ్చిందో పూజారి వర్గం పుట్టుకొని వస్తుంది. ఈ పూజారి మానవునిలోని ఆరెండు మానసిక బలహీనతలను అవకాశంగా తీసికొని మనుషులను దోచుకుంటూ ఉంటాడు. ఇది ప్రతి సమాజంలోనూ ఉండేదే; మన భారతీయ సమాజానికి ప్రత్యేకించినటువంటి లక్షణం కాదు.

## భారతీయ ప్రాచీన నాగరికత – హరప్పా

అతి ప్రాచీనమైన నాగరికత భారతదేశంలో ఉంది. అదే సింధు నాగరికత. దానిని 'హరప్పా సంస్కృతి' అంటాం. ఈ హరప్పా సంస్కృతిలోనే వృత్తిపరమైన సాంఘిక విభజన కన్పి స్తుంది. అక్కడే పూజారి వర్గం కూడా ఉంది. తరువాత ఆర్యులు మనదేశానికి వచ్చారు. వారు ఒక్కసారిగా రాలేదనీ, ఒక తరంగం తర్వాత ఇంకొక తరంగంలా వచ్చారనీ ఇటీవలి

చరిత్రకారుల అభిప్రాయం. ఆర్యులు అప్పుడు సంచార జీవనులు. ఆల్చిన్ దంపతులు గొప్ప పురాతత్త్వవేత్తలు. వారు తమ 'భారతీయ నాగరికత ఆవిర్భావం' (The birth of Indian Civilization) అనే పుస్తకంలో ఆర్యులను "గుర్రాలపై స్వారీ చేస్తూ వచ్చిన ఇండో యూరోపియను బర్బరులు" (Horse riding Indo-European Barbarians) అన్నారు. ఆర్యులు అనేమాట చాల గంభీరంగా, చాల గొప్ప నాగరికత ఉన్నవారు అనే అభిప్రాయం మన మనస్సులో పడిపోయింది. కానీ ఆ పురాతత్త్వవేత్తలు 'చాల అనాగరికదశలో సంచార దశలో ఉన్నటువంటివారు' అన్నారు.

గ్రీసు చరిత్రలో ఒక సంఘటన ఉంది. రోమనులకంటే గ్రీకులది గొప్ప నాగరికత; ఉదాత్తమయిన నాగరికత. రోమనులు గ్రీకులను జయించారు. విజితులైన గ్రీకుల నాగరికతా సంస్కృతులు విజేతలయిన రోమనులను జయించాయి. అదేవిధంగా విజేతలయిన ఆర్యులను హరప్పా సంస్కృతి జయించింది. సంచారదశలో ఉన్న ఆర్యులలో నిర్దుష్టమైన, నిర్దిష్టమైన సంస్థలు ఏర్పడే అవకాశం లేదు. అదేవిధంగా పూజారివర్గం కూడా ఆర్యులలో లేదు. పూజారులు అనేవారు మొట్టమొదటి ఆర్యులలో లేరు. కానీ వాళ్లు యజ్ఞం చేసేవారు. మొదటి ఆర్యులలో కులవ్యవస్థ లేదు అని చెప్పటానికి ఒక వాక్యాన్ని ఉదహరిస్తారు. ఒక వ్యక్తి ఇలా చెబుతాడు "నేను కవిని; నా తండ్రి వైద్యుడు; నా తల్లి ధాన్యం దంచుతుంది. డబ్బుకోసమని మా కుటుంబంలోని సభ్యులు వేర్వేరు వృత్తులు అనుసరిస్తున్నాము". అతడు తాను కవిని అని చెప్పాడుకాని పురోహితుణ్ణి అని చెప్పలేదు. ప్రార్థనా శ్లోకాలు వ్రాసి, కవిత్వం వ్రాసి అమ్ముకుని జీవించేవాడు.

## హరప్పా నాగరికత - పూజారివర్గం

ఆంధ్రా యూనివర్సిటీలో గొప్ప సంస్కృత అధ్యాపకులు కన్హన్ రాజా ఉండేవారు. ఆయన 'ద వేదా' (The Veda) అనే పుస్తకం వ్రాసారు. అందులో "మొదట వచ్చిన ఆర్యులలో పూజారులు లేరు; హరప్పా ప్రజలలో పూజారులు ఉన్నారు" అని వ్రాసారు. అసలు హరప్పా ప్రజలను పూజారివర్గమే - పురోహిత పెత్తందారీ వర్గమే పరిపాలిస్తూ ఉండేది. ఇక్కడ పూజారి వర్గం ఉండేది అని చెప్పటానికి పురావస్తు విశేషంగా ఒక సాక్ష్యం లభించింది. ఒక బొమ్మ దొరికింది. ఆ బొమ్మకు మీసాలు లేవు. తలమీద జుట్టులేదు. గడ్డం పెరిగి ఉంది. ఇటీవల హిందూ ధర్మంలో కూడా ఏదైనా మతకార్యం చేసేటప్పుడు 'కేశ శ్మశ్రువాపయిత్వా' అని ఉంది. తలవెంట్రుకలు, మీసాలు తీసివేయాలి. ఈ సంప్రదాయాన్ని హరప్పా ప్రజలనుండి ఆర్యులు అవలంబించారు. ఆ బొమ్మలో మరొక విశేషముంది. అతడు ఒక ఉత్తరీయం (upper cloth) వేసుకుని ఉంటాడు. ఆ ఉత్తరీయం జంధ్యం ఉన్న స్థానంలో ఉంటుంది. దానిమీద కళావరు ముక్కలు (గుర్తులు) ఉంటాయి. యజ్ఞోపవీతానికి మూడుముళ్లు ఉంటాయి. ఆకళావరు ముక్కలకు ఇవి చిహ్నాలు. అతడు 'పక్కా' (అంటే పదహారణాల) పురోహితుడు. ప్రామాణికమైన చరిత్ర పుస్తకాలన్నిటిలో ఈ బొమ్మ కనిపిస్తుంది. ఈ పూజారి వ్యవస్థను ఆర్యులు హరప్పా ప్రజలనుండి తీసికొని పెంపొందించారు.

## విశ్వామిత్రుడు – వశిష్ఠుడు

మన చరిత్రలో మొట్టమొదటి పూజారి వశిష్ఠుడు కాదు, విశ్వామిత్రుడు. అసలు విశ్వామిత్రుడు ఒక బ్రాహ్మణుడు. అతి ప్రాచీన వైదిక కాలంలో సుదాసుడు అనేవాడు పదిమంది రాజకూటమిని ఓడిస్తాడు. 'దాశరాజ యుద్ధము' అని చాలా ప్రాచీనకాలంలో జరిగిన యుద్ధము. అతని పూజారి విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు ఆర్యుడు కాదు అసురుడు. అసురుడంటే రాక్షసుడు కాదు, అస్సీరియన్ జాతివాడు. బెనారస్ హిందూ యూనివర్సిటీలోని సంస్కృత అధ్యాపకులు బెనర్జీశాస్త్రి 'అసుర-ఇండియా' అనే పుస్తకం వ్రాసారు. ఆ పుస్తకంలో విశ్వామిత్రుడు మొదలైనవారు అస్సీరియన్స్ - అసురులు అని వ్రాసారు. విశ్వామిత్రుడు ఆర్యుడు కాదు, క్షత్రియుడు కాదు, మనదేశంలో తెలిసినటువంటి మొట్టమొదటి పూజారి. వశిష్ఠుడు తర్వాత వస్తాడు. సుదాసుడే విశ్వామిత్రుణ్ణి తొలగిస్తాడు. బహుశా విశ్వామిత్రుడు అహంతో వ్యవహరించి ఉంటాడు. దానికికూడా ఆర్థిక రాజకీయ కారణం ఉంది. ఆనాటి వరకూ పూజారులు హరప్పా సంస్కృతిలో పరిపాలకులుగా ఉండేవారు. బహుశః అదే సాంప్రదాయంతో విశ్వామిత్రుడు 'నేను పెద్ద అధికారిని' అని వాదించి ఉంటాడు. రాజుకు పురోహితునికి మధ్య సంఘర్షణ - వైరుధ్యం (The conflict between the Prince & The Priest) జరిగినట్లు తెలుస్తోంది. అది వేరకాలంలోనే (సుదాసుని కాలంలోనే) ప్రారంభమయింది. అహంకారంగా ప్రవర్తించటంవల్ల, అధికారం అడగటం వలన విశ్వామిత్రుణ్ణి తొలగించి వశిష్ఠుణ్ణి పూజారిగా చేసుకొని వుంటాడు. అదే విశ్వామిత్ర - వశిష్ఠుల మధ్య కలహానికి కారణం. రెండు పురోహిత వర్గాల మధ్య సంఘర్షణ (A Conflict between two priestly classes). అంతేకాని విశ్వామిత్రుడు మొదట క్షత్రియుడై వశిష్ఠుడు బ్రాహ్మణుడై - అది బ్రాహ్మణ క్షత్రియ పోరాటం కాదు.

వశిష్ఠుడు ఆర్యుడు కాదు. కనీసం విశ్వామిత్రుడు అసురుడు అని తెలుస్తోంది. వశిష్ఠుని పుట్టుక సంగతి తెలియదు. వశిష్ఠుని పుట్టుకని గురించి రెండు సాంప్రదాయాలు ఉన్నాయి. ఒకటి: అతడు ఊర్వశి కుమారుడు, తండ్రి తెలియదు. రెండు: అతనికి ఇద్దరు తండ్రులు - మిత్ర, వరుణ అనేవారు; కానీ తల్లి తెలియదు. మిత్ర-వరుణు లిద్దరూ అసురులు; తరువాత వైదిక దేవతలు అయినారు.

ఈవిధంగా మనదేశంలో పూజారి వ్యవస్థ, ఒకరకంగా బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలు లేక కులాలు ఏర్పడినాయి. ఇది వైదిక యుగంలో జరిగిన పరిణామం. 'కేశి' 'ముని' అనే అనార్య పూజారులను గురించి 'అధర్వవేదం' చెబుతోంది. వారిని 'వ్రాత్య' అనేవారు. పంచవింశ బ్రాహ్మణంలో 'వ్రాత్యస్తోమ' అనే హోమం ఉంది. వ్రాత్యులైన వారిని - అనార్యులైనవారిని ఆ హోమంతో పవిత్రం చేసి ఆర్యులలో కలుపుకునేవారు.

## ఋగ్వేదం – ఇతర వైదిక వాఙ్మయం

'భారతీయ నాగరికత ఆవిర్భావం' అనే పుస్తకంలో ఆల్చిన్ దంపతులు శతాబ్దాల తరబడి ఆర్యుల అనార్యుల మధ్య సహకార ఫలితంగా ఋగ్వేదం తయారయిందని వ్రాసారు. వైదిక వాఙ్మయం అంతా అలాగే తయారయింది. ఆర్య అనార్యుల సహకార కృషివలన, భావాలు - సిద్ధాంతాలు మార్చుకోవటంవలన వైదిక వాఙ్మయం ఏర్పడింది. దీనికి ఉదాహరణ: వైదిక

వాఙ్మయం సంకలనం చేసినవాడు వ్యాసుడు. వ్యాసుని తండ్రి ఆర్యుడు; తల్లి కైవర్త, అంటే బెస్తస్త్రీ. ఆర్య అనార్య సంపర్కంవలన, వాళ్ల సహకారంతో వైదిక వాఙ్మయం అంతా రూపొందినదని చెప్పటానికి యిది సూచిక.

## ఆర్య-అనార్య మిశ్రమం

హరప్పా సమాజంలో పూజారులు ఉండేవారు. వర్తకులు రైతులు - ఈ వర్గాలు కూడా ఉండేవి. అప్పుడు ఉన్నటువంటివి కులాలు అని కొందరంటున్నారు. మరికొందరు కులాలు కావు, వర్గాలంటున్నారు. ఈ వర్గాల పుట్టుక హరప్పా సంస్కృతిలో జరిగిందని ఒక సిద్ధాంతం. కాదు ఇవి కులాలకు మూలమైనాయని మరొక సిద్ధాంతం. చాల తర్జన భర్జనలు జరుగుతున్నాయి. చరిత్రకారులు, సామాజిక శాస్త్రవేత్తలు, ఆంత్రొపాలజిస్టులు ఒక నిర్ణయానికి రాలేకుండా ఉన్నారు. ఏది ఏమైనప్పటికీ సాంఘిక సామాజిక విభజన హరప్పా కాలంలో కన్పిస్తుంది. చివరకు బానిసలుకూడా హరప్పా ప్రజలలో ఉండేవారు. దానికి ఒక పురావస్తు సాక్ష్యం లభిస్తోంది. మొహంజోదారోలో రెండే గదులున్న చాలా చిన్న చిన్న ఇళ్లు ఉన్నాయి. ఆ గదుల ప్రక్కన ధాన్యాన్ని పిండిగా (ఆరోజుల్లో దంచటం తెలియదు; గానుగ ఆడేవారు) చేసే సాధనం ఉంది. ఇందులో నివసించే వారు బానిసలని ఈ పట్టణాలకు ధాన్యాన్ని పిండిగా చేసి సరఫరా చేస్తుండేవారని రొమిల్లాథాపర్ అనే చరిత్రకారిణి సిద్ధాంతం. అంటరానితనంకూడా అప్పుడే ప్రారంభమైందని వారి సిద్ధాంతం. ఈ వృత్తిపరమైన విభజనకు ఆర్యులు 'వర్ణ' అనే భావాన్ని కల్పించారు. ఆర్యులలో వర్ణభావన ఎక్కువ. ఎందుకంటే ఆర్యులు తెల్లగా ఉండేవారు. స్థానికులు నల్లగా ఉండేవారు. వీరిని వర్ణించేటప్పుడు 'కృష్ణవర్ణ' 'కృష్ణత్వచః' 'దాసవర్ణ' అని అనేవారు. అంటే వాళ్ల వర్ణానికి భిన్నమైన వర్ణంలో ఉండేటటువంటివారని అర్థం. అయితే వీరందరూ తొలివేదయుగంలో కలిసిపోయారు. సుదాసుని తండ్రిపేరు దివోదాసుడు. ఆ పేర్లలోని 'దాస'పదం ఆర్య-దాస సాంకర్యానికి నిదర్శనం. ఆదిమ వైదిక యుగంలోనే దాస-ఆర్య జాతి సాంకర్యం జరిగింది. అవి వర్ణాలు కావు; జాతులు, తెగలు. తెగల సాంకర్యం జరిగింది.

ఆర్యులలో మొట్టమొదట మూడే వర్ణాలు ఉండేవి: బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య. వైశ్యులే సమాజంలో అన్ని పనులు - వ్యవసాయం, వాణిజ్యం, వండ్రగము మున్నగు వృత్తులు చేసేవారు. 'విశ్' అనే మాటకు అసలు అర్థం 'ప్రజ' అని. క్షత్రియులు, బ్రాహ్మణులు, పూజారులు కానివారంతా మిగిలిన ప్రజ. విశ్-వైశ్య అనేమాటకు ప్రత్యేక అర్థం లేదు, వారు ప్రజలు.

బ్రహ్మావర్తం అంటే ఆర్యులు వచ్చి మొట్టమొదట నివసించినచోటు. పంజాబు, వాయువ్య సరిహద్దు రాష్ట్రాల ప్రాంతము. అక్కడినుండి క్రమంగా వారు గంగామైదానంలోకి విస్తరించారు. ఇది క్రీ.పూ. 800ల ప్రాంతంలో (1000-800 బి.సి) జరిగింది. ఆర్యులు విస్తరించటం వలన ఆకాలంలో ఆర్థికంగా కొంత క్లిష్టత ఏర్పడింది; వ్యవసాయం పెరిగింది; అనేక వృత్తులు వచ్చాయి. అప్పుడు 'శూద్ర'వర్ణం ఏర్పడింది. శూద్రులుకూడా ఆర్యులే!

శూద్రులు అంటే బానిసలు కారు; ఒకరకంగా చూస్తే అనార్యులు కారు. శూద్రపదం ఒక జాతిపరమైన పదం. అలాగా వచ్చిన ఆర్యులలో మొట్టమొదట వచ్చిన ఆర్యులే శూద్రులు - అని ఒక సిద్ధాంతం. అంటే మొదట వచ్చిన ఆర్య జాతిపేరు శూద్రులు.

'భోజ', 'కుకుర', 'అంధక' 'వృశ్మే' 'భరత' - ఆర్యులలో తెగలు. అదేవిధంగా శూద్ర అనేది ఒక ఆర్యతెగ (జాతి) పేరు. వారు సరస్వతినది ఒడ్డున ఉండేవారు. ఆ నది ఇప్పుడు లేదు - ఇంకిపోయింది. రాజస్థాన్ మధ్యభారత్ ప్రాంతాలలో ఉండేది. ఆ తెగఅంతా తరువాతి ఆర్యజాతులతో కలిసి శూద్రవర్ణంగా 'పురుషసూక్తం'లో ప్రవేశించి ఋగ్వేదంలోకి ఎక్కారు. పశుసంపద ఉన్న శూద్రులు ఉన్నారు; భూస్వాములయిన శూద్రులు ఉన్నారు; భిన్న చేతివృత్తులు అవలంబించిన శూద్రులు ఉన్నారు. శూద్రులను పై మూడు వర్ణాలకు కేవలం సేవచేస్తూ ఉండమని బ్రహ్మ సృష్టించిన వర్ణం కాదు.

## బౌద్ధమతం నిర్వహించిన పాత్ర

క్రీస్తుపూర్వం 6వ శతాబ్దంలో బౌద్ధమతం వచ్చింది. ఆర్య అనార్య జాతి సమ్మేళనానికి బౌద్ధమతం చాల ఉపకరించింది. సంస్కృత భాషాసంస్కృతి విస్తరించటానికి ఉపకరించింది. బౌద్ధమతం ప్రబలంగా ఉన్నంతకాలమూ ప్రజలలో కులాలను గురించిన బలమైన అభిప్రాయాలు ఉండేవికావు. మన ఆంధ్రుల చరిత్ర నుండి ఒక చిన్న ఉదాహరణ : అమరావతి, నాగార్జునకొండ చాలా ప్రాచీన బౌద్ధక్షేత్రాలు. అమరావతిలో 150 శాసనాలు, నాగార్జునకొండలో 70-80 శాసనాలు దొరికినాయి. ఈ శాసనాలలో కులాల గురించిన ప్రసక్తి లేదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రపదాలు ఆ శాసనాలలో కనపడవు. ఈ క్షేత్రాలకు చాలమంది దానధర్మాలు చేసారు. వాటిలో వృత్తిపరమైన పేర్లు ఉన్నాయి. 'గతిక' అంటే 'గంధకార' అనే పేరు ఉంది. అలాగే శిల్పుల పేర్లున్నాయి. వడ్రంగుల పేర్లున్నాయి. వణిజ అనే పదం ఉంది. వణిజుడు అంటే - బ్రాహ్మణుడు వణిజుడు కావచ్చు; క్షత్రియుడు, శూద్రుడు ఎవరైనా వణిజుడు కావచ్చు. ఇది క్రీస్తుశకం 3వ శతాబ్దం విషయం. అంటే క్రీస్తుశకం 3వ శతాబ్దం వరకు ప్రజలలో కులచైతన్యం లేదు.

ఆరోజులలో అస్పృశ్యత ఉన్నదా? లేదా? అని అనుమానం. ఎందుచేతనంటే అమరావతి శాసనం ఒకదాంట్లో 'విధిక' అనే చర్మకారుడు - నేను 'చర్మకారుణ్ణి' అని చెప్పుకున్నాడు కానీ 'పంచముణ్ణి' అని చెప్పుకోలేదు. పంచమ అనే మాటకు చాల అర్థాలు చెప్తారు. పంచమజనః అంటే 'నిషాదుడు' అని ఒక గ్రంథం చెప్పింది. ఒక బ్రాహ్మణునికి శూద్రస్త్రీకి జన్మించిన వాడు 'నిషాదుడు' అని చెప్పారు. అంతేకాని పంచమ జనః అంటే వారు చెప్పుకునే 'మాల, మాదిగ' వర్ణాలు కావు. ఈ విధిక అనే చర్మకారుడి తండ్రి 'నాగ ఉపాధ్యాయ'. విధిక అనేది సంస్కృత పదం. నాగ అనేది సంస్కృత పదం. చర్మకారులు కూడా సంస్కృతం పేర్లు పెట్టుకున్నారు; బౌద్ధ స్తూపానికి వెళ్లి దానం చేసారు. భార్యాబిడ్డలతో కలిసి వెళ్లేవారు. కాబట్టి క్రీస్తుశకం 300 వరకు మనదేశంలో, ఆంధ్రదేశంలో కూడా, కులచైతన్యం అనేది లేదు. ఎలాగయితే వైదిక సమాజంలో ఆర్య అనార్య జాతుల సమ్మేళనం జరిగిందో క్రీస్తు తర్వాత 3వ శతాబ్దంలో కూడా జాతిసాంకర్యం జరిగింది.

## ఆంధ్రుల చరిత్రలో

మనకు బాగా పరిచయమున్న దక్షిణదేశ చరిత్ర - అందునా ఆంధ్రదేశ చరిత్ర కొంచెం విపులంగా చూద్దాం. భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ స్థానిక వైరుధ్యాలు తప్ప ఆంధ్రదేశంలో జరిగినట్లే జరిగింది. మన రాజులు చాలమంది యజ్ఞయాగాది క్రతువులు

చేసేవారు. మొదటి శాతవాహన చక్రవర్తి, శాతకర్ణి, చాలా యజ్ఞాలు చేసాడు. రెండు అశ్వమేథాలు చేసాడు. ఇంకా చాలా చాలా చేసాడు. అతని తరువాత దక్కనులో రాజ్యానికి వచ్చిన వాకాటక వంశంలో ప్రవరసేనుడు చాలా యజ్ఞాలు చేసాడు. విష్ణుకుండినులలో మాధవవర్మ 'ఏకాదశాశ్వమేథ' పదకొండు అశ్వమేథాలు చేసాడట; 'క్రతు సహస్రయాజి' వేయి యజ్ఞాలు చేసాడు. వీళ్లకు ఇంత తాపత్రయం ఎందుచేతనంటే వీళ్లు స్వతహాగా వైదిక మతస్థులు కారు. 'బ్రహ్మ క్షత్ర తేజో భృతాం' ''మాలో ఇటు బ్రాహ్మణుల తేజస్సు - ఇటు క్షత్రియుల తేజస్సు ఉంది. ఈ యజ్ఞయాగాది క్రతువులు చేయటం వలన పరమేష్ఠిత్వాన్ని సాధించాను, బ్రాహ్మత్వాన్ని సాధించాను'' అని వారే చెప్పుకున్నారు. వీళ్లు క్రొత్తగా బ్రాహ్మణ మతం పుచ్చుకున్నారు. బ్రాహ్మణమతంలో తమకు శ్రద్ధ ఉన్నదని వ్యక్తం చేయటానికి ఇన్ని యజ్ఞయాగాదులు చేసారు.

క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దం వరకూ ఇక్కడ ఉండే పుళిందులు, బోయలు మొదలైన ఆటవిక జాతులవారంతా (ఎబోరిజినల్స్) బ్రాహ్మణకులం నుండి శూద్రకులం వరకూ అన్ని కులాల్లోనూ చేరిపోయారు. ఒక ధర్మశాస్త్రంలో పుళిందులను (పుల్కస, పుళింద, ఛండాల) ఛండాలురతో సమానులు అని చెప్పారు. తెలంగాణా కరీంనగర్ జిల్లా మాటేడు గ్రామంలో 11వ శతాబ్దం నాటి ఒక శాసనం దొరికింది. అందులో 'వేమబోల' అనే పుళిందుడు ''నాది పుళింద కులము' అని చెప్పుకున్నాడు. పుళింద అనేది ఒక 'తెగ'. ఆ తెగ ఒక 'కులం' అయింది. వాడు 'నాది పుళిందకులము' అని ఊరుకోలేదు; ''బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులాలను రక్షించటానికి మా కులాన్ని బ్రహ్మదేవుడు పుట్టించాడు'' అన్నాడు. అదేవిధంగా బోయలు. నెల్లూరు జిల్లాలో ఉండేవారు. నెల్లూరు ఒంగోలు జిల్లాలలో శాసనాలు దొరికాయి (క్రీ.శ. 8వ శతాబ్దం నాటి సంగతి). బోయలు చాలమంది అన్ని కులాల్లోను చేరారు. ఋషిగోత్రాలు పెట్టుకుని బ్రాహ్మణులలో చేరారు. బోయలలో కూడా వృత్తివిభజన ఉండేది. 'ఆలబోయ' అంటే ఆవులను కాచుకునేవాడు. 'మందుబోయ' అంటే వైద్యుడు. 'కోయిలబోయ' అంటే గుళ్లో పురోహితుడు. ఈ గుళ్లో పురోహితుని మొదటి కొడుకు 'బోయ' అనేపేరు పెట్టుకున్నాడు; రెండవవాడు 'రెడ్డి', మూడువవాడు 'నాయుడు', నాలుగవవాడు 'నాయక' అని పేర్లు పెట్టుకున్నారు. 'బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయ శాసనాలు' అని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు ప్రచురించారు. వాటిని పరిశీలించవచ్చు. ఈ విధంగా బోయజాతివారు అన్ని వర్ణాలలోనూ చేరిపోయారు.

కాకతీయులు చాల గొప్పరాజులు అని చెప్పుకుంటాము. వీరు మొట్టమొదట పుళిందులు. వీరి మొదటి రాజుల పేర్లు - ఇరియ, వెన్న, గుండయ, ప్రోలయ. ఇవేవీ సంస్కృతం పేర్లు కావు. బోయలలోనూ, పుళిందులలోను కనిపించే పేర్లు. రుద్రదేవుడి దగ్గరనుండి వీళ్లు బ్రాహ్మణమతం స్వీకరించారు. అక్కడి నుండి సంస్కృతం పేర్లు కనిపిస్తాయి. గణపతి దేవుడు జాయపసేనాని చెల్లెళ్లను పెండ్లాడాడు. జాయపసేనాని దివిసీమను పాలించే బోయ రాజు.

కులవ్యవస్థ ప్రవాదులకు వెళ్లి చూస్తే కులాల పట్టింపులు అర్థంలేని విషయం. ప్రజలు సక్రమ మార్గంలో జ్ఞానవంతులు కావాలి; అపోహలు, దురభిప్రాయలు తొలగిపోవాలి.



# 8. ద్రావిడ నాగరికతా విస్తరణ

ప్రాచీన భారతదేశ చరిత్రలో అనేక సమస్యలకు ఇదమిత్థమైన పరిష్కారాలు లేవు. ఆర్య ద్రావిడ జాతుల ఆదిమనివాసములు, వారిమధ్య పరస్పర సంబంధాల స్వభావము మున్నగు అంశాలకు చెందిన సమస్య చాల ప్రధానమయింది. ప్రస్తుతం ఔత్తరాహులలో అధిక సంఖ్యాకులు ఆర్యజాతీయులనీ, దాక్షిణాత్యులలో వెక్కువభాగం ద్రావిడులనీ సాధారణ విశ్వాసం. ఆర్యులు, ద్రావిడులు వేరువేరు జాతులవారు కాదనీ, ఈ భిన్నత్వం బ్రిటీషు సామ్రాజ్యవాదుల కల్పన మాత్రమేననీ వాదించేవారు సైతం లేకపోలేదు. కాని ఋగ్వేదములో కన్పించే అనాసః, కృష్ణవర్ణః, మృధ్రవచః, అవ్రతః అనే వర్ణనలను బట్టి వైదికార్యుల విరోధులు అన్యమతానుయాయులేగాక అన్యజాతీయులు కూడా అను నిర్ణయానికిరాక తప్పదు. కొన్ని ఋక్కులలో ఇంద్రుని ఉచ్చైశ్శ్రవ హేషకు, పరుషుట్టన స్వనానికి భయభ్రాంతులై యుద్ధభూమి నుండి ఇంద్రవిరోధులు దౌడుతీసినట్లు ఉంది. అనగా వీరికి ఆర్యయుద్ధ తంత్రముతో సైతము ముఖ్యంగా అశ్వదళంతో పరిచయంలేనట్లు స్పష్టమవుతున్నది. అందుచేత ఆర్యవాఙ్మయంలో ఆర్యద్రావిడ విభేదాల ప్రసక్తిలేదనడంగానీ, ఉభయులు ఏకజాతీయులేననడంగానీ యుక్తంకాదు. మానవజాతి అంతా ఒకటేననడం సత్యమే; కానీ అందుప్రాంతీయ విభేదము లున్న వనడం కూడ పరమసత్యము. ఈ విభేదాలకు కారణాలను, వాని కృత్రిమత్వాన్ని మానవ జాతిచే గుర్తింపజేయడమే పరిశోధకుల కర్తవ్యంగాని, భిన్నత్వమే లేదనడం యుక్తం కాదు. తాత్కాలికమైన ప్రయోజనాలకై చారిత్రక సత్యములను మభ్యపరచడంవల్ల భావితరాలలో మరింత విపత్కరపరిణామాలను ఎదుర్కొనవలసి వస్తుంది.

## ద్రావిడ సంస్కృతీ సామ్రాజ్యము

ఆర్య దండయాత్రలవలన ఉత్తరాపథమునుండి దక్షిణాపథానికి వలసపోయి, స్థానికులను జయించి, ఆర్యేతరులచట స్థిరనివాసము లేర్పరచుకొన్నారు. వీరినే స్థూలముగ ద్రావిడులని వ్యవహరింతుము. ఈ ద్రావిడ జాతులొకప్పుడు గంగాతీర మైదానము మొదలు మధ్యధరా సముద్ర ప్రాంతాలవరకు విస్తరించి, ఈజిప్టు, క్రీట్, మైసీన్ (గ్రీస్), సుమేరియా, సింధునాగరికతలను నిర్మించినట్లు షోయెనర్, విల్ ఫీల్డ్, హీరాస్ మున్నగు పండితులు పరిశోధించినారు. మధ్యధరా సముద్రప్రాంత భూములలో వెక్కువగా వీరి నాగరికతా కేంద్రాలు కన్పించినందున వీరిని మధ్యధరా జాతులనియు వ్యవహరిస్తారు. వీరిలో అనేక శాఖోపశాఖలున్నాయి. భారతదేశములోని ద్రావిడులొక శాఖ. ద్రావిడులలోనే అనేక శాఖలున్నట్లు తెలుస్తున్నది. మన పురాణములలో కన్పించే నాగ, యక్ష, రాక్షస, వానరజాతులు ద్రావిడశాఖలేనని కొందరి యభిప్రాయము. ఈ భారతీయ ద్రావిడశాఖలకు, మధ్యాసియా ప్రాంతశాఖలకు మధ్య ప్రాచీనకాలంలో సన్నిహిత సంబంధములున్నవనటానికి పెక్కు నిదర్శనాలు లభిస్తున్నాయి. జాతుల పేర్లలో సామ్యములున్నవి. స్వభావములో పోలికలు, భాషలోను, మత-సాంఘిక ఆచార వ్యవహారములలోను సాన్నిహిత్యము స్పష్టంగా కన్పిస్తున్నది. ఈ వివరాలన్నింటిని సమన్వయం చేసినచో ఒకానొకప్పుడీజాతులు గ్రీస్ (మైసీన్) మొదలు సింధూ గంగానదుల వరకు విస్తరించి ఒక సాంస్కృతిక మహాసామ్రాజ్యము నిర్మించిరనడం నిర్వివాదాంశము.

## నామసామ్యము :

**ఫణిజాతి :** వైదిక వాఙ్మయంలో దానదస్యులతోపాటు పెక్కు ఆర్యేతర **జాతులపేర్లు** కన్పిస్తాయి. ఋగ్వేదమున 'ఫణి' జాతిప్రసక్తి ఎక్కువగా విన్పిస్తుంది. వీరిది **వాణిజ్యవృత్తి.** యాస్కుని నిరుక్తముప్రకారము "ఫణిర్వణిగ్భవతి". అంతేకాక దుర్గాలు, పురాలు **నిర్మించ** డంలో సిద్ధహస్తులనియు, వడ్డీవ్యాపారములో ఆరితేరిన వారనియు ఋగ్వేదము **నుండియే** తెలుస్తున్నది. మొహంజోదారో - హరప్పా ప్రజలలో అధికభాగము ఫణిజాతివారేనని కొందరి మతము. ఆ మహానగరాల ఐశ్వర్యానికి వాణిజ్యమే మూలమని అందరూ అంగీకరించిన విషయమే. సింధుప్రజల నిర్మాణ కౌశల్యానికి సైతము ఆ నగరములే నిదర్శనములు. ఈ ఫణిజాతికిని, ఆసియామైనర్‌లోని ఫినీషియనులకును పోలికలున్నవి. ఫినీషియనులే ఉత్తరాఫ్రి కాలో కార్థేజినగర రాజ్యాన్ని నిర్మించి మధ్యధరాసముద్రంపై చిరకాలం పెత్తనం వహించి, చివరకు రోమనులచే పరాజయం పొందినారు.

సంస్కృతభాషలో ఫణి-నాగశబ్దములు సమానార్థకములు. అందుచే ఫణిజాతియే క్రమ ముగా నాగజాతిగా పౌరాణిక వాఙ్మయములోనికి దిగుమతి అయిందని భావింపవచ్చును. నాగజాతికి, ఆర్యవిజేతలకు జరిగిన సంఘర్షణలోని ముఖ్యఘట్టములే అర్జునుడొనర్చిన ఖాండవదహనము, పరీక్షిత్తుచేసిన సర్పయాగము. ఈ సంఘటనల అనంతరమే ఫణి లేక నాగజాతి వారు దక్షిణాపథమునకు వలసవెళ్ళి తూర్పుతీరంలోను-నేటి ద్రావిడదేశంలోను స్థిరపడినారు. ఆంధ్రదేశంలో కృష్ణానదీ ముఖద్వారాన్ని నాగదేశంగా విదేశీయులు వర్ణించి నారు. దాక్షిణాత్యంలో ప్రాచీన కాలమునుండి కన్పించే వాస్తు విద్యానైపుణ్యము, విదేశవాణి జ్యము, నౌకాయాన కౌశల్యము ఫణిజాతి వారసత్వముగా పరిగణించవచ్చును. నాగార్జునుని కాలమున నాగులు ప్రశస్త శిల్పసంశోభితాలైన స్థూపాదుల నిర్మాణంలో మంచి కౌశల్యము ప్రదర్శించినారని బౌద్ధవాఙ్మయము నుండి తెలుస్తున్నది.

**పౌలస్త్యులు :** ఆసియామైనరులోని ఫినీషియనులకు సన్నిహితులే ఫెలాస్టీయన్లు. వీరు సైతము నౌకాయానంలో ఘటికులే. మధ్యధరాసముద్రం గుండా అట్లాంటిక్ మహాసముద్రమున ప్రవేశించి క్రీ.పూ. 1500 ప్రాంతముననే పశ్చిమాఫ్రికా తీరమును ఫెలాస్టీయనులే పరిశోధించి నారట. వీరితో మనపురాణములలోని పౌలస్త్యులను పోల్చవచ్చును. ఆర్యులకూ పౌలస్త్యులకూ జరిగిన సంఘర్షణయే రామాయణ కథావస్తువు. రావణుడు పౌలస్త్యుడు. అతని లంకారాజ్యము సముద్ర సామ్రాజ్యం. లంకనుండి జనస్థానమునకు తరచుగా పౌలస్త్యులు జరిపిన రాకపోకలే వారి నౌకాయాన కౌశల్యానికి నిదర్శనములు.

**అనుజాతి :** ఋగ్వేదమునందు, పురాణములలోను అనుజాతి పేర్కొనబడినది. పురాణ ములు వీరిని మ్లేచ్ఛులుగా వర్ణించినవి. 'అన్' అనే పేరున్నదేవత నారాధించినందున వీరికా పేరువచ్చినట్లు చెప్పినారు. పారశీకదేశంలో వీరినే "అనార్య్య"లని వ్యవహరించినారు. బైబిలు గ్రంథములో సైతం వీరి ప్రసక్తియున్నది (Genesis ch x. verse 13). ఈజిప్టులోని 'అనుమిమలు' వీరు ఒక్కరేనని పండితుల అభిప్రాయము.

**తమిళులు:** తమిళపదానికి ద్రవిడ పదమే మూలమని కొందరు సంస్కృత పండితుల వాదము. కాని తమిళపదమే ప్రాచీనమైనదని ఇటీవల పరిశోధనల వలన తెలియవచ్చినది. మధ్యధరాసముద్రములోని క్రీటు ద్వీపము చాల ప్రాచీన నాగరికతకు పుట్టినిల్లు. ఈ నాగరికతా నిర్మాతలైన ఆదిమానులను ఆర్య గ్రీకులు 'తెర్మిలై' అని పిలిచినారు. ఆసియా మైనరులోని 'లిసియను'లకు 'త్రిమిలి' అను నామాంతరమున్నది. తెర్మిలై-త్రిమిలి పదాలే దక్షిణభారతములో తమిళరూపమున అవతరించినవనుటలో సందేహములేదు.

తమిళపదమే ద్రావిడ పదమైనదని కొందరు విద్వాంసుల మతము. అదిగాక 'ద్రుగతౌ' అనగా త్వరగా పరుగెత్తువారు ద్రావిడులనియు, యుద్ధములలో వోడి దౌడు తీసినవారినే ద్రావిడులని వైదికార్యులు పిలిచినట్లు సమన్వయము సాధిస్తారు. ఈరెండు వాదాలకు వ్యతిరేకంగా 'డ్రూయిడ్' పదమునుండి ద్రావిడపదము పుట్టినదని మరియొక వాదము. డ్రూయిడ్ లు కెల్టిక్ జాతుల పూజారులు; మంత్రతంత్రాలలో ఆరితేరినవారు. యుద్ధసమయాలలో శరీరాలకు రంగులు పులుముకొని శత్రుభయంకరమైన వేషాలు ధరించేవారట. మన పురాణములలో అనార్యులను దానవులుగా-వికృతరూపులుగా వర్ణిస్తున్నారు. వారిలో మహిషాసురులు, ఖరాసురులు, త్రిశిరులు, శూర్పణఖలు, దశకంఠులు కన్పిస్తారు. వీరు ఐంద్రజాలికులు; కామరూపులు. దీనినిబట్టి డ్రూయిడ్ లవలెనే ప్రాచీన అనార్యజాతులు యుద్ధ సమయాలలో శత్రుభయంకర వేషాలు ధరించెడివారన్నచో పురాణములలోని వర్ణనలకు ఒకవిధముగా హేతుబద్ధమైన సమన్వయం కుదురుతుంది. రావణుడు పదిముఖాల శిరస్త్రాణము ధరించేవాడని భావించడం యుక్తం.

**కిరాట:** పురాణాలలో 'కిరాట' పదాన్ని ఆర్యేతరజాతుల పరంగానే వాడినారు. మధ్యయుగం నాటికీపదం వర్తకులనే అర్థంలో ప్రాంతీయ భాషలలో కన్పిస్తున్నది. ఆంధ్ర భాగవతకర్త పోతన్న "కర్ణాటకిరాట కీచకులు" అని నిందార్థములో వాడినాడు. అల్లసాని పెద్దన్న 'అచటి మేటి కిరాటులలకాధిపతికైన మనుమంచి మొరలిచ్చి మనుప దక్షు'లంటూ మర్యాదగా కీర్తించినాడు. ఏమైనప్పటికి 'కిరాట' పదానికి 'క్రీటు'కు దగ్గరపోలిక స్పష్టము. క్రీటు ద్వీపానులనే కిరాటులుగా భారతదేశమున వ్యవహరించి యుండవచ్చును. క్రీటనులు సైతము వాణిజ్యములో సమర్థులు. ఫినీషియనులకు పూర్వము మధ్యధరాసముద్రం మీది వాణిజ్యము క్రీటనుల హస్తగతమైవుండేది. ఈజిప్టు నేలిన ఫారోలు క్రీటను వర్తకులనెంతగానో ప్రోత్సహించి పోషించినారు. కాబట్టే కిరాట పదము వణిజపదమునకు సమానార్థమైనదనడంలో విప్రతిపత్తి ఉండదు.

**అసురులు:** భారతీయ పురాణములన్నీ అసురులతో నిండియున్నాయి. అసురులకు అస్సీరియనులకు పేరులోనేకాక స్వభావములో సైతము పోలికవుంది. అస్సీరియన్లు యుద్ధప్రియులని, క్రూరులని ప్రసిద్ధి. 'నైనెవా' నగరము రాజధానిగా వీరు సుమేరియాలో గొప్ప సామ్రాజ్యం స్థాపించినారు. బైబిల్ గ్రంథమున పేర్కొంటున్న "రక్తనగరము" (City of Blood) నైనావాయే యని పరిశోధకుల తీర్మానము. హరివంశ పురాణం బాణాసురుని రాజధానిని 'శోణపురము'గ వర్ణిస్తున్నది. శోణపురము లేక శోణవతి అనే మాటకు రక్తనగరమని అర్థం. శోణవతి అస్సీరియనుల నైనెవాగా, బైబిలులోని రక్తనగరముగా గుర్తించవచ్చును. దీనివలన

మన పురాణములలోని కథాంశాలలో చాలాభాగం ఆర్యులు భారతదేశానికి రాకపూర్వమే జరిగిన సంఘటనలు అనే వాదానికి బలం లభిస్తున్నది.

ముసిరిజాతి : నైనెవాకు ఈశాన్య ప్రాంతంలో ముసిరి అనే జాతివారు నివసించేవారు. మలబారు తీరంలో ముసిరి అనే ప్రాచీన రేవుపట్టణమున్నది. ముసిరి ప్రాంతము పేరే క్రాంగనూరు. ముసిరిజాతివారు ఏర్పరచుకొన్న వలసయే ముసిరి అయి ఉంటుంది.

భాషలు :

కేవలము భాష ఆధారంగా ఒక ప్రజల జాతీయతను నిర్ణయించడం సాధ్యం కాదు. కొన్ని ప్రాచీన భాషలు పూర్తిగా నశించిపోయినాయి. అందుచేత ఆ ప్రజలు వేరొక భాషను ఆశ్రయించవలసి వచ్చింది. మరికొన్ని భాషలు ప్రాథమిక దశలోనే యితర భాషల ఆధిపత్యానికి లోనై తమ స్వస్వరూపమును కోల్పోయినాయి. అయినప్పటికీ అత్యంత ప్రాచీనమైన మూలపదాల పరిశీలనద్వారా దాక్షిణాత్య భాషలకు, మధ్య ఆసియాలోని భాషలకు ప్రాచీన ఈజిప్షియన్ భాషకు సంబంధమున్నట్లు గ్రహిస్తున్నాము. ఇండియాలోని ద్రావిడ భాషలకు మధ్య ఆసియాలోని హ్యూరియన్, మిట్టానీ, కాస్సైట్ భాషలకు గల సంబంధాన్ని షేయెమర్ పండితుడు నిరూపించినాడు. బెలూచిస్తాన్‌లోని బ్రాహుయీ ద్రావిడ భాషాశాఖకు, ఎలామైట్ శాఖకు స్పష్టమైన పోలికలున్నాయి. పారశీక చక్రవర్తియైన డరయస్ ఇచ్చిన 'బెహిస్టూన్ శాసనాల భాషతో ద్రావిడ భాషల సంబంధాన్ని నిరూపించినాడు కాల్డ్‌వెల్. మెసపొటేమియా, పర్షియా, దక్షిణా పథంలోని గ్రామాలపేర్ల మధ్యపోలికలున్నట్లు షేయెమర్ పండితుడే కనుగొనినాడు. సుమేరియన్ సామ్రాజ్యంలో నొక ముఖ్యపట్టణము 'నిప్పూర్'. దీన్ని క్రీ.పూ. 6000 సంవత్సరములకు పూర్వమే నిర్మించినారు. మెసపొటేమియాలో నొక ప్రాచీన నగరము '' ఊర్ '' దీనిని క్రీ.పూ. 3200 ప్రాంతంలో నిర్మించినారు. సుప్రసిద్ధ మతప్రవక్తయైన అబ్రహామ్ జన్మస్థలము ఊర్ నగరమేనని ప్రతీతి. నిప్పూర్, ఊర్‌లలోని 'ఊరు' పదము గుంటూరు, నెల్లూరు, ఆదిచ్చనల్లూరు, క్రాంగనూరులలోని ఊరు పదము ఒకటే నన్నదానికి సందేహించనక్కరలేదు.

'ఆన్' అనగా తమిళ భాషలో 'మనిషి' అని అర్థము. అదే అర్థంలో ఏ మాట ఈజిప్టు బాబిలోనియా, అస్సిరియా, క్రీటు దేశాలలో వాడినారు; అలా, అమ్మ, అమ్మన్ (మాత ఉదయ్ అనుమాటలు తమిళ, ఈజిప్టు భాషలలో కన్పిస్తున్నాయి. 'రా' అనగా ఈజిప్టులో సూర్యుడు అని అర్థము. తమిళములో 'ఇల్ రా' అనగా చీకటి. ఈ పదమును విడగొట్టినచో 'సూర్యుడు లేడు' అను అర్థం ఇస్తుంది. ఇరవు అనగా తమిళములోనే 'రాత్రి'. బహువచనరూపాన్ని సాధించడానికి నామవాచకపదాన్ని పునరుక్తి చేసే సంప్రదాయం ద్రావిడ ప్రాచీన ఈజిప్షియన్ భాషలలో కన్పిస్తుంది. దీనికి ఉదాహరణగా తెలుగులోని 'తుత్తుమ రు'ను పేర్కొనవచ్చును.

మెసపొటేమియాలో ప్రళయాన్ని గురించిన కథలో 'మీన్', 'నీర్' పదాలున్నాయి. మీన్ అనగా చేప; నీర్ అనగా నీరు. ఈ పదాలు సంస్కృతంలో సైతం ఉన్నవిగాని ఏవిని ఆర్యేతర భాషల నుండియే సంస్కృతం గ్రహించినట్లు పండితులంగీకరిస్తున్నారు. మీన్ పదానికి

'ప్రకాశించు' అను అర్థం కూడా ఉంది. ఈజిప్టులో 'అమ్మన్' దైవానికి ప్రాచీననామము 'మీన'. అతడే స్వర్గలోకాధిపతి; అతడే ప్రాచీన గ్రీసులో 'మెనెస్' అయినాడు. క్రీటులో 'మీనోస్' అయినాడు. మీనోస్ అనేది క్రీటు చక్రవర్తి బిరుదు.

మధ్యాసియా భాషలతోడనేగాక ఐరోపాలోని మాగియార్, ఫిన్, లాప్స్ భాషలతో సయితం ద్రావిడ భాషలకు సంబంధం కనిపిస్తున్నది.

## మత సంప్రదాయములు

ఒక జాతి నాగరికతా సంస్కృతులకు దర్పణము వంటిది మతము. ముఖ్యముగా ఆదిమజాతుల జీవిత విధానములను వారి మధ్యగల పరస్పర సంబంధమును గ్రహించడానికి, నిరూపించడానికి భాష తరువాత తోడ్పడ గలిగినవి మత సంప్రదాయములే.

మాతృదేవతారాధన: ద్రావిడ జాతులలో మాతృదేవతారాధన ప్రాథమికమైన ఆచారము, ప్రాచీన ఈజిప్టులో ఈ ఆచారముంది. సింధుప్రజల ప్రధాన దైవము 'అమ్మతల్లి'. సర్వసృష్టికి కారణభూతురాలని సమస్త సృష్టి ఆమెలోనుండే ఉద్భవించిందని భావించి ఆమెను ఆరాధించే వారు. అమ్మతల్లియే నేడు దక్షిణభారతంలో గ్రామదేవతగా ప్రత్యక్షమౌతున్నది. ఈమె ఆలయంలో శూద్రులే పూజారులుగా ఉండడం ఒక విశేషము. ద్రావిడమైన అమ్మతల్లి భావమే పౌరాణిక మతమున త్రిమూర్తులకు సయితము మూలమైన 'పరాశక్తి' లేక 'దేవి'గా ప్రవేశించిన దనడానికి సంశయింపనక్కరలేదు.

లింగారాధన: లింగారాధన అనేక ప్రాచీన ద్రావిడ జాతులలో ఉన్నది. క్రీటులో శృంగాలంకృతమైన పూజాపీఠంలో (పానవట్టము) ప్రతిష్ఠాపితమైన శిలాస్తంభమును ఆరాధించెడివారు. అతని పేరు 'కందు'. ఈ స్తంభ పూజా సంప్రదాయాలకు అనుబంధముగనే అశోకుడు బౌద్ధ క్షేత్రాలలో శిలాస్తంభాలను ప్రతిష్ఠించినాడు. కొన్ని స్తంభాలు అతడు నిల్పినవికావు. జనాదరణ పొందిన మత క్షేత్రాలలో నాటికే ఉన్న స్తంభాలమీద తన శాసనాలు వ్రాయించాడు. నేటికీ మత సాంఘిక పుణ్యకార్యాల సందర్భంలో స్తంభ ప్రతిష్ఠ చేసే ఆచారాన్ని పాటిస్తున్నాము. దక్షిణ దేశంలో అనేక తటాకాలలో స్తంభాలు కనిపిస్తాయి. ఈ స్తంభపూజ లింగారాధనకు మరొక రూపమే! ఆదిమ జాతులలోని మదనోత్సవాలకు (Fertility Cults) లింగారాధనకు సంబంధమున్నదని చెప్పవచ్చును. లింగారాధకులనే వైదికార్యులు 'శిశ్నదేవు'లని నిందించినారు.

యోగవిద్య: లింగారాధన భారతదేశంలో శివునితో ముడివడి పోయినది. సింధు శిథిలాలలో పశుపతియైన దేవుని ప్రతిమలున్న బిళ్ళలు దొరికినాయి. ఈతడు మహాయోగిగా సైతము చిత్రించబడినాడు. తరువాతి కాలంలోనితడే శివుడుగా మారినట్లు సర్వత్రా అంగీకరిస్తున్నారు. ఈ మహాయోగి ఊర్ధ్వరేతస్కుడుగా చిత్రించబడుట గొప్పవిశేషము. ఇదియే శైవ సంబంధముగ శైవారాధన ప్రారంభానికి స్పష్టమైన నిదర్శనము. పురాణములు శివుని 'దిగంబరుడు'గా వర్ణించడం సైతం పై భావాన్ని బలపరుస్తుంది. ఈ విషయాలన్నీ లింగారాధనకూ, యోగాభ్యాసానికీ ఉన్న సంబంధాన్ని సైతం నిరూపిస్తున్నాయి. వాస్తవానికి యోగవిద్య

అనార్యమేననీ, ఆర్యులా సంప్రదాయాలను స్వీయమొనర్చుకున్నారనీ జాకోబి, ఆల్టేకర్ వంటి చరిత్రకారుల అభిప్రాయం.

**స్నానం:** స్నానము సైతం అనార్య సంప్రదాయమేనేమోననే అనుమానానికి బలవత్తరమైన కారణాలే ఉన్నాయి. శివుడు అభిషేక ప్రియుడు; సర్వదా గంగమ్మను నెత్తిన దాల్చినవాడు! మొహంజొదారో ప్రజలు నగర మధ్యంలో స్నానవాటికలు నిర్మించుకొన్నారు; స్నానానికి వారు మత సంబంధమైన ప్రాముఖ్యం ఇచ్చినట్లు కనిపిస్తుంది. ఇందుకు భిన్నంగా ఆర్యులు అగ్నిహోత్ర ప్రియులు. ఆర్యుల గృహాలలో త్రేతాగ్నులు ప్రజ్వరిల్లుతూ ఉండేవి. ఈ సంప్రదాయాలు వారి వారి ఆదిమ నివాస స్థలాల శీతోష్ణ పరిస్థితుల కనుగుణంగా ఏర్పడి, క్రమంగా పవిత్రీకరింపబడెనని భావించడం యుక్తము.

**నాగారాధన:** నేటికినీ దాక్షిణాత్యులలో నాగపూజ ఎక్కువ. తరచుగా కన్పించే సుబ్బయ్య, నాగయ్య, శేషయ్య మొదలైన పేర్లు, నాగుల చవితి, సుబ్బరాయ షష్టి పండుగలు ఆంధ్రులలోని నాగారాధనకు నిదర్శనములు. దక్షిణదేశంలో వలెనే ఈ ఆచారము ప్రాచీనకాలమున క్రీటు, ఆసియామైనరు, పెర్సిపోలిస్ (పర్షియా) ప్రాంతాల ప్రజలలో బహుళాదరణము పొందింది.

నాగారాధన సైతం శైవసంబంధమనడానికి చాల ఆధారాలున్నాయి. నేటి పశుపతి నాగభూషణుడుగదా! సింధునాగరికతా కాలానికి అతడు నాగాభరణుడౌనో కాదో చెప్పలేము. కాని సింధుప్రజలలో అధికభాగం ఫణి లేక నాగజాతి ప్రజలు, వారు 'శిశ్న దేవులు'; సింధుప్రజలలో నాగారాధన వుంది. అందుచే నాగజాతికి, నాగపూజకు, నాగాభరణ భావమునకు సంబంధ మున్నట్లు కన్పిస్తుంది.

తరువాతికాలంలో, జైన, బౌద్ధ వాఙ్మయాలలో నాగగాథ లనేకం కనిపిస్తాయి. ముచిలింద డనే నాగరాజు, ఇంద్రకల్పితమైన తుఫానునుండి గౌతమబుద్ధునకు రక్షణ కల్పించిన కథ చాల ప్రసిద్ధము. అమరావతీ శిల్పాలలో నీగాథకు ఎక్కువ ప్రాముఖ్యం లభించింది. అమరావతీ శిల్పాలలోని రాజులూ, రాణులూ నాగకిరీటధారులే! అదేవిధంగా జైన తీర్థంకరుడైన పార్శ్వనాథునకు ధరణేంద్రుడనే నాగరాజు, అతని సతీమణి రక్షణ కల్పించారట! పార్శ్వనాథుని విగ్రహాలలో రెండుభుజాలనుండి రెండు నాగులు పుడుతూ ఉన్నట్లు కన్పిస్తాయి. ఈ సంప్రదాయానికి ధరణేంద్రుని కథయే ఆధారం. మెసపొటేమియాలో రెండు నాగులు చుట్టిన దేవతా విగ్రహం దొరికింది. ఈ విగ్రహానికి ముచిలింద శిల్పానికి పోలిక ఉంది. ఈ దేవతావిగ్రహం క్రీ.పూ. 2000 సం.ల నాటిదని విమర్శకుల తీర్మానము. ప్రస్తుతమీ విగ్రహము న్యూయార్క్‌లో పేర్‌పంట్‌మోర్గన్ గ్రంథాలయంలో ఉంది. ఈజిప్టులో కూడా ముఖ్యంగ 'అయ్యన్' దేవతను ఇదేవిధంగా చిత్రించేవారు. క్రీ.పూ. 2600 ప్రాంతమునకు సుమేరియా నేలిన 'గుడెయ్యా' చక్రవర్తి పానపాత్రపై రెండు నాగులు బంధించిన శరభము వంటి మృగము కన్పిస్తుంది. ఈ మృగానికి రెక్కలున్నాయి; సింహము తల - గృధ్రపాదములు. నాగ. సువర్ణగాథలకీ శిల్పమే అంకురార్పణ అని చరిత్రకారుల నిర్ణయము.

**వృషారాధన:** వృషారాధన సైతం శైవసంబంధమే. సింధుప్రజలు బసవన్నను ఆరాధించారు. కాని నాటికే బసవన్న శివుని వాహనమైనాడో లేదో మాత్రము తెలియదు. నందీశ్వరుని

ఊరేగించు దృశ్యాలు ఉన్న బిళ్ళలు (Seals) సింధులోయలో దొరికినాయి. ఈజిప్టుదేశంలో గూడ పర్వదినాల్లో ఎడ్లను ఊరేగించేవారు. నేటికినీ పొంగల్ పండుగనాడు తమిళదేశంలో ఎడ్లను పూజించి ఊరేగిస్తారు. క్రీటులో దొరికిన కంచుపాత్రలమీద ఎడ్లమీదుగా దుమికే దృశ్యాలున్నాయి. శిలప్పదికారములో 'అయ్యార్' అనే ఆచారప్రసక్తి ఉంది. మదించిన ఎద్దుమీదుగా దూకి, దానిని అదుపులోనికి తేవడం, పెండ్లికొడుకులకు పరీక్షగా ఉండేది. అదియే 'అయ్యార్' ఆచారము.

పార్వతి: 'పార్వతి' అనగా పర్వతరాజు కుతురు. ఆమె చంద్రశేఖరుడైన శివునిగురించి తపస్సు చేసి ఆ మహాదేవువే భర్తగా పొందింది. ఇది పురాణాలలోని గాథ. మెసొపొటేమియా లోని ఊర్ నగరప్రజల ప్రధానదేవత "పర్వతరాణి" (Lady of the Mount). ఈమె భర్త చంద్రుడు. వీరికి ప్రతి సంవత్సరము కళ్యాణమహోత్సవము జరిపేవారు. పర్వతరాణియే పార్వతియైనదని, చంద్రుడే చంద్రశేఖర అవతారమెత్తి భారతదేశమున ప్రత్యక్షమైనాడను టలో సందేహంలేదు. మనదేశంలోగూడ పార్వతీ చంద్రశేఖరులకు ప్రతి సంవత్సరము "తిరుక్కల్యాణము" లేక 'తిరువాళ' జరుగుచునే యున్నది గదా! ఆదిమ సంప్రదాయా లను నిలబెట్టి గౌరవం భారతీయులదే!

ఊర్ ప్రజల పర్వతరాణివంటి దేవతనే క్రీటు ద్వీపవాసులు సైతం ఆరాధించినారు. ఆమెపేరు 'మా'; ఆమె వ్యాఘ్రవాహని. ఆమె భర్త నందివాహనుడు! వీరికినీ, హిందువుల ఉమాశంకరులకును భేదం లేదనే చెప్పవచ్చు.

చంద్రారాధన: మెసపొటేమియా ప్రజలు చంద్రుని ఆరాధించినట్లు పేర్కొన్నాము. మధ్యాసి యాలోని ఇతరజాతుల్లో సైతం ఈ ఆచారం కనిపిస్తుంది. ఇది అవైదికము. శిలప్పదికారం మొదలగు తమిళగ్రంథాల ద్వారా తమిళులలో చంద్రారాధన ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఈజిప్టియనులు, ఖాల్డియన్లు చాంద్రమానము ననుసరించినారు. ఆంధ్రదేశంలో వేదములలో నున్నది చాంద్రమానమే! నేటికినీ మహమ్మదీయులు అనుసరించుచున్నది చాంద్రమానమే గదా! అల్లసాని పెద్దన చెప్పినట్లు "గోవధము సేయు తురకలదైవము" చంద్రుడు!

తలనీలాల సమర్పణ: ఆంధ్రదేశంలో తిరుపతి వేంకటేశ్వరాలయంలో తలనీలాలను ముడుపు చెల్లించే ఆచారం ప్రసిద్ధము. తిరుపతిలోనే గాక దక్షిణదేశమున పెక్కు క్షేత్రాలలో నీలాల సమర్పణ జరుగుతున్నది. ఇదే విధమైన ఆచారము ఫినీషియన్ నగరమైన బిబ్లస్‌లో కన్పిస్తున్నది. ఇచట దేవాలయాలలోని దేవత సగము చేప, సగము మనిషి. ఈ దేవాలయం సుమారు ఆరువేల సంవత్సరాలనాటిది. హిందువుల నరసింహునకు, విఘ్నేశ్వరునకు బిబ్లస్‌లోని నరమత్స్య దేవతకు పోలిక స్పష్టం. ఇటువంటి నరమృగ దేవతలను (Zoomo-rphic Gods) ఆటవిక దశలో ప్రజలారాధించినారు. వీరు ఆర్యేతర దేవతలే.

తలనీలాల నర్పించడం తలనర్పించడంతో సమానం. పరమశైవుడైన రావణుడు తలల నర్పించి శివుని ఆరాధించినట్లు రామాయణంలో ఉంది. తలల నర్పించడం తీవ్రవాద శైవాచారంగా మధ్యయుగం వరకు ఆంధ్రదేశంలో ఉంది. కొండవీటి రెడ్డిరాజులు, శ్రీశైలాది శైవక్షేత్రాలలో, వీరశిరోమండపాలను నిర్మించినారు. కాని తలలనర్పించు సాహసములేని

భక్తులు తల నీలాలనర్పించి తృప్తి వహించేవారని భావించవచ్చు. "పుష్పార్థం అక్షతాన్ సమర్పయామి" అని కదా సంప్రదాయం. రావణుడు సైతం తన తలలను బోలిన తలలను చేయించి హోమములో వ్రేల్చి వుంటాడు. తల నీలాల సమర్పణ మనగా ఆత్మార్పణం చేయడమే! భక్తిభావమునకది పరాకాష్ఠ. మొట్టమొదట తిరుపతి శైవక్షేత్రమనీ, శ్రీరామానుజాచార్యుల కాలమున వైష్ణవులు ఆక్రమించి వైష్ణవక్షేత్రముగ మార్చిరనీ స్థలపురాణం ద్వారా తెలియుచున్న విశేషము. నేటికిని దేవుని నిజస్వరూపము పూజారులకు వినా ఇతర భక్తులకు కన్పింపదట! ఏమైనను 'నరమత్స్య' దేవతలోవలెనే 'వేంకటేశ్వర' నామంలో సగము వైష్ణవము, సగము శైవము! 'మధ్యవైష్ణవులకు నామములు పెద్ద' అనగా శ్రీ వేంకటేశ్వరుని ముఖమంతా నామాలే! వైష్ణవక్షేత్రంగా మారిన తరువాత సైతము ప్రాచీన శైవాచారమైన శిరోజార్పణ నిలబడి వుండడమే తిరుపతిలో గమనింపదగిన విశేషము!

దేవదాసి: దక్షిణదేశ దేవాలయములలో దేవదాసి సంప్రదాయము చాల ప్రసిద్ధము. ఇదే సంప్రదాయం సిరియా, ఆర్మీనియా, లిబియా దేశాలలోని దేవాలయాల్లో సైతం అనుసరించబడింది. సుమేరియాలో ఒక్కొక్క దేవాలయమున దేవదాసీల సంఖ్య వందలకొలది ఉండేది. ఆంధ్రదేశంలో దేవాలయ శాసనాలలో 'మున్నూరుసానులు' అనేమాట తరచుగా కన్పిస్తుంది. బహుశాసానులు కూడ శ్రేణులుగా ఏర్పడేవారేమో!

పూజా విధానము: మన దేవాలయాలలో రాజోపచార సమన్వితమైన పూజావిధానాన్ని అనుసరిస్తారు. దేవునకు అర్ఘ్యపాద్యాలిస్తారు, శంఖాలు పూరిస్తారు; గంటలు-వేణువులు -వీణలు వాయిస్తారు. నృత్య గీతాల సంగతి వేరే చెప్పనక్కరలేదు. ధూపదీపాలు సమర్పిస్తారు. వింజామరలు వీస్తారు. తుదకు నైవేద్యము పెట్టి ఆ భోజ్యములను ప్రసాదంగా స్వీకరిస్తారు. ఇంచుమించు ఇదే విధానము క్రీటు, సుమేరియా దేవాలయాలలోనూ అనుసరించేవారు. ఇది వైదికమైన హోమ విధానమునకు విరుద్ధమైన పూజావిధానము. 'పూజ' అనుపదము ఆర్యేతరమని కొందరి అభిప్రాయము. సంస్కృతమున వినా మరి యే యితర ఇండో యూరపియను భాషలలోను 'పూజ' అనేమాట లేదట.

పూజారులు: సింధు శిథిలాలలో ఒక పురుష ప్రతిమ బయల్పడింది. అది ఆ నాటి పూజారి ప్రతిమయని చరిత్రకారుల అభిప్రాయము. ముఖ్యంగా ఈ పూజారి వేషము గమనింపదగింది. అతడు ఉత్తరీయాన్ని ధరించాడు. ధోవతి - ఉత్తరీయములు ద్రావిడ లేక ఆర్యేతర వస్త్ర పద్ధతియేయని అంగీకరిస్తున్నారు. ఉత్తరీయాన్ని ఈ పూజారి ఉపవీతం పద్ధతిలో ధరించినాడు; అనగా కుడి భుజము క్రిందుగా - ఎడమ భుజముమీదుగా దాల్చి ఎడమ భుజముదిగువ వక్షస్థల సమీపమున ముడివేసినాడు. ఇది యజ్ఞోపవీతమునకు అంకురార్పణ అనవచ్చును. యజ్ఞోపవీతమనగా యజ్ఞకాలమున ధరించు ఉత్తరీయము. కావున యజ్ఞోపవీత మనగా వల్లెయే! శిల్పాగమాలలో వస్త్రయజ్ఞోపవీత ప్రసక్తి వుంది. గుప్తయుగమునాటి శిల్పాలలో సుదీర్ఘమైన వస్త్రయజ్ఞోపవీతాలు కన్పిస్తాయి. ఉపనయనార్హతలేని శూద్రులు సైతం పితృకార్యముల సందర్భంలో వస్త్రయజ్ఞోపవీతాలు ధరిస్తారుగదా! సింధు పూజారి ప్రతిమను బోలినట్టివే మెసపొటేమియాలో కూడ దొరికాయి. దీనివలన ఉభయ దేశాలలోనూ పూజారులొకేరకములైన దుస్తులు ధరించేవారనియేగాక యజ్ఞోపవీతము ఆర్యేతర సంప్రదా

యముగ మదయించినదనియూ, మొదట, ఉత్తరీయముగానే యుండి నేటికి లాంఛనప్రాయమైన మాలుపోగుగ మారిపోయినదనియు గ్రహించవచ్చును. సింధు పూజారి నుదుటిపై బాసికమును పోలినదానిని ధరించియుండుట సైతము గమనింపదగియున్నది. మత సంబంధమైన కార్యక్రమాలలో నేటికినీ బాసికములు, కంకణములు ధరించునాచారము మనలో మున్నది గదా! ఇది చరిత్ర పూర్వయుగంనాటి సంప్రదాయం!

మరొక విశేషమేమన, సింధు మెసపొటేమియా పూజారులు తలకట్టు, మీసము తీసివేసి గడ్డమును మాత్రము పెంచినారు. ప్రస్తుత మీ సంప్రదాయము ముస్లిములదని హిందువుల విశ్వాసము! అన్ని మతములలోను, గడ్డం మతమునకు చిహ్నమను విశ్వాసం కన్పిస్తున్నది. సనాతన హిందువులలో సైతమీనమ్మకము ఉంది. వారిలో మీసమును పెంచుట దోషమను నమ్మకం సైతం ఉంది. మత సంబంధమైన కార్యకలాపముల సందర్భమున ''కేశశ్మశ్రువాపయిత్వా'' - తలజుట్టు, మీసము తీయించుమని ధర్మశాస్త్రం ఆదేశిస్తున్నది. ఒక సందర్భములో తిరుపతి వేంకటకవులు ''దోసమటంచు వెఱింగియును దుందుడుకొప్పగ పెంచినార మీ మీసలు'' అంటూ చాటినారు. కావున సనాతన హిందూ ధర్మము ననుసరించి మీసము పెంచటం దోషము. దీనిని బట్టి జుట్టు, మీసము తీయించి గడ్డము పెంచుట ఇస్లాము మత సంబంధమైన ప్రత్యేక సంప్రదాయముకాదనీ, మిక్కిలి ప్రాచీనము, సనాతనమునైన భారతీయ ఆచారమేననీ తెలుస్తున్నది.

## వాస్తు నిర్మాణాదులు

**పురములు, ఆలయములు:** వైదికార్యుల విరోధులైన ఫణి మున్నగు జాతులు వాస్తువిద్యలో వారితేరినట్లు పేర్కొన్నాము. వారి నిర్మాణ కౌశల్యానికి హరప్పా మొదలైన చోట్ల బయల్పడిన కట్టడాలే నిదర్శనములు. ఋగ్వేద సంహితాకాలంలో ఆర్యులకు స్థిరనివాసాలు లేవు. అనార్యుల పట్టణాలను, దుర్గాలనుచూచి సంభ్రమాశ్చర్యములను వెల్లడించినారు. దుర్గానికి ఆనాడు 'పురము' అని వ్యవహారముంది. పురములను నిర్మూలించినవాడే పురందరుడు! బ్రాహ్మణములలో 'అర్మ', 'అర్మక' అనే ప్రయోగాలు తరుచు కన్పిస్తున్నాయి. వీనికి 'వినష్టగ్రామ'మని అర్థము. ఉత్తరాపథము నందలి తమగ్రామములు ఆర్యదండయాత్రలలో నష్టపడిన తరువాతనే ఆర్యేతరులు దక్షిణాపథమును చేరి అచట పట్టణములు, పురములు, దేవాలయములు నిర్మించుకొన్నారు. ప్రాచీన తమిళవాఙ్మయము నుండి నాటి దాక్షిణాత్యుల నిర్మాణకౌశల్యము స్పష్టంగా తెలుస్తున్నది. ఈ నిర్మాణములకు ఈజిప్టు, క్రీటు, బాబిలోనియా, సుమేరియా దేశాలలోని కట్టడాలకు పోలికలున్నాయి. ఈజిప్టులోని పిరమిడులను గురించిగాని, కార్నక్ మున్నగు దేవాలయములను గురించిగాని చెప్పనక్కరలేదు. క్రీటులో క్నాసాస్ చెంత పద్మవ్యూహమును బోలిన రాజప్రాసాదము బయల్పడింది. సుమేరియాలో ఒక్కొక్క దేవళమొక రాజ ప్రాసాదము. తమిళులు తరచుగావాడు కోవెల (దేవాలయము) పదమునకు రాజప్రాసాదము అనే అర్థం ఉంది.

**గోపురాలు:** సుమేరియన్లు 'నిప్పూర్'లో తమ ఇష్టదైవమైన 'ఎన్‌లిల్'కు పెద్ద గోపురాన్ని నిర్మించారు. ఎన్‌లిల్ వాయుదేవుడు. బహుశా ఈ పదమే 'అనిల'గా సంస్కృతభాషలో

ప్రవేశించి ఉంటుంది. బైబిల్‌లోకూడ గోపురాల ప్రసక్తి (Tower of Babel) వుంది. దక్షిణాపథంలో అమలులో నున్న దేవాలయ వాస్తు పద్ధతిలో గోపురానికి ప్రముఖ స్థానముంది. ఆలయ ప్రాకారములోని గోపురమును 'గాలి గోపురము' అంటారు! సుమేరియాలోని ఎన్‌లిల్ గోపురానికి, గాలిగోపురానికి సంబంధమును ఊహించవచ్చును.

## సాంఘిక సంప్రదాయములు

ఆభరణాదులు : దాక్షిణాత్య ప్రజలకును, మధ్యధరా సముద్రప్రాంత ప్రజలకు అనేక సాంఘిక సంప్రదాయాలు సమానమని తెలుస్తున్నది. దక్షిణదేశ ప్రాచీన సమాధులలో రంగుకుండలు బయల్పడినవి; ఇటువంటివే మధ్యాసియాలో తేపెహిస్సార్, సుసాప్రాంతాలలోను, ఇటీవల బెంగాలు రాష్ట్రములోను బయల్పడినాయి. దాక్షిణాత్య స్త్రీలకు 'అందె' అభిమాన ఆభరణము. శిలప్పదికారం అనే తమిళ కావ్యానికి అందెయే కథావస్తువు. ఈ అందెను పోలినదే క్రీటులో క్నాసస్సస్ భవనంలోని కుడ్యచిత్రాలలో కనిపించింది.

ఆదిచ్చనల్లూరు సమాధులలో బంగారుపతకాలు, బంగారు బూరలు దొరికినాయి. పూజా సమయాలలో నీ బూరలను పూరించేవారు. నేటికిని పలని కొండలలోని మురుగన్ దేవాలయానికి కావడులు మోసుకొని పోవువారు ఇటువంటి బూరలనే ఊదుతూ నడుస్తారు. ఈరకమైన బూరలు మనదేశమున మరియే ప్రాంతంలోను దొరకలేదు. కాని సైప్రస్ దీవిలో ఎన్‌కోమిలనేచోట కంచు యుగానికిచెందిన సమాధులలో దొరికినాయి; పాలస్తీనాలో గజా, గరార్‌ల చెంత దొరికిన శిరోవేష్టనములకు, కిరీటములకు, ఇనుప పనిముట్లకు ఆదిచ్చనల్లూరులో దొరికిన వాటికి పోలికలున్నాయి.

కావేరి తుంగభద్రానదులను దాటటానికి 'పుట్టి' (Coracle) అనే సాధనాన్ని ఉపయోగిస్తారు. వెదురు లేక ఈత పేళ్ళతో తట్టవలె అల్లి దానిపై చర్మం కుట్టిన ఈ సాధనము చాలా ప్రాచీనమైనది. తెలుగులో 'పుట్టి మునిగింది' అనే సామెత సర్వసాధారణము. పుట్టివంటి సాధనమునే ప్రాచీనయుగంలో యూఫ్రటీస్, టైగ్రిస్ నదులపై ఉపయోగించారు. నేటికిని వేల్సు, ఐర్లండు దేశాలలో వాడుతున్నారు.

**సమాధులు :** సంస్కృతీ సంబంధములను నిర్ణయించడంలో అంత్యక్రియలకు సంబంధించిన సంప్రదాయముల ప్రాముఖ్యం ఎక్కువ. మనదేశంలో దహనం ఆర్య సంప్రదాయమనీ, ఖననము అనార్యమనీ సాధారణ విశ్వాసం. అనార్యులలో ఐదురకముల ఖనన సంప్రదాయము లుండినట్లు దక్షిణదేశమున బయల్పడిన ప్రాచీన సమాధులవలన తెలుస్తున్నది. ఈ ఐదు రకాల సమాధులు మధ్యఆసియా, మధ్యధరా ప్రాంతాలలో కూడ బయల్పడినాయి. వీనిలో మూడు రకాల సమాధులను బండలు, రాతిపలకలు ఉపయోగించి నిర్మించేవారు. వీనిని ఆంధ్రదేశంలో 'రాక్షసగుళ్ళు' అని వ్యవహరిస్తారు. శవపేటికల నుపయోగించే సమాధులు మరొక రకము. సబర్మతీనదీలోయలో దొరికిన ఒక శవ పేటికకాళ్ళు ఏనుగు కాళ్ళను పోలియున్నాయి; ఇట్టి శవపేటికయే సిరియాలో క్వాట్నా చెంతదొరికింది. ఇటీవల నాగార్జునకొండ కావలివైపు ఏలేశ్వరము చెంత త్రవ్వకాలలో ఏనుగును పోలిన అవశేష పేటిక దొరికినది.

ఆదిచ్చనల్లూరులో దొరికిన శవపేటికలలో బంగారు శిరోవేష్టనాలు లభించినాయి. ప్రాచీన కాలమున శవములకు బంగారు శిరోవేష్టనములను చుట్టే ఆచారం పాటించేవారు. ''పట్టయం కట్టరాదు'' అనే ఈ ఆచారం నేటికీ మధురై ప్రాంతాలలో సజీవంగా ఉంది. ఆదిచ్చనల్లూరు శిరోవేష్టనాలను పోలినవే గ్రీసులో మైసీన్‌చెంత కనిపించినాయి. పాలస్తీనాలోని ప్రాచీన సమాధులకు ఆదిచ్చనల్లూరు సమాధులకు పోలికలు చాలా ఉన్నాయి.

ఐదవరకం సమాధులు గుహా సమాధులు. ఇవి మలబారులో ఎక్కువ. వీనిని ''తొలై'' అంటారు. అంటే రంధ్రము అని అర్థము. ఈ పదము 'తొలుచు' నుండి వచ్చి ఉంటుంది. ఇట్టి సమాధులే క్రీటులోగూడ కపించడం ఆశ్చర్యమే. అక్కడకూడ ఈ సమాధికి 'తొలై' అనే పేరే ఉండడం మరింత ఆశ్చర్యకరము.

## ఏది జన్మస్థలము?

ఈ పరిశీలన వలన భారతీయ ద్రావిడ జాతులకును, మధ్య ప్రాచ్యంలోని ప్రాచీన జాతులకును మధ్యకల సాంస్కృతిక సంబంధాలు యాదృచ్ఛికములు కావనీ, ఈ జాతుల న్నియూ ఒక ఆదిమ మూలజాతి శాఖలే అవడానికి తగినంత బలీయమైన ఆధారములున్నవ నియు స్పష్టమౌతున్నది. కాగా ఈ మూలజాతి ఆదిమ నివాసస్థలమేది? ఈ జాతులన్నియు ఒకే జాతి శాఖలు కానిచో వీరందరిలో సమానంగా కన్పించే సాంస్కృతిక అంశములకు జన్మస్థలమేది? అను సమస్యంపై పండితులలో ఏకాభిప్రాయంలేదు.

ద్రావిడ జాతులలో కొన్ని శాఖలు వాయువ్య పరిహద్దులగుండా మిక్కిలి ప్రాచీన కాలమున భారతదేశమున ప్రవేశించిరని కొందరి చరిత్రకారుల తీర్మానము. బెలూచిస్థాన్‌లోని బ్రాహుయీ భాషను తమ సిద్ధాంతమునకు నిదర్శనముగా వీరు ఉదహరిస్తారు. అదీకాక ఆంధ్ర, మూతిక, పుష్కాదిజాతు లొకప్పుడు వక్షునదీ తీరంలో నివసించినట్లు బ్రహ్మాండాది పురాణములలో చెప్పబడింది. వక్షునదియే ఆక్సస్. చారిత్రక యుగమున పైజాతులలో చాలాభాగము దక్షిణా పథమున కనిపిస్తున్నారు. ఈ చారిత్రకాంశము ద్రావిడులు మధ్య ఆసియా ప్రాంతములనుండి దక్షిణ భారతమునకు వలసవచ్చినారనే సిద్ధాంతాన్ని బలపరుస్తు న్నది.

భారతదేశం నుండియే - అందునా దక్షిణాపథం నుండియే ద్రావిడజాతులు ఉత్తరాపథా నికీ, అటునుండి మధ్యధరా ప్రాంతభూములకు వలస వెళ్ళినారని హీరాస్‌వంటి పండితులు నిర్ణయించినారు. ఈ సిద్ధాంతమునకు సైతము కొన్ని బలవత్తరమైన ఉపపత్తులే ఉన్నాయి. ప్రాచీన ఈజిప్షియన్ సారస్వతమున ఈజిప్షియనులు 'పంట్' దేశంనుండి వచ్చినట్లు చెప్పబడినది. పంట్ దేశమే పాండ్యదేశమని హీరాస్ పండితుని అభిప్రాయము. కాని కొందరు చరిత్రకారులు పంట్ దేశము 'సొకొత్రా'గా భావిస్తున్నారు. ఈజిప్టు నేలిన తొమ్మిదవ రాజవంశము వారికి 'పాటలా' జన్మస్థలమట! ఈజిప్టునకిది తూర్పుదిశ నున్నదనీ, పెక్కున దులతో నేర్పడిన డెల్టా భూమియనీ వర్ణించబడింది. ఈ వర్ణనకు సింధునదీ ముఖద్వారము సరిపోతున్నది. సింధునదీ ముఖద్వారమునవే పాటలా నగరమున్నట్లు గ్రీకు చరిత్రకారులు పేర్కొన్నారు. ఇచటో పాటలా నుండి ఈజిప్టుకు వెళ్ళే మార్గంలో సొకొత్రా; అనగా పంట్

దేశము మజలీస్థలమై ఉంటుంది, మహాభారతంలో నాగమాతయైన కద్రువ తన కుమారులను సముద్రం మీదుగా 'రామణీయక దేశము'నకు గొనిపొమ్మని గరుత్మంతుని ఆదేశించింది. కల్నల్ విల్ ఫర్డ్ పరిశోధనల ప్రకారమీ 'రామణీయక దేశము' ఈజిప్టు దేశమే. మరొక విశేషమేమిటంటే గ్రీకుల పాటలీ దేశమే మన ఇతిహాసపురాణాలలోని పాతాళమని విమర్శకుల అభిప్రాయము. పాతాళలోకమే నాగలోకము. ఈ అంశాల పరిశీలనవలన నాగజాతి ప్రజలు కొందరు భారతదేశం నుండి ఈజిప్టుకు వలసవెళ్ళిరనే అభిప్రాయం కలగటం సహజమే.

అయితే పరస్పర విరుద్ధాలైన ఇట్టి నిదర్శనాలు ఆధారంగా ద్రావిడజాతుల జన్మస్థలము ఇదమిద్ధంగా నిర్ణయించడం సాధ్యంకాదు. కాని ఒక విషయం మాత్రం సత్యము. ప్రపంచరంగస్థలముపై ఆర్యజాతు లడుగిడక పూర్వమే మధ్యధరా ప్రాంత జాతులనబడే ద్రావిడజాతులు ఆసియా, ఐరోపా, ఆఫ్రికాలలోని పలుదేశాలలో విస్తరించి ఉదాత్తమైన నాగరికతా సంస్కృతులకు దృఢమైన పునాదులు నిర్మించినారు. ఈ పునాదులు మరుగునపడునట్లుగా ఇటీవలికాల మన కలుషితమైన మత రాజకీయ జాతీయవాదాలు బలిసి ప్రజలలో కృత్రిమమైన భిన్నత్వాన్ని రెచ్చగొట్టినాయి. కానీ నేడు కనిపించే భిన్నత్వం అడుగున ప్రాచీనమైన సాంస్కృతిక సమైక్యం కలదనటంకూడ సత్యమే. ఆ సత్యాన్ని గుర్తించటం చాల అవసరం. ఏనాటికైనా ఆసియా అధికభాగంలో సుస్థిర శాంతిస్థాపన కా గుర్తింపే సాధనము శరణ్యము కాగలదు.



# 9. నడుస్తున్న పురాచరిత్ర

పురా చరిత్రకే చరిత్ర పూర్వయుగమని మరోపేరు. మానవ చరిత్ర సమస్తాన్ని స్థూలంగా చారిత్రకయుగం అనీ, పూర్వచరిత్ర అనీ విభజించడం పరిపాటి. చరిత్రరచనకు లిఖిత పూర్వకమైన ఆధారాలు లభించినప్పటినుండి చారిత్రకయుగం; అంతుకుముందున్నదే పురాచరిత్ర. చారిత్రక యుగంతో పోలిస్తే చరిత్ర పూర్వయుగం సుదీర్ఘమైన యుగం. ఇంచుమించు పాత-కొత్త రాతియుగాల కాలమే పురాచరిత్ర అని చెప్పవచ్చు. ఈ యుగంలో మానవజీవితం నిరాసక్తిగా - భారంగా - పశుప్రాయంగా సాగింది. అది మానవుని మానసిక శక్తులు ప్రాథమిక దశలో మున్న యుగం. అయినప్పటికి ఆ ఆదిమ దశలో సైతం తన చుట్టూ ఉన్న ప్రకృతిని అర్థం చేసికొని వ్యాఖ్యానించాలని తాపత్రయం, జీవితాన్ని సుఖకరం చేసుకోవాలనే ఆకాంక్ష అతనిలో కన్పిస్తాయి. అవి మానవుని స్వభావగత లక్షణాలు. ఈ లక్షణాలు క్రమంగా భౌతికరూపం ధరించడమే నాగరికతా చరిత్ర. జీవితాన్ని సుఖకరం చేసుకొనే పోరాటంలో మానవుడనేక సిద్ధాంతాలు, సంప్రదాయాలు, సంస్థలు రూపొందించి పెంపొందించుకొన్నాడు.

అవిధంగా మానవుడు నిర్మించిన సంస్థలలో మతం చాల ముఖ్యమైంది. వ్యక్తి జీవితంలో సుఖానికి, సామాజిక శాంతభద్రతలకు, విశ్వానికి వ్యాఖ్యానంగాను మతం - మంచి సాధనం కాగలదని ఆదిమ మానవుని ఆశ. మతం మానవుని సృష్టేగాని దైవనిర్మితం కాదనేది పరమ యదార్థం. కారణం మతం మానవునితోనే ఆవిర్భవించకపోవడమే. మానవుని చరిత్రలో చాలకాలం వరకు మతంలేదు. నేటికీ పసిఫిక్ దీవులలో కొన్ని తెగల మానవులకు మతంలేదు. దైవము, ఆత్మ, పరమాత్మ, స్వర్గం, నరకమనే భావాలు వారి జీవితవిధానాన్ని కలుషితం చేయలేదు. వారిది నిరాడంబరమై ప్రకృతిసిద్ధమైన జీవితం. ఈ అంశాలు మతానికి సృష్టికర్త మానవుడే అనే సత్యాన్ని నిరూపిస్తున్నాయి. అయితే అనేక ఆదిమ ఆచారాలు, సంప్రదాయాలు, సంస్థలు నశించి వాని స్థానంలో క్రొత్తవి ఏర్పడినాయి. కాని మతం మాత్రం చిరస్థాయిగానడం గొప్ప విచిత్రం. గతంలో మతంమీద చాల దండయాత్రలు జరిగినాయి. అయినా నానాటికి మత ప్రభావం అపారంగా పెరిగి ప్రజాజీవితాన్ని తన కంబంధ హస్తాల్లో బంధిస్తూనే ఉంది. ఈ పరిణామానికి ఒకే ఒక కారణం కనిపిస్తున్నది. అనాదిగ మానవ స్వభావంలోని రెండు బలహీనతలను ఆసరాగా చేసికొని మతం పుట్టి పెరిగింది. అవి ఆశ, భయము. ఈ దౌర్బల్యాలను జయప్రదంగా వాడు కొంటున్నందువల్లనే మతం చరిత్రకు, పురాచరిత్రకు మధ్య వారధిగా వుంది; ఆధునికనాగరికతమధ్య ఆదిమ అనాగరికత విచ్చల విడిగా జోహారు లందుకోవడానికి తోడ్పడే సాధనం అవుతోంది.

* * *

మతానికి సంబంధించిన విశ్వాసాలను, ఆచారాలను ఏమాత్రం విమర్శనాదృష్టితో పరిశీలించినా పై అభిప్రాయంలోని సత్యం బోధపడుతుంది. 'హిందూమతంలో యుగయుగానికి అపారంగా పౌరాణిక వాఙ్మయం తయారయింది. ఆదిమ సంప్రదాయాలను, విధానాలను

పసిపూసి మారేడుకాయగా' చేసి సమర్థించి కొనసాగించడమే ఆ వాఙ్మయ సమస్తానికి లక్ష్యం
యింది. ప్రపంచంలో జన్మించిన మత ప్రవక్తలకు లెక్కలేదు. వీరందరూ సాధించినదేమిటి?
ప్రజలకు విజ్ఞానం ప్రసాదించి తద్వారా మూఢవిశ్వాసాల దౌర్జన్యం నుండీ, అర్థరహిత
ర్మకాండలనుండీ మోక్షం ప్రసాదించడానికి బదులు వాటిని సమర్థించడమేగాక వానికి
రాముకూడ కొన్ని చేర్చడం జరిగింది; తద్వారా ఆదిమత్వానికి దివ్యత్వం సంక్రమించింది.
ఒకటి-రెండు ఉదాహరణలను పరిశీలిద్దాము. 'ఎదురు మేనరికం' దాక్షిణాత్య ప్రజలలో
అనాదిగా ప్రచారంలో వుంది. ఈ ఆచారం జాతి ఆరోగ్యకరమైన వికాసానికి ప్రతిబంధకం
అని శాస్త్రకారుల అభిప్రాయం. అందులో సందేహం లేదు. హిందూ సూత్రకారులలో
ప్రముఖుడైన బౌధ్ధాయను డీ ఆచారాన్ని తీవ్రంగా విమర్శించినాడు. అయినప్పుడు జాతికి
హానికరంగా పరిణమించే ఆ ఆచారాన్ని నిషేధించడానికి భయపడి బౌధ్ధాయనుడు దాన్ని
అంగీరిస్తాడు. ఆపస్తంబుడు మరొక సూత్రకారుడు. శూద్రులలోను, స్త్రీ జనంలోను
ప్రచారంలో ఉన్న పెక్కు అనాగరిక ఆచారాలను గురించి అసమ్మతంగా వివరిస్తూ కూడా
వానిని అధర్వణ వేదంలో చేర్చి వానికి దివ్యత్వం చేకూర్చినాడు. వేదాలు అపౌరుషేయాలు
అని కదా హిందువుల విశ్వాసం! ఇక పౌరాణిక వాఙ్మయం అంగీకరించని ఆదిమ విశ్వాసాలు,
ఆచారాలు, కర్మకాండలు లేనేలేవని చెప్పవచ్చు. ఇది సనాతనాచారం - సనాతన ధర్మం
అంటూ శ్లాఘించేదాంట్లో అధికభాగం ఆదిమ అనాగరిక దశలో రూపొందినదే. ''పరస్పర
విరుద్ధములైన అంశాలతో, ఉత్ప్రేక్షలతో, విపరీతమైన ఆడంబరాలతో తలాతోకాలేకుండా
తయారయిన పురాణాలు ప్రజలలో మానసిక వికాసానికిగానీ, విచక్షణాయుత నిర్ణయ
సామర్థ్యానికిగానీ ఉపకరించవు'' అంటాడు సనాతన ధర్మప్రియుడు అన్నామలై విశ్వవిద్యా
లయ చరిత్రశాఖాధ్యక్షుడైన సత్యనాథ అయ్యర్ ఢాకా విశ్వవిద్యాలయంలో చరిత్రశాఖ
ఆచార్యపీఠాన్ని అలంకరించిన డా॥ హాజ్రా అభిప్రాయంలో ''హిందూసమాజంలోని పూజారి
వర్గ ఆర్థికావసరాలు తీర్చడమే లక్ష్యంగా పురాణ వాఙ్మయం తయారయింది. కాబట్టే
పురాణాలు అజ్ఞానాన్ని ఘనీభవింపజేయడానికి, అంధ విశ్వాసాలకు బహుళ ప్రచారం
సాధించడానికి మాత్రమే ఉపకరించినాయి అనడానికి సందేహించవలసిన పనిలేదు.''

బ్రాహ్మణ మతంలో వెర్రితలలు వేసిన కర్మకాండపై తిరుగుబాటుగా జైన బౌద్ధాలు
అవతరించినాయి. కాని కాలక్రమేణ ఆ సిద్ధాంతాలు సైతం దిగజారిపోయినాయి. ప్రజలను
ఆకట్టుకోవాలనే తాపత్రయంతో జైన బౌద్ధాలు ఆదిమ అనాగరిక ఆచారాలను అనుమతించి
తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయినాయి. స్థానికములైన ఆదిమ విశ్వాసాలను అంగీకరించడం వల్లనే
బౌద్ధమతం శాఖోపశాఖలయింది. ప్రపంచంలోని మతాలన్నింటికి ఇదే దుర్గతి పట్టింది.

హిందువులకున్న ముక్కోటిదేవతల్లో శక్తికి విశిష్ట స్థానం వుంది. శక్తినే దేవి అనికూడ
వ్యవహరించవచ్చు. దేవీభాగవతం ప్రకారం శక్తి శిఖరాగ్రదేవత. త్రిమూర్తులతో సహా సమస్త
దేవతలు దేవిచుట్టూ చేరి భజనచేసేవారే! దక్షిణాపథంలో ప్రతి గ్రామానికి ఒక అధిదేవత
వుంది. ఆమె గ్రామదేవత. ఆమె ఒక చిన్న ఆలయంలో నివసిస్తున్నది. శైవ వైష్ణవాలయాలతో
పోలిస్తే గ్రామదేవతాలయం చాల నిరాడంబరంగా వుంటుంది. సాధారణంగా ఆ దేవాలయాల్లో
పూజారులు శూద్రులు. కొన్ని సందర్భాలలో అంత్యజులు. ఆ ఆలయంలో భజనలు
జరుగవు. ప్రసాదాలు దొరకవు. కాని గ్రామానికి ప్రమాదం ఏర్పడ్డప్పుడు, ఆధివ్యాధులు
సంభవించినప్పుడు రక్షణార్థం ప్రజలు ఆమె దేవాలయానికే పరుగులు తీస్తారు. ఆమెకు

కొలుపులు కొలుస్తారు. అయితే ఈ శక్తి లేక గ్రామదేవత శిలాయుగ మానవుడు ఆరాధించిన అమ్మతల్లికి ఆధునిక అవతారమే! నాటి మానవుడు సృష్టికి మూలకారణంగా మూర్తీభవించిన మాతృప్రేమగా భావనచేసి అమ్మతల్లుల రూపొందించి ఆరాధించినాడు. మనదేశంలోనే కాదు, యావత్ప్రపంచంలోనూ మానవుడారాధించిన మొట్టమొదటి దైవము 'అమ్మతల్లి'. ఆదిమ మానవునిలోని హేతుబద్ధ ఆలోచనా విధానానికి అమ్మతల్లి భావన చక్కని నిదర్శనము!

దక్షిణాపథంలో గ్రామదేవతల కొలుపుల్లో 'సిడా' లేక 'సిడులెత్తడం' అనే ఆచారం చాల ప్రసిద్ధమైంది ఇది రాతియుగాలనుండి వస్తున్న సంప్రదాయం. పెద్ద బొంగు చివరనున్న ఇనుపకొక్కెనికి వీపు చర్మాన్ని గుచ్చుకొని ఆకాశంలో వేలాడడాన్ని 'సిడం' అంటారు. హింసాత్మకమైన ఆ ఆచారంలోని క్రూరస్వభావమే ఇది ఆదిమసంప్రదాయమనడాన్ని రుజువుచేస్తుంది. అదీకాక మధ్య ఇండియాలో ఛోటానాగపూర్ ప్రాంతంలోని 'గదబులు' అనే అనాగరిక జాతివారు ఈ ఆచారాన్ని పాటించడం కూడ ఇది అనాగరిక దశలనుండి వస్తున్నదనడానికి నిదర్శనం. గదబులు తాము రావణ వంశీయులమని చెప్పుకుంటారు. వారి స్త్రీలు రావణుని శ్లాఘిస్తూ పాటలు పాడుతూ నృత్యం చేస్తారు. సిడాన్ని వారు 'మేఘనాథ్' అంటారు. మేఘనాథుడు రావణుని కొడుకైన ఇంద్రజిత్తు బిరుదు. ఈ కార్యక్రమంలో గదబులు తమ పురోహితుడైన 'భూమకు'ని కొక్కెనికి గుచ్చి ఆకాశానికి ఎత్తి అతనిపై రకరకాల పండ్లు కాయలు విసిరి హింసిస్తారు. ఆంధ్రదేశంలో 'సిడం' అనాదిగా వస్తున్న ఆచారం. కాకతీయ రాజధానియైన ఓరుగల్లులో సిడం (క్రీ.శ. 1300 సం.లలో) అమలులో ఉన్నట్లు వినుకొండ వల్లభామాత్యుడు క్రీడాభిరామంలో చెప్పినాడు. మైలారభటు లనే శివభక్తులు ''గాలంపుగొంకి కంకాళ చర్మము గ్రుచ్చి యుదువీధి ఉయ్యెల లూగువారు'' అంటాడు వల్లభామాత్యుడు. శివరాత్రినాడు రథోత్సవం సందర్భంలోను ఈ ఆచారాన్ని తానువిజయనగర వీధుల్లో చూచినట్లు (క్రీ.శ. 1425) నికోలోకాంటే అనే ఇటలీ యాత్రి కుడు పేర్కొన్నాడు. కొద్ది మార్పులతో ఈ ఆచారం నేటికీ మనగ్రామాల్లో ఉంది. మనిషికి బదులు వేదు మేకను వేలాడదీయడం జరుగుతుంది. అయితే మహారాష్ట్రంలో మారుమూల గ్రామాల్లో నేటికీ సనాతన ధర్మంపట్ల విధేయులై మనిషినే వేలాడదీస్తున్నట్లు తెలుస్తుంది. వారి ధర్మప్రియత్వానికి జోహార్లు. ఈ ఆచారాన్ని గుంటూరు సమీపంలోని కొండపాటూరులో చూడడం జరిగింది. ఇనుప కొక్కెనికి వీపును గుచ్చి ఆకాశంలోనికి ఎత్తే సందర్భంలో బాధతో దయనీయంగా - విస్మయంగా హాహాకారాలు చేసే ఆ మేకను చూడడం స్వయంగా విధించుకున్న క్రూరశిక్ష. స్వర్గానికి మేక చేస్తున్న బాధామయయాత్ర త్వరలో పరిసమాప్తి కావాలనే జాలితో కాబోలు దాన్ని కొబ్బరి చిప్పలతో అరటికాయలతో స్త్రీ పురుషులు కొడుతూ ఉంటారు. అదొక దారుణ దృశ్యం. కొబ్బరి చిప్పలు పడి క్రింద త్రొక్కిసలాడు తూచేరిన వేలాది భక్తుల తలలు పగులుతాయనే విచక్షణ కూడ ఉండని వెర్రి వీరావేశం ప్రదర్శిస్తారు. దేవుని పేరుతో మానవుడెంతటి నీచమైన పాశవత్వానికి దిగజారుతాడో చెప్పటానికీ ఉదాహరణ చాలు. అహింసామూర్తులైన గౌతమ బుద్ధుడు, గాంధీజీ జన్మించిన పవిత్రభూమిలో ఆధునిక నాగరకత మధ్య జరుగుతూ ఉన్న ఈ అనాగరక క్రూర సంఘటనలు మన జాతి వ్యక్తిత్వంపై ఒక దారుణ విషాదవ్యాఖ్యానం.

'అమ్మతల్లి' భర్త తరువాతికాలంలో మనదేశంలో శివుడుగా పరిణామం చెందినాడు. ఈతడు హరప్పా సంస్కృతి అంతటి ప్రాచీనుడు (క్రీ.పూ. 3000). ఆనాడే ఆ దేవుణ్ణే

మహాయోగిగా - పశుపతిగా భావన చేసినారు. యోగాసనంలో జంతు పరివేష్టితుడైవున్న అతని బొమ్మలు మొహంజోదారోలో దొరికిన ముద్రలపై కన్పిస్తాయి. మరొక విశేషం! ఆ చిత్రాలలో ఆతడు ఊర్ధ్వరేతస్కుడుగా ప్రత్యక్షమౌతాడు! దీన్నిబట్టి ఆదిమ కాలంలో యోగాభ్యాసం వాజీకరణోపాయంగా భావించారని చెప్పవచ్చు. సింధునాగరికతా యుగం లోనే శక్తి శివులకు ప్రతినిధులుగా స్త్రీ పురుష జననేంద్రియాలను ఆరాధించే ఆచారం ప్రారంభమయింది. అనాదిగా అంటే హరప్పాయుగానికి ముందునుండే వస్తున్న మదనోత్స వాల నుండి ఆ ఆచారం సంక్రమించినట్లు కనిపిస్తుంది. ఈజిప్టు, క్రీట్, గ్రీస్ మొదలైన ప్రాచీన నాగరకతా కేంద్రాలన్నింటిలో మదనోత్సవాలు ఉండేవి. ఈజిప్ట్, గ్రీస్‌లలో యథార్థ జననేంద్రియాలనే పూజించేవారని తెలుస్తుంది. క్రీట్‌లో ఒక పీఠంమీద రెండు కొమ్ముల మధ్య నిల్పిన శిలాస్తంభాన్ని పూజించేవారు. ఇది మన శివాలయంలోని పానవట్టంలోని శివలింగాన్ని పోలివుండేది. శివాలయంలోని పానవట్టానికి మరొకపేరు 'యోని'.

'యోగము' స్త్రీ పురుష శక్తుల సమ్మేళన సిద్ధాంతము కలిపి తంత్రం అయింది. భారతదేశంలోని ముఖ్యమైన మతాలన్నీ తంత్రాన్ని అవలంబించినాయి. తంత్రాన్ని అనుసరించిన బౌద్ధమే వజ్రయానంగా రూపొంది పతనోన్ముఖమయింది. ఆదిశంకరాచార్యుల రచనగా భావిస్తున్న సౌందర్యలహరి శివశక్తుల సంయోగాన్ని గూర్చిన ప్రార్థనతో ప్రారంభమవుతుంది. ఆదర్శప్రాయమైన స్త్రీ పురుష శక్తుల సంయోగమే అర్ధనారీశ్వర భావానికి మూలము. నారాయణుడు సైతం లక్ష్మిని సర్వదా గుండెలమీద నిలుపుకుంటాడు గదా! ఆదిమ ప్రజలు మదనోత్సవాల సందర్భంలో స్త్రీ-పురుష స్వభావాలు కలిపి మూర్తీభవించిన దేవతలను ఆరాధించేవారు.

స్త్రీ పురుష దేవతల సంయోగాన్ని అంటే వివాహాన్ని ఆదిమప్రజలు ప్రతి సంవత్సరం సాధారణంగా పంటకాలంలో ఉత్సవంగా జరిపేవారు. ప్రాచీన మదనోత్సవ క్రీడలకు వ్యవసాయ పరిశ్రమకు సన్నిహిత సంబంధం ఉంది. మెసపొటేమియాలోని ఊర్ నగరదేవత 'పర్వతరాణి' (మనపార్వతి) ఆమెభర్త 'చంద్రు'నకు (మన చంద్రశేఖరుడు) ప్రతి సంవత్సరం కల్యాణం జరిపేవారు. అది ఐదువేల సంవత్సరాలనాటి మాట! నేటికీ మనదేశంలో ప్రతి దేవాలయంలోను ప్రతి సంవత్సరం తిరునాళ్ళు జరుపుకుంటూనే ఉన్నాముగదా శివాలయాలలో తిరునాళ్ళు సాధారణంగా పంటకాలంలోనే జరుగుతుంది

* * *

హిందువుల్లో జంతువులను, నరమృగ దేవతలను ఆరాధించడం నేటికీవుంది. వినాయక చతుర్థి, సుబ్బరాయషష్ఠి, నాగులచవితి మొదలైన పండుగలు అట్టి దేవతలకోసమేగదా మానవుడు అడవుల్లో తిరుగుతూ జంతువులను వేటాడుతూ గుహల్లో తలదాచుకొనే రోజుల్లో మృగాలను, నరసింహ విఘ్నేశ్వర వంటి నరమృగాలను పూజించడం ప్రారంభించి నాడు. ప్రపంచంలోని ప్రాచీన నాగరకతా కేంద్రాలన్నింటిలో ఇటువంటి దేవతల ఆరాధన వుండేది. క్రీట్, ఈజిప్టు దేశాలలో ఎద్దును పూజించేవారు. పర్వదినాల్లో ఎద్దును - ఎద్దు బొమ్మలను ఊరేగించేవారు. ఈజిప్టులోని "స్ఫింక్స్" మన నరసింహానికి మరొక రూపమే. హరప్పా సంస్కృతీ కేంద్రాలలో దొరికిన ముద్రలపై పలురకాల నరమృగదేవతలు - నరమేషం ఒక దేవతలో మానవముఖం, మేష శృంగాలు - నరవృషభం - నరశార్దూలం కన్పిస్తున్నాయి.

శార్దూల శరీరం కన్పిస్తాయి. హరప్పాలోని నరవృషభం వంటి దైవమే సుమేరియనులకు కూడ వుంది. ఆసియామైనర్‌లోని వెనీషియన్ వలస బిబ్లన్‌లోని (క్రీ.పూ. 3000)ని దేవాలయంలో నరమత్స్యం ఆరాధ్య దైవం! ఆ దేవాలయాన్ని దర్శించే యాత్రికులు స్త్రీపురుష భేదంలేకుండా తలనీలాలు సమర్పించేవారు. దాక్షిణాత్య దేవాలయాలలో ముఖ్యంగా తిరుపతిలో తలనీలాలను సమర్పించే ఆచారం గురించి చెప్పనక్కరలేదు. నానాటికి తిరుపతికి జనాదరణ పెరుగుతూ ఉంది.

*　　*　　*

మన మతాచారాలలో పితృదేవతారాధన మరొక ముఖ్యాంశం. ఇది పాతరాతియుగం చివరి దశలో ప్రారంభమయింది. పాతరాతియుగ మానవుడు మరణించిన తన బంధువులను తన నివాసంలోనే పూడ్చి పెట్టేవాడు. దక్షిణాపథంలో అటువంటి పాతరాతియుగ నివాస ప్రదేశాలు చాల బయల్పడినాయి. నవశిలాయుగంలో ''రాక్షస గుళ్ళు'' అనే సమాధులు నిర్మించి మృతదేహాలను అందులో ఖననంచేసేవారు. ఆంధ్ర, తమిళ, కర్ణాటక రాష్ట్రాలలో రాక్షసగుళ్ళు ఎక్కువగా బయల్పడినాయి. ఖననం చేసేటప్పుడు మృతులతోపాటు వారు జీవితంలో వాడిన వస్తుసామగ్రి ఆయుధాలు, వానితోపాటు ఆహారపదార్థాలు పాతిపెట్టేవారు. దీన్ని బట్టి రాతియుగ మానవులకు మరణానంతర జీవితంలో - మరణం తరువాత కూడ జీవించే 'ఆత్మ' వంటి పదార్థం ఒకటి ఉంటుందనే - విశ్వాసం ఏర్పడిందని తెలుస్తున్నది ఈజిప్టు నేలిన ఫారోలు తమకై 'పిరమిడు'లనే సమాధులు నిర్మించుకొనడానికీ విశ్వాసమే కారణం. ప్రపంచంలోని అత్యద్భుతాలలో పిరమిడు ఒకటి. అతి సామాన్యము నిరాడంబరము నైన శిలాయుగ పితృదేవతారాధనను ఆపస్తంబాది సూత్రకారులు విపులము ఆడంబరమునైన శ్రాద్ధకర్మగా రూపొందించినారు. రాక్షసగుళ్ళ నిర్మాణంలోని భావమే బౌద్ధులలో చైత్య నిర్మాణానికి మౌలికం అయింది. శైవులలో మృతులపేర శివాలయాలు నిర్మించే ఆచారానికి కూడ పై విశ్వాసమే కారణం. నేటికీ హిందువుల్లో మరణించిన తల్లిదండ్రులకు ప్రతి సంవత్సరం శ్రాద్ధాలు పెట్టే ఆచారం వుంది. పునర్జన్మ సిద్ధాంతంలో హిందువులకు గాఢ విశ్వాసం. ఐతే పునర్జన్మ సిద్ధాంతాన్ని, ప్రతి సంవత్సరం శ్రాద్ధ ఆచారాన్ని సమన్వయించడం కష్టం. ఎక్కడో జన్మించి సజీవంగా ఉన్నవారికే తద్దినాలు పెట్టడం జరుగుతున్నది.

*　　*　　*

భారతీయుల తాత్త్విక ఆలోచనా క్రమానికి కిరీట ప్రాయంగా వేదాంతాన్ని శ్లాఘించడం కద్దు. వేదాంతానికి బ్రహ్మ సిద్ధాంతం కీలకం. బ్రహ్మనే పరమాత్మ అనీ విశ్వాత్మ అనీ అంటారు. ప్రాచీన ఆర్యుల మతవిశ్వాసాలు సంహితలలో ప్రతిఫలిస్తాయి. వేదాలలోని అతి ప్రాచీన విభాగాలే సంహితలు. తరువాతి కాలంలో ఆర్యుల మతం చాల మార్పులకు లోనయింది. ఈ మార్పులు బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు అనే వేద విభాగాలలో కన్పిస్తాయి. సంహితలలోగానీ, బ్రాహ్మణాలలోగానీ 'ఆత్మ' సిద్ధాంతం ఉన్నదనడానికి స్పష్టమైన ఆధారం కన్పించదు. ప్రాచీనార్యులకు మరణానంతర స్థితిని గురించి కూడ ఇదమిద్ధమైన అభిప్రాయలు లేవు. 'మోక్షం' అనే భావం కూడ వారి మతంలో కన్పించదు. వారు పూర్తిగా ఇహలోక సుఖాలపట్ల శ్రద్ధ వహించిన 'లౌకికు'లనే చెప్పవచ్చు. కాగా ఉపనిషదాదులలో ఆత్మ పరమాత్మను గురించి తీవ్రంగా ఆలోచించినారు. ఉపనిషత్తులు వేదాలలో చివరిభాగాలు. అందుచేతనే ఉపనిషత్తుల ఆలోచనా విధానం వేదాంతంగా ప్రసిద్ధమైంది. సంహితల కాలానికి

(ఉ)పనిషత్తుల కాలానికి మధ్య వేయి సంవత్సరాల వ్యవధి ఉంది. ఈ కాలంలో ఆర్యుల సాంఘిక (ఆర్థి)క జీవితాలలో పెక్కు మార్పులు వచ్చినాయి. ఈ మార్పులన్నింటికీ దేశంలోని (ఆ)దివాసుల ఆర్యేతరుల విధానాలు ప్రసరించిన బలీయమైన ప్రభావమే కారణం. ఆర్యేతరులు ప్రాయికంగా భూతవాదులు (Animists); భూతవాదమే చిహ్నపూజ (totemism); మృగ, (పశు)మృగ దేవతారాధనకు మూలము. భూతవాదాన్ని గురించి పరిశోధన చేసిన టైలర్ (ప)ండితుని అభిప్రాయంలో భూతవాదం అంటే "విశ్వవ్యాప్తమైన భూతం (శక్తి) ఉనికిలోని (వి)శ్వాసమే." రిస్లే అనే పండితుని పరిశోధన ననుసరించి విశ్వాత్మ భావనలో నమ్మకమే (భూ)తవాదంలో విశ్వాసాలకు, సంప్రదాయాలకు, ఆచారాలకు కారణం. విశ్వాన్ని ఆవరించి (ఒ)క దివ్యశక్తి వుంది. ప్రపంచంలోని స్థావరజంగమాలన్నీ ఆ శక్తిలో భాగస్వాములనేదే (భూ)తవాదంలోని మూల సూత్రం. దీన్ని బట్టి ఆదిమ ప్రజల భూతవాదానికి ఉపనిషత్తుల (బ్ర)హ్మవాదానికి మధ్య పోలిక స్పష్టం. మతాచార్యులు పాండిత్య ప్రకర్షతో చేసిన భిన్న (వ్యా)ఖ్యానాల గారడీజోలికి పోక చారిత్రక రుజుదృష్టితో ఆలోచిస్తే ఆదిమ భూతవాదానికి (స్ప)ష్టమైన నాగరిక రూపాంతరమే ఆత్మవాదమని అంగీకరించక తప్పదు.

వేదాంతం ప్రకారం 'బ్రహ్మ' స్థిరము - శాశ్వతమైనది; మారనిది; మార్పులకు (అ)తీతమైనది. అదే పరమయథార్థం. భౌతిక ప్రపంచం బ్రహ్మ యొక్క బాహ్యరూపమే. ఇది (అ)శాశ్వతం. కేవలం మిథ్యయని వేదాంతం చాటుతుంది. ఇట్టి ప్రబోధాలవల్ల సాంఘికంగా, (నై)తికంగా ప్రమాదాలేర్పడతాయి. మౌలికమైన మార్పు ద్వారా అభివృద్ధి అసంభవం. (మా)నవుడు నిస్సహాయుడు అనే భావాలతో కూడిన నిరాశాపూరిత మనస్తత్వం ఏర్పడే (అ)వకాశం వుంది. ఆత్మవాదంలోని ఈ ప్రమాదాన్ని గుర్తించే చార్వాకులు, గౌతమ బుద్ధుడు (దా)నిపై ధ్వజమెత్తినారు. మానవస్వభావాన్ని, తద్వారా ప్రపంచాన్ని ఆదర్శప్రాయంగా (తీ)ర్చిదిద్దడం సాధ్యమనీ, ఆశక్తి మానవునిలోనే వున్నదనీ, స్వశక్తిలో విశ్వాసాన్ని, ఆత్మస్థై(ర్యా)న్ని ఉద్బోధించే అనాత్మవాదాన్ని ప్రచారం చేశారు. కాని వారి బోధనలన్నీ అరణ్యరోదనం (గా)నే పరిణమించాయి. అభ్యుదయ మార్గాన్ని సూచించిన వారి సిద్ధాంతాలు పరాజయం పొందినాయి. భావికాలం పిలుపును పెడచెవిని పెట్టి 'భూతకాల తమస్సుల దౌష్ట్యానికే జోహారులర్పించడానికి భారతీయులు నిర్ణయించారు!

★

# 10. భారతీయ వాస్తు సంస్కృతికి ముస్లిముల సేవ

## A. ఢిల్లీ సుల్తాన్ యుగ వాస్తువు

ఢిల్లీలో ముస్లిం రాజ్య స్థాపనతో మధ్యయుగ భారత సంస్కృతీ చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమయింది. పశ్చిమాన స్పెయిన్ మొదలుకొని ఉత్తరాఫ్రికా గుండా మధ్య ఆసియావరకు విస్తరించియున్న భిన్న సంస్కృతులలోని విశిష్టాంశాలను గ్రహించి పరిపుష్టి పొందుతూ నూతనోత్సాహంతో విజృంభిస్తూ ఉన్న ఇస్లాము సనాతనమైన భారతీయ సంస్కృతీ తారసిల్లినాయి. తత్ఫలితంగా మధ్యయుగం అంటే ఢిల్లీ సుల్తానుల కాలం, రాజకీయంగా తీవ్రమైన సంఘర్షణాత్మకమే అయినప్పటికీ, సాంస్కృతికంగా సామరస్య సమన్వయ ఉద్యమాలు కొనసాగి భారతీయ సంస్కృతికి నూతన చైతన్యాన్ని కలిగించిన యుగంగా పరిగణింపబడుతూవుంది. ఈ సమన్వయ సామరస్యాలు, ఈ చైతన్యమూ ఢిల్లీ సుల్తానులు పోషించిన వాస్తుకళా రీతిలో స్పష్టంగా ప్రతిఫలిస్తున్నాయి.

ఢిల్లీ సుల్తానులు సైనిక నియంతలుగా వ్యవహరించినప్పటికీ సారస్వతాన్ని, వాస్తు, లలితకళలనూ ఆదరించి పోషించినారు. భారత భూమిపై ఇస్లాం సాధించిన విజయానికీ, తమ సామ్రాజ్య వైభవానికీ, అధికార గౌరవాలకు చిహ్నాలుగాను, రక్షణగాను, పెద్ద పెద్ద మీనార్లు, దుర్గాలు, నగరాలు, ప్రాసాదాలు, మసీదులు (మాస్కులు), సమాధులు నిర్మించినారు. నేడు హిందూస్థాన్‌లో యాత్రికుల దృష్టిని ఎక్కువగా ఆకర్షించి ప్రశంసల నందుకొనే భవనాలలో ముస్లిం భవనాలే అధికసంఖ్యలో ఉన్నవనడం అతిశయోక్తి కాదు.

## ముస్లిం స్థాపత్యంలోని ప్రత్యేకతలు

ఢిల్లీలో ఇస్లాం సామ్రాజ్యాధికారాన్ని స్థాపించిన కుతుబుద్దీన్ భారతదేశంలో ముస్లిం స్థాపత్యాన్ని కూడా ప్రవేశపెట్టినాడు. నాటికే అరబ్ పారశీక తురుష్క సంప్రదాయాల మిశ్రమంగా తయారయింది ఇస్లాం స్థాపత్యం. ఈ సంప్రదాయాలనేగాక ఆయా దేశాలనుండి స్థపతులను శిల్పులను తమ కొలువుకు ఢిల్లీ సుల్తానులు ఆహ్వానించినారు. అందువల్ల చిరకాలంగా ఉంటున్న భారతీయ రీతికి భిన్నమైన పద్ధతులు దేశంలో ప్రవేశించినాయి. కాంక్రీటును వాడడం, దర్జు చేయడం, మీనార్, మినారెట్ నిర్మాణము ముస్లిములతోనే దేశంలో ఎక్కువగా ఆదరణ పొందినాయి. కమాను, గుమ్మటం, ఖోడకశీర్షం (Vault), ఆలంబిత వృత్త ఖండాలు, వృత్తఖండాలంకృత ద్వారాలు, అద్భుత వైవిధ్యం ఉన్న రేఖా కల్పనలతో, పుష్పలతా శిల్పాలతోను, శిల్పాలనే భ్రమకలిగించే ఆధ్యాత్మిక లేఖనాలతోనూ, మనోహరమైన కుడ్యవాతాయ జాలాలంకరణ ముస్లిం భవనాలలోని విశిష్టలక్షణాలు. కమాను వాడడంవల్ల, గుమ్మటాల కూర్పువల్లనూ విశాలమైన గంభీరమైన నిర్మాణాలు సాధ్యమయి నాయి. రంగురంగుల ఇటుకలు పెంకులు వాడడంకూడా ముస్లింరీతిలోని ప్రత్యేకత. ఈ ప్రక్రియలన్నింటితో భారతదేశ స్థాపత్యం సుసంపన్నం అయినదనడంలో అతిశయోక్తి లేదు.

## హిందూస్థానీ రీతి

ఆదినుండీ ముస్లింస్థాపత్యం భారతదేశంలో స్థానిక సంప్రదాయాల ప్రభావానికి లోనైంది. ప్రధానంగా ఆలయానికీ మసీదుకు చాల పోలికలున్నాయి. విశాలమైన ఆవరణ, ప్రాకారాన్ని అంటి సమానాంతరస్తంభ పంక్తులపై మంటపాలూ, శిల్ప అలంకరణ రెంటికీ సమాన లక్షణాలు. అందుచేత సుల్తానులు నాటి హిందూ జైన ఆలయాల పునాదులమీదనే సులభంగా మసీదులు నిర్మించినారు. స్తంభాలు మొదలుగా ఆలయసామాగ్రి యథాతథంగా ఉపయోగపడింది. ఢిల్లీలోని 'కువాట్ ఇస్లాం' ఇందుకు చక్కని నిదర్శనం. నాటి ముస్లిం కట్టడాలన్నీ ప్రాయికంగా హిందూ నిర్మాణాలేనన్ననే వాదం నేడు ప్రబలడానికి ఇదే కారణం.

విదేశాలనుండి స్థపతులను రప్పించినప్పటికీ సుల్తానులకు స్వదేశీయులైన శిల్పులను, కార్మికులను నియమించక తప్పలేదు. హిందూ జైన సంప్రదాయ రీతులలో సిద్ధహస్తులైన స్థానికులు తమ ప్రాచీన నైపుణ్యాన్ని కొత్త ప్రభువుల మతావసరాలకు అనుగుణంగా మార్చుకున్నారు. అదీగాక సుల్తానుల కట్టడాల్లో విరివిగా కన్పించే త్రిదళఖండ వృత్తం (trifoil arch) వ్యత్యస్త ఖోడకశీర్షం (inverted vault) అష్టభుజ నిర్మాణము హిందూ స్థపతులకు పూర్తిగా కొత్తవికావు. వీనిని సూచనప్రాయంగా భారతీయుల నుండి గ్రహించి పారశీకులు తమ నైపుణ్యంతో నిర్దుష్టమైన స్థాపత్య ప్రక్రియాలుగా రూపొందించి భారతదేశానికి అందించినారు. ఇన్ని చారిత్రక కారణాలవల్ల 'ఢిల్లీ సుల్తానుల కాలంనాటిది కేవలం పఠాన్ శైలి' అన్న ఫెర్గూసన్ అభిప్రాయంగానీ 'రూపాంతర హైందవస్థాపత్యమే' నన్న హావెల్ అభిప్రాయంగానీ సరైనవి కాదు. ఆ శైలిని 'దేశీయ విదేశీయరీతుల సమ్మేళనంద్వారా ఏర్పడిన 'వినూతన హిందూస్థానీ శైలి' అనడం సమంజసం!

హిందూస్థానీ వాస్తుశైలికి ఢిల్లీ నగరమే ప్రధానకేంద్రం అయింది. కాని రాష్ట్రపాలకులైన సర్దారులు స్థానికంగా ఉపలభ్యమైన సాధనసామగ్రినీ నైపుణ్యాన్నీ ఉపయోగించి, తమ అభిరుచులకు అనుగుణంగా భవనాలు నిర్మించడంతో బెంగాల్, మాళవ, గుజరాత్, బీదర్ లలో కొత్తకొత్త పోకడలతో రాష్ట్రీయరీతులు ఉదయించి వికసించినాయి ప్రతియుగంలోను స్థానిక భిన్నత్వం భారత సంస్కృతికి విలక్షణమైన అలంకారమయింది.

## ఢిల్లీ

సుల్తానుల పాలనలో ఢిల్లీ బహుముఖంగా వికసించింది. ప్రాచీన హిందూనగరానికి అనుబంధంగా సీరీ, తుగ్లకాబాద్, జహాపనా, ఫిరోజాబాద్ మొదలైన ఏడు నగరాలు నిర్మించి ప్రపంచంలోని ప్రసిద్ధ నగరాల్లో ఒకటిగా రూపొందించినారు. సుల్తానుల నిర్మాణాలు చాలవరకు ఢిల్లీలోనే, అందునా కుతుబ్‌మీనార్ చుట్టూ, కేంద్రీకృతమై వున్నాయి. ఢిల్లీని ఆక్రమించిన వెంటనే కుతుబ్ ఉద్దీన్ నాటిహిందూ దుర్గమైన ఖిలాయ్‌రాయ్ పిథౌరాలో ఇస్లాం విజయానికి చిహ్నంగా 238 అడుగుల ఎత్తయిన కుతుబ్ మీనార్ నిర్మించినాడు. దానికి సమీపంలోనే 'కువాట్ ఇస్లాం' అంటే 'ఇస్లాం శక్తి' అనే పేరుతో మసీదు నిర్మించినాడు. ఈ మసీదు చుట్టూ ఖండవృత్త ద్వారాలతో గంభీరమైన శిలా ఆవరణం ఉంది. కొరాన్ సూక్తులతో పుష్పలతలతో శిల్పాలతో ఈ ఆవరణం అంతా చాల మనోహరంగా అలంకరించ

బడింది. 'ఇందలి శిల్పాలలో లేఖనాలు మాత్రమే మొహమ్మదీయం. వీనిని వ్రాసింది ముస్లిం విద్వాంసుడే అయినా అలంకారం దిద్దిందిమాత్రం హిందూ శిల్పియే' నంటాడు సర్ జాన్ మార్షల్!

ఖిల్జీవంశం కాలంలో సుల్తానుల అధికారాన్ని దేశం అంతటా గౌరవించినారు. ఆ వైభవానికి అనుగుణంగా ఖిల్జీల నిర్మాణాలలో అలంకరణ వైచిత్రి పెరిగింది. కుతుబ్ మీనార్ సమీపంలో అల్లాఉద్దీన్ ప్రారంభించిన పెద్ద మాస్కు (మసీదు) నిర్మాణం పూర్తికాలేదు. కాని దానికి చెందిందే సుల్తాన్ పేరుతోనున్న అలాయ్ దర్వాజా. తెలుపు, ఎరుపు రంగుల పాలరాతితో కట్టిన ఈ దర్వాజా సుల్తాన్ యుగనిర్మాణాలన్నింటిలో మణిపూస వంటిది.

తుగ్లక్ వంశస్థులు సనాతన నిష్ఠాపరులు. అందుచేత వారి భవనాలలో స్థూల గాంభీర్య గుణాలు ఎక్కువ. కాని నిర్మాణ విధానంలో కొత్తపోకడలు కన్పిస్తాయి. దుర్భేద్యమైన దుర్గాన్నిపోలి నిర్మించిన ఘియాస్ ఉద్దీన్ తుగ్లక్ సమాధి గుమ్మటంమీద హిందూ ఆలయ విమానంపైనవలె ఆమలకము కలశమూ వాడబడినాయి. ఫిరోజ్‌షా తుగ్లక్ మంత్రియైన ఖానెజెహాన్ తెలంఘాణీ సమాధిని సనాతన చతుర్భుజ సంప్రదాయానికి విరుద్ధంగా అష్టకోణా కృతిలో నిర్మించినారు. ఈ నిర్మాణ పద్ధతి లోడీల కాలంలో గుల్‌దస్తాలు, చప్పరాలు చేర్చుకొని వికసించి ససారాంలోని షేర్‌షా సూర్ సమాధిలో పరిణితి చెందింది.

## రాష్ట్రీయ రీతులు

సుల్తానులను అనుకరిస్తూ వారి సర్దారులు తమతమ రాష్ట్రాలలో పెద్దపెద్ద భవనాలు నిర్మించినారు. బెంగాల్ పాలకుల కట్టడాలు చాలవరకు లఖ్నౌతీ, పాండువా, గౌర్ నగరాలలో ఉన్నాయి. వీనిలో గౌర్‌లోని ఛోటాసోనా, బారాసోనా మసీదులు, పాండువాలోని అదీనా మసీదు చాల ప్రసిద్ధమైనవి. అదీనా మసీదులో నాల్గువందల గుమ్మటాలు ఉన్నాయంటే ఆ మసీదు పరిమాణాన్ని సులభంగా ఊహించవచ్చు.

గుజరాత్ ప్రభువుల పోషణలో అనహిల్ పట్టణం, బ్రోచ్, కాంబే, చాంపనేర్, అహమ్మదా బాద్ నగరాల్లో గొప్ప నిర్మాణాలు వెలసినాయి. ఫెరిస్టా మాటల్లో 'అహమ్మదాబాద్ హిందూస్థాన్‌లోనేగాక ప్రపంచంలోనే సుందరమైన నగరం.' ఇచటి నిర్మాణాలన్నింటిలో జామీ మసీదు, రాణీ సేవరీ మసీదు చాల అందమైనవి. వీని కుడ్య వాతాయన జాలాల జిలుగు పనితనంలో స్థానిక హిందూ జైన శిల్పుల నైపుణ్యం ప్రత్యక్షమవుతుంది. జామీమసీదుకు, కుంభరాణారన్పూర్‌లో నిర్మించిన దేవాలయానికీ చాల పోలికలున్నాయి.

మాళవ రాష్ట్రీయ శైలికి మాండు కేంద్రం. కమల్‌మౌలా మసీదు, జోహాజ్ మందిర్, హిందోళా మహల్, రూప్‌మతీ బాజ్ బహదూర్‌ల ప్రణయగాథలతో పులకించిన మంది రాలూ అసంఖ్యాకంగా వున్నాయి. హిందోళా మహల్ అంటే 'ఉయ్యాలమందిరం' అని అర్థం. గోడలను ఆరోగుగా నిర్మించడవల్ల మహల్ ఊగుతున్నదనే భ్రమగలుగుతుంది. ఈ నమూనామీదనే మొహమ్మద్ బీన్ తుగ్లక్ ఓరుగల్లులో దర్బార్ మహల్‌ను నిర్మించి నాడు. దౌలతాబాద్‌లోని చాంద్‌మందిర్ కూడా ఇదే నమయానికి చెందింది.

దక్షిణ భారతంలో హిందూస్థానీ రీతికి బహమనీ రాజధానులైన గుల్బర్గా, బీదర్లు కేంద్రాలయినాయి. బహమనీ నిర్మాణంలో పారశీక సంప్రదాయాలు ఎక్కువ కన్పిస్తాయి. గుల్బర్గాలోని జామీమసీదు కోర్డోవామసీదుకు అనుకరణ. బీదర్ లో రంగీన్‌మహల్, గవాన్ మదర్సాలు ప్రసిద్ధ నిర్మాణాలు. సమర్ ఖండ్ లోని మదర్సాను అనుకరిస్తూ గవాన్ మదర్సాను నిర్మించినారు. మూడంతస్తుల ఈ మదర్సాలో పెద్ద గ్రంథాలయం, విద్యార్థులకు ఉపాధ్యాయులకు వసతి సౌకర్యాలు ఉండేవి. గుల్బర్గాలోని సుల్తానుల సమాధులు సైతం ప్రశస్త వాస్తు కళాఖండాలే.

బహమనీ రాజ్యం ద్వారా హిందూస్థానీ శైలి ప్రభావం విజయనగర రాజ్యంలో ప్రవేశించింది. దీని ప్రభావం హంపీ శిథిలాల్లో నేటికీ నిలిచియున్న పద్మమహల్, గజశాలల్లో స్పష్టంగా ప్రతిఫలిస్తుంది.

ఈ విధంగా ఢిల్లీ సుల్తానుల పోషణలో వికసించిన హిందూస్థానీ వాస్తుశైలి దేశవ్యాప్తమైన ప్రభావాన్ని ప్రదర్శించి మొగలాయీల కాలంలో ఆగ్రా, సిక్రీ నగరాల్లో అత్యున్నతస్థాయికి చేరుకున్నది.

## B. మొగలాయి వాస్తువు

భారతీయ సంస్కృతికి సేవచేసిన ముస్లిం రాజవంశాలన్నింటిలో అగ్రగణ్యులు మొగలాయిలు. క్రీస్తుశకం 1526 నుండి సుమారు రెండు శతాబ్దాల పాలనకాలంలో దేశంలో అధికభాగాన్ని జయించి రాజకీయ ఐక్యాన్ని సాధించడమేగాక ప్రజలలో సాంస్కృతిక సమైక్యాన్నికూడా సాధించడానికి మొగలాయీలు ప్రయత్నించినారు. ఢిల్లీ, ఆగ్రా, సిక్రీ, లాహోర్ మొదలైనచోట్ల ప్రసిద్ధములైన పెద్ద కట్టడాలనేకం నిర్మించి మొగలాయీ లొక వాస్తు మహాసామ్రాజ్యాన్ని సృష్టించినారు. నేటికి ఈ వాస్తుసామ్రాజ్యం జీర్ణదశలో ఉన్నప్పటికీ ఒకనాటి మొగల్ అధికార వ్యాప్తి వైభవాలకు వారు అనుసరించిన జాతీయ విధానాలక దర్పణంగా ఉపకరిస్తున్నది.

వాస్తవానికి భారతీయ ముస్లిం వాస్తుచరిత్రలో మొగలాయీలు నూతన యుగా సృష్టించలేదు. వారి రాకకు పూర్వమే ఢిల్లీ సుల్తానులు బహమనీ సుల్తానులు దేశం మాస్కులు, మసీదులు, సమాధులు అనేకం నిర్మించినారు. వీరి నిర్మాణపద్ధతి అరబ్, పారశీక, తురుష్క సంప్రదాయాలు, స్థానిక హిందూ సంప్రదాయాలు కలిసి యేర్పడిన విశిష్టరీతి. ఇందులో కమాను, గుమ్మటం, కుడ్యవాతాయన శిలాజవనికలు, ప్రణిధాలంకరణ మొదలైన అంశాలు విశేష వ్యాప్తి గాంచినాయి. ఈ పద్ధతినే మొగలాయీలు అనుసరించినారు. ఐతే మొగలాయి వాస్తువులో వ్యక్తిత్వం లేకపోలేదు. ఢిల్లీ సుల్తానుల కట్టడాలు పరిమాణంతో స్థూలమైనవి, గుణంలో నిరాడంబరమైనవి. మొగలాయీల నిర్మాణాలు పరిమాణంలో ఢిల్లీ సుల్తానుల కట్టడాలకు తీసిపోవు; కాని, సౌందర్యంలో నాజూకైన అలంకరణలో పరిపూర్ణ త్వాన్ని సాధించినాయి. మొగల్ పోషణలో ముస్లిం వాస్తుకళా కౌశలం పరాకాష్ఠనందు ముస్లిం దేశాలన్నింటిలోని భవనాలను తలదన్నగల భవనాలను నిర్మించింది. అందుచేతనే భారతీయ ముస్లిం వాస్తు చరిత్రలో మొగల్‌యుగం తేజోవంతమైన ఫలప్రదమైన గ్రీష్మరుతువుగా కీర్తింపబడుతుంది.

## ప్రారంభదశ

మొగలాయీ స్థాపత్యం అక్బర్ కాలంనాటికి గాని నిర్దుష్టమైన రూపాన్ని సంతరించుకొన లేదు. కాని సామ్రాజ్యానికివలెనే మొగల్ నిర్మాణాలకు సయితం బాబర్ హుమాయూన్‌లే బీజాలు నాటినారు. షాజహాన్ కాలం నాటికది స్వర్ణయుగాన్ని సృష్టించింది. ఔరంగజేబు పరిశుద్ధ సున్నీ సనాతనత్వం ఫలితంగా నీరసించి క్షీణించింది.

సామ్రాజ్య స్థాపకుడైన బాబర్ గొప్ప కళారాధకుడు. నిర్మాణాలలో ఆసక్తి ఉన్నవాడు. స్థానికమైన హిందూస్థానీ రీతిలోని కల్పన అతనికి నచ్చలేదు. కాని స్థపతుల నిర్మాణ కౌశల్యం అతణ్ణి ఆకర్షించింది. ఈ రీతిని సంస్కరించాలనే ఆతని ప్రణాళిక కాలవ్యవధిలేని కారణంగా ఫలప్రదం కాలేదు. ఐనప్పటికీ ఆగ్రా, సిక్రీ, గ్వాలియర్ మొదలైన చోట్ల వందలకొలది శిల్పులాతని పోషణలో పనిచేస్తూ ఉండేవారని బాబర్ స్వీయగాథలవల్ల తెలుస్తున్నది. బాబర్ కుమారుడు పేరుకు హుమాయూనే గాని వాస్తవానికి దురదృష్టవంతుడు. జీవితంలో అధికభాగం కాందిశీకుడుగానే గడిపినాడు. ఆతడే 'దిన్‌పనా' అంటే 'ప్రపంచ శరణ్యం' అనే పేరుతో కొత్త నగరాన్ని ప్రారంభించినాడు గాని దాన్ని షేర్‌షా నిర్మూలించినాడు.

షేర్‌షా : పాలన విధానంలోనేగాక వాస్తురీతిలో అక్బర్ చక్రవర్తికి షేర్‌షాయే మార్గదర్శకుడు ససారాంలో షేర్‌షా నిర్మించుకొన్న సమాధి ఈయుగ నిర్మాణాలన్నింటిలో మణిపూస వంటిది. సరోవరం మధ్యలో అలలపై తేలియాడుతున్నట్లు నిర్మింపబడి ఖండవృత్తద్వార శోభితమైన ఐదంతస్తుల ఈ నిర్మాణం ఆకారంలో ముస్లిం, ఆంతర్యంలో హైందవము. అది నాటి మతసమన్వయ ఉద్యమానికి నిదర్శనం. ఢిల్లీలో షేర్‌షా ప్రారంభించిన 'పురాణ కిల్లా'ను హుమాయూన్ నిర్మూలించినాడు. దీన్నిబట్టి మొహమ్మదీయులు ఇతర మతస్థులవేగాక స్వీయమతస్థుల నిర్మాణాలను సైతం నిర్మూలించారని తెలుస్తున్నది. ప్రజలలో పూర్వ స్మృతులను తుడిచిపెట్టాలనే నిరంకుశ ప్రభువుల మనస్తత్వమే ఈ సంప్రదాయానికి కారణం అని చెప్పవచ్చును.

అక్బర్ : అక్బర్ కాలంలో మొగల్ సామ్రాజ్యం సుస్థిరమై విస్తరించి మహదైశ్వర్యవంతమైనం దున భారీయెత్తున నిర్మాణ కార్యక్రమం సాగించడానికి అవకాశం లభించింది. అక్బర్ కూడా వాస్తువిద్యలో అభిమానం వహించి తన జాతీయ ఆశయాలకు అనుగుణమైన శైలిని స్వయంగా తీర్చిదిద్దినట్లు తెలుస్తుంది.

అక్బర్ కాలంలో మొదటి ప్రముఖ నిర్మాణం ఢిల్లీలో హమాయూన్ సమాధి. అది పారశీక భారతీయరీతుల సమ్మేళనమనీ, పారశీక కల్పనకు భారతీయ వ్యాఖ్యానమనీ విమర్శకులు వర్ణిస్తారు. ఈ సమాధిపీఠం కేవలం భారతీయము. పైని గుమ్మటం మాత్రం సమర్‌ఖండ్ లోని తైమూర్ సమాధి గుమ్మటానికి అనుకరణ. ఈ సమాధిలో రెండు కొత్త అంశాలు కన్పిస్తాయి. మొదటిది : విశాలమైన ఉద్యానవన నిర్మాణంలో సైతం చూపిన శ్రద్ధ. పతాక శిలల బాటలతో సరోవరాలతో జలయంత్రాలతో చప్పరాలతో అంతస్తులుగా నిర్మింపబడిన వారి ఉద్యానవనాలు సైతం వాస్తు కళాఖండాలనడం సందేహంలేదు. ఇక రెండో అంశం : సమాధికి నాలుగు వైపులా గంభీరమైన ఖండ వృత్తద్వారాలున్న దర్వాజాలు. ఈ రెండు అంశాలు తరువాతి నిర్మాణాలకు మార్గదర్శకాలయినాయి.

అక్బర్ చక్రవర్తి ఆగ్రా, ఫతేపూర్ సిక్రీ, అలహాబాద్, లాహోర్ మొదలైన దుర్గాలు అందలి రాజప్రాసాదాలను నిర్మించినాడు. ఒక్క ఆగ్రాకోటలోనే ఐదు వందల మందిరాలు నిర్మించినాడట! వానిలో జహంగీర్ మందిర నిర్మాణం విశిష్టమయింది. ఇందులో ముస్లిముల కమాను పద్ధతిగాక హిందువులకు సాధారణమైన దూలాలను వాడే పద్ధతి అనుసరింపబడింది. అంతేగాక కొరాన్ నిబంధనలకు విరుద్ధంగా కుడ్యజవనికలలో మనోహరములైన పశు పక్షి శిల్పాలు ఈ మహల్ లో కన్పిస్తాయి. లాహోర్ కోటలోని మందిరాల్లో కూడా ఇట్టి శిల్పాలను ప్రయోగించినారు. శిల్పులు ప్రదర్శించిన ఈ స్వేచ్ఛకు అక్బర్ సహన విధానమే కారణమని వేరే చెప్పనక్కరలేదు.

అక్బర్ తాత్కాలిక రాజధానియైన ఫతేపూర్ సిక్రీలోని భవనాలకు అతడే రూపకల్పన చేసినాడు. వీనిలో ప్రసిద్ధములైన జోద్‌బాయ్, బీర్బల్ మందిరాలు గుజరాత్‌లోని హిందూ జైన దేవాలయాలకు అనుకరణలుగాను, పంచమహల్ బౌద్ధ విహారానికి అనుకరణగాను నిర్మించినారు. ఇచటి 'జామీ మసీదు'ను 'రాలలో రచించిన భావకవిత్వం' అంటూ ఫెర్గుసన్ వర్ణించినాడు.

సిక్రీ నిర్మాణాలన్నింటిలో తలమానికం వంటిది 'బులంద్ దర్వాజా'. 176 అడుగుల ఎత్తు 130 అడుగుల వెడల్పు గలిగి శక్తిగాంభీర్యా లుట్టిపడే ఈ దర్వాజా గుజరాత్ ఆక్రమణకు అభినందనగా నిర్మింపబడింది. ఈ దర్వాజాపై ఏసుక్రీస్తు బోధన ఒకటి చెక్కినారు. ఇట్టి ఉదార వాతావరణంలో అక్బర్ ఉదార రాజనీతికి గీటురాయియైన దిన్ ఇ ఇలాహి జన్మించడంలో ఆశ్చర్యంలేదు.

**జహాంగీర్ :** జహాంగీర్ కాలంలో రెండే నిర్మాణాలు వెలసినప్పటికి వానిలో ఒక వైశిష్ట్యం గోచరిస్తుంది. వీనిలో మొదటిది సికింద్రాలోని అక్బర్ సమాధి. ముస్లిం పద్ధతికి విరుద్ధంగా గుమ్మటంలేని ఈ సమాధిని బౌద్ధ విహారానికి అనుకరణగా భావిస్తారు. ఎర్రరాయి, పాలరాయి రెండూ ఉపయోగించడం, సమాధికి నాల్గువైపులా ఎత్తయిన మీనారెట్ల నిర్మాణము ఈ సమాధిలోని విశేషాలు. ఉత్తర ఇండియాలో ఇట్టి మీనారెట్లను నిర్మించడం ఇదే మొదలు. ఇక రెండో నిర్మాణం నూర్జహాన్ తనతండ్రి ఇత్మద్ ఉద్దౌలాకై ఆగ్రాలో నిర్మించిన సమాధి. ఎర్రరాతి ప్రాకారం మధ్య ఉద్యానవనంలో నిర్మింపబడిన ఈ పాలరాతి సమాధి వజ్రాల బరిణలో పొదిగిన మంచి ముత్యంలా కన్పిస్తుంది. ప్రణిధాలంకరణలో అమూల్యములైన వజ్రవైఢూర్యాల నుపయోగించడం ఇందులోని మరో ముఖ్యవిశేషం. మొగల్ వాస్తు చరిత్రలో సౌష్టవదశ సమాప్తమై సౌకుమార్యదశ ప్రారంభమైనట్లు ఈ సమాధివల్ల స్పష్టమవుతుంది.

**షాజహాన్ :** మొగలాయి లందరిలో గొప్ప నిర్మాత షాజహాన్. ఇతణ్ణి రోము నగరాన్ని పాలరాతి నగరంగా రూపొందించిన ఆగస్టస్‌తో పోలుస్తారు. అందుకు తగినట్లుగానే ఆగ్రా, ఢిల్లీ లాహోర్‌లలో పాలరాతి భవనాలనేకం నిర్మించినాడు షాజహాన్. ఆగ్రాలో నితడు నిర్మించిన మోతీమసీదు, ముసమ్మాన్ బురుజులలో మొగల్ వాస్తువిజ్ఞానం ఉన్నత స్థాయినందుకున్నది. ఢిల్లీలోని ఎర్రకోటను, అందులోని మోతీమహల్, రంగమహల్, దివాన్ ఇ ఖాస్, దివాన్ ఇ అమ్‌లను నిర్మించినది షాజహానే. 'స్వర్గంలోని భవనాలకంటే అందమైనది రంగమహల్' అని సమకాలిక కవి వర్ణించినాడు. 'భూమిపై ఆనందమయమైన స్వర్గమే ఉంటే అదే ఇది' అంటూ దివాన్ ఎ ఖాస్ గోడపైని లేఖనం అక్షరాలా యదార్థమని కళాకోవిదుల

తీర్మానము. దివాన్ ఎ ఆమ్ దర్బారు మందరం. సుప్రసిద్ధమైన నెమలి సింహాసనము ఇందులోనే అమర్చబడింది. వజ్రవైడూర్యాలు పొదివి బంగారంతో ఈ సింహాసనాన్ని తయారు చేసినారు. ఎర్రకోటకు ఎదురుగానున్న జామై మసీదు సైతం షాజహాన్ నిర్మించిందే.

మొగలాయి వాస్తువుకు శిరోరత్నం తాజ్‌మహల్. దీన్ని షాజహాన్ తన పట్టపుదేవి ముంతాజ్‌మహల్ సమాధిపై ఆగ్రాలో యమునానది ఒడ్డున స్వచ్ఛమైన పాలరాతితో నిర్మించినాడు. కల్పనలో, రచనలో, సాధనసామాగ్రిలో అలంకరణలో ఏమాత్రము పొచ్చెము లేని తాజ్‌మహల్ ప్రాచ్య పాశ్చాత్య వాస్తురీతుల సమ్మేళనం. ఇందులోని నిర్మాణం ముస్లిము లది; అలంకరణ హిందువులది. కాని ప్రపంచ వాస్తువిద్య సాధించిన అత్యద్భుతాలలో నొకటి తాజ్ అనడం నిర్వివాదాంశం. అందుచేతనే పాలరాతితో మలచిన 'స్వప్న సౌందర్యము'నీ 'ప్రణయగీతము'నీ విమర్శకులు తాజ్‌ని కొనియాడుతూ ఉంటారు.

## చరమదశ

షాజహాన్ తరువాత అచిరకాలానికే మొగల్ వాస్తువు క్షీణించింది. ఔరంగజేబుకు వాస్తువిద్యలో అభిరుచిలేదు. ఔరంగాబాద్‌లో ఔరంగజేబు నిర్మించిన రాణీ రబియా ఉద్దౌరానీ సమాధిలోను, లాహోర్‌లోని బాద్‌షాహీ మాస్క్‌లోనూ ఈ క్షీణత ప్రతిఫలించింది. క్రమంగా 18వ శతాబ్ది చివరికి మొగల్ వాస్తువులో కల్పనగానీ రచనా కౌశలంగానీ అలంకరణగానీ మృగ్యమయింది.

## జాతీయరీతి

ఏమయినప్పటికీ షాజహాన్ పోషణలో తయారైన వాస్తురీతి దేశవ్యాప్తమైన ప్రభావాన్ని ప్రదర్శించింది. హిందూ క్షేత్రాలైన మథుర, బృందావన్ దేవాలయాల్లోనూ, బికనీర్, జోథ పూర్ నగరాలలోని రజపుత్ర ప్రాసాదాల్లోను ఈ ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. ఒక్క మాటలో అక్బర్ ఆశించిన భారత జాతీయతకు ప్రతీక అయినది మొగలాయి వాస్తువు.



# అనుబంధము

1. సుప్రసిద్ధ చరిత్రకారుడు
డా॥ బి.యస్.యల్. హనుమంతరావు

- 'మిసిమి' మాసపత్రిక

2. చరిత్రకు అంకితమైన మనీషి

- ఆంధ్రప్రతిక

3. Professor B.S.L. HANUMANTHA RAO

- Proceedings of the Indian History Congress

'మిసిమి' సెప్టెంబరు 1993

# సుప్రసిద్ధ చరిత్రకారుడు
# డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు

ఆంధ్రుల చరిత్రను, సంస్కృతిని శాస్త్రీయ దృష్టితో, మానవత దృక్పథంతో పరిశోధన చేసిన సమకాలిక ఆంధ్ర చరిత్రకారులలో డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు సుప్రసిద్ధులు. "తారీఖులు, దస్తావేజులు ఇవి కాదోయ్ చరిత్ర సారం" అన్నట్టు ఆంధ్రుల చరిత్ర రచనలో, పరిశోధనలో సాంస్కృతిక, రాజకీయ, ధార్మిక, మత విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వాలని అప్పుడే అది చరిత్ర రచన అవుతుందని భావించిన శాస్త్రీయ చరిత్రకారులలో ఆయన ప్రత్యేకస్థానం ఆక్రమిస్తారు. "చరిత్ర కేవలం రాజకీయ సంఘటనల పట్టికకాదు. భిన్నరంగాల్లో మానవకృషి, ఆ కృషి ఫలితంగా మానవజీవితంలో దృక్పథంలో వచ్చిన పరిణామాలు అంటే నాగరికతా, సంస్కృతుల కథనం" అని చరిత్రని వ్యాఖ్యానించిన డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు జూన్ 8వ తేదీన హైదరాబాద్‌లో మరణించారు. చివరిక్షణం వరకు తాను సత్యమని నమ్మిన చారిత్రక యధార్థాలని తన రచనలద్వారా నిర్మొహమాటంగా వెల్లడించిన ధైర్యశాలి ఆయన. 1946 సంవత్సరంనుంచి వివిధ విద్యాలయాల్లో, హైస్కూల్ టీచర్‌గా (కూచిపూడి హైస్కూల్), కళాశాల అధ్యాపకుడిగా (గుంటూరు హిందూ కళాశాల), విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా (నాగార్జున విశ్వవిద్యాలయం) పనిచేసిన డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు చరిత్ర బోధనలో, రచనలో, పరిశోధనలో లౌకికవాదిగా, మానవతా వాదిగా తనదైన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలుపుకొన్నారు. అనర్ఘళం, అనితరసాధ్యం నామార్గం అనిపించుకున్నారు. నిజానికి సమకాలిక ఆంధ్ర చరిత్రకారులలో అరుదైన వ్యక్తిత్వం ఆయనది.

"మంచి గతమున కొంచెమేనోయ్" అన్న మహాకవి గురజాడ విమర్శనాత్మక దృష్టితో, శాస్త్రీయ దృక్పథంతో కులమత సమస్యలను విశ్లేషించి కరుడుగట్టిన ఆ సామాజిక వ్యవస్థలపై నిశితమైన విమర్శ చేశారు. కులమత సమస్యల్ని తీవ్ర సమస్యలుగా పరిగణించటమే కాకుండా, వాటిని మూలంనుండి పరిశోధన చేసిన వారు సమకాలిక ఆంధ్ర చరిత్రకారులలో మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. కేవలం ప్రచారం కోసమో, లేక ఏదో ఒక కులంపైనో, వర్గంపైనో కోపంతోనో కులమత సమస్యల్ని విమర్శించలేదు. నిజమైన మానవవాదిగా కుల, మత, వర్గ, ప్రాంతీయ పరిధులుదాటి మానవ వ్యక్తిత్వం ఎదగాలని ఆకాంక్షించిన మానవవాద చరిత్రకారుడు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు. ఆయన కేవలం చరిత్రకారుడు మాత్రమే కాదు. సాహిత్యవేత్త, ఉత్తమ అనువాదకుడు. తెలుగు భాషా సాహిత్యాలలో లోతైన కృషి చేశారు. ఆ సాహిత్య పరిజ్ఞానాన్ని, పాండిత్యాన్ని చరిత్ర రచనకు సాధనంగా ఉపయోగించుకున్నారు. ఆంధ్రుల చరిత్రపై ఆయన రచనకేవలం చరిత్ర గ్రంథంగానే కాకుండా సాహిత్య గ్రంథంగా కూడా కొనియాడబడింది. అందువల్లనే క్షేత్రయ్య, రామదాసు, వేమనల కవిత్వాన్ని గూర్చి ఇలా అనగలిగారు: "క్షేత్రయ్యలో పచ్చి శృంగారానికీ, రామదాసులో భక్తి పారవశ్యానికి

సాధనమైన కవిత్వం వేమనలో నీతి బోధకు సంఘ సంస్కార ప్రబోధానికి సాధనమయింది'' (ఆంధ్రుల చరిత్ర పే. 486). ఆయన చరిత్ర రచనల్లో పేర్కొనతగినవి (1) RELIGION IN ANDHRA (ఆంధ్రలో మతం). (2) ఆంధ్రుల చరిత్ర (ప్రాచీన, మధ్య యుగాలు). (3) THE AGE OF SATAVAHANAS (శాతవాహన యుగం) (4) INDIAN HISTORY AND CULTURE (భారతీయ సంస్కృతి - చరిత్ర). (5) GUNTUR THROUGH AGES (యుగ యుగాల్లో గుంటూరు). (6) భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన. ఇవేకాకుండా ఆముద్రిత రచనలు కొన్ని ఉన్నాయి. అవి (1) ఆంధ్ర దేశంలో బౌద్ధ, జైన మతాలు. (2) BUDDHIST INSCRIPTIONS OF ANDHRA (ఆంధ్రదేశంలోని బౌద్ధ శిలాశాసనాలు). (3) SOCIAL MOBILITY IN MEDIEVAL ANDHRA (మధ్య యుగ ఆంధ్రలో సామాజిక చలనం). ఇంకా అసంఖ్యాకమైన రేడియో ప్రసంగాలు, వివిధ పత్రికల్లో ప్రచురించబడిన తెలుగు, ఆంగ్ల వ్యాసాలు, వివిధ సభల్లో చేసిన ప్రసంగవ్యాసాలు చాలా ఉన్నాయి. ఆయన చేసిన ప్రసంగ వ్యాసాల్లో ప్రత్యేకంగా పేర్కొనవలసినవి సమకాలిక ప్రాధాన్యత కలిగినవి రెండు ఉన్నాయి. అవి (1) FORMATION OF SOCIAL GROUPS AND MUTUAL RELATIONS IN ANDHRA (సామాజిక సమూహాల ఆవిర్భావం ఆంధ్రలో వాటి పరస్పర సంబంధం). (2) భారతదేశంలో కులవ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలు. ఈ రచనల్లో డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు సత్యాన్వేషణా దృష్టి, మానవతా దృక్పథం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది.

ఆంధ్ర ప్రజా జీవితంపై బౌద్ధ, జైన మతాలు కలిగించిన ప్రభావాన్ని గూర్చి ఆయన సాధికారికమైన కృషి చేశారు. డా॥ బి.ఎస్.ఎల్.కి అవైదిక, అబ్రాహ్మణ మతాలైన బౌద్ధ, జైన మతాలపై ప్రత్యేకమైన అభిమానం, ఆసక్తి ఉన్నాయి. అందువల్లనే ఆంధ్రలో ప్రజా ఉద్యమాలుగా విస్తరిల్లిన బౌద్ధ, జైన మతాల్నిగూర్చి విశేషమైన కృషిచేసి సాధికారికమైన పరిశోధన ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' (ఆంధ్రలో మతం) అనే గ్రంథాన్ని 1973లో వెలువరించారు. కర్ణాటక్ విశ్వవిద్యాలయానికి పి.హెచ్.డి డిగ్రీ కొరకు 1969-70 సంవత్సరాల్లో సమర్పించిన సిద్ధాంత వ్యాసమే ''ఆంధ్రలో మతం'' అనే గ్రంథం. దీనిలో అతి ప్రాచీనకాలం నుండి క్రీ.శ. 1325 వరకు ఆంధ్రదేశంలో సంభవించిన మతపరిణామాల్ని అవలోకనం (Survey) చేశారు. ఆర్య వాఙ్మయంలో, బ్రాహ్మణ సాహిత్యంలో అనార్యదేశంగా, మ్లేచ్ఛ దేశంగా పరిగణింపబడ్డ ఆంధ్ర దేశంలోకి ప్రవేశించిన బ్రాహ్మణ మతం, బౌద్ధం, జైనం, హిందూ మతాలగూర్చి లోతైన అధ్యయనం దీనిలో కనిపిస్తుంది. ముఖ్యంగా బౌద్ధ, జైన ధర్మాలగూర్చి ఈ గ్రంథంలో ఆయన వెల్లడించిన అనేక చారిత్రక వాస్తవాల వల్ల దీనికి పండితలోకంలో విశేషమైన ఖ్యాతి లభించింది. జీన్ ఫిలియో జాట్, వి.వి. గోఖలే, జి.ఎన్. దీక్షిత్, ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తివంటి భిన్నశాఖలకి చెందిన పండితుల, మేధావుల ప్రశంసని ఈ గ్రంథం పొందింది. ఈ గ్రంథాన్ని గూర్చి ప్రొఫెసర్ జి.ఎన్. దీక్షిత్ (కర్ణాటక విశ్వవిద్యాలయం) ఇలా అన్నారు: ''ఆంధ్రలో బౌద్ధమతం పుట్టుక, పెరుగుదల, పతనాల గూర్చి డా. హనుమంతరావు చేసిన పునర్నిర్మాణం చాలా గొప్ప ప్రశంసకు తగియున్నది. బౌద్ధ ధర్మ అధ్యయనం అనేది అంతర్జాతీయంగా ఆసక్తి కలిగిన విషయం కాబట్టి ఆయన రచనలోకి ఈభాగం (బుక్-II) భారత దేశానికి అవతల (విదేశాల్లో)కూడా ఆసక్తి రేకెత్తిస్తుందని ఆశించవచ్చు.'' అదేవిధంగా ప్రొఫెసర్ కె. సచ్చిదానంద మూర్తి బౌద్ధమతంపై ఉన్న ఈ భాగాన్ని ప్రత్యేకంగా ప్రశంసించారు. ''బి.ఎస్.ఎల్. హనుమంతరావు వ్రాసిన 'రెలిజి

యన్ ఇన్ ఆంధ్ర' (బుక్-II) అనే గ్రంథం అతి ప్రాచీనకాలం నుండి క్రీ.శ. 1325 వరకు ఆంధ్ర దేశంలోని బౌద్ధ మతాన్ని గూర్చి చాల చక్కగా వ్రాసిన ఉత్తమగ్రంథం.'' ఈ విధంగా పలువురి ప్రశంసలు పొందిన ఈ పరిశోధన గ్రంథం సత్యదృష్టిగల పాఠకులకు, పరిశోధకులకు నాటికీ, నేటికీ అంతే ఆసక్తిని కలిగిస్తోంది.

గ్రంథ ప్రారంభంలో ఆంధ్రలోని మత పరిణామాలకి ఉపోద్ఘాతంగా రచయిత తెలిపిన చారిత్రక ఆధారాలు, వాఙ్మయాధారాలు, పురావస్తు ఆధారాలు, భౌగోళిక వివరాలు, ఆంధ్రుల తొలి విశ్వాసాలు - ఆచారాలు, బ్రాహ్మణ మతప్రచారం, బ్రాహ్మణ మతంపై అసంతృప్తి, ఆందోళనలాంటివి వివరించడంద్వారా డా॥ బి.ఎస్.ఎల్. పాఠకుల్లో గ్రంథాధ్యయనంపై ఆసక్తి కలిగించారు. ఈ ఉపోద్ఘాతంలో ఆయన ఒక ఆసక్తికరమయిన అంశాన్ని ప్రస్తావించారు. బౌధాయన ధర్మ సూత్రంలో ఆర్యావర్తానికి అవతలవున్న దేశంలో చాతుర్వర్ణ్య వ్యవస్థ తెలియదని, అది మ్లేచ్ఛ దేశమని పేర్కొన్నట్టు ఒక శ్లోకాన్ని ఉదహరించారు. (చాతుర్వర్ణ్య వ్యవస్థానామ్ యస్మిన్ దేశే నవిద్యతె తమ్ మ్లేచ్ఛ విషయం ప్రాహు రార్యావర్తా దనంతరం, X, 43). చాతుర్వర్ణ్యం తెలియని ప్రాంతాన్ని మ్లేచ్ఛదేశంగా మనుస్మృతికారులు పరిగణించినట్టు తెలుస్తుంది. మ్లేచ్ఛుడంటే అంటరాని వాడనే అభిప్రాయం చదువుకున్న వారిలోనే చాలా ప్రబలంగా ఉంది. ఆ అభిప్రాయం తప్పని ఈ శ్లోకం నిరూపిస్తుంది. మ్లేచ్ఛుడు, శూద్రుడు అనే పదాలకు నిజమైన అర్థం తెలియని వాళ్ళుకూడా ఇరవై సంవత్సరాలుగా అధ్యాపకులుగా పనిచేస్తున్నారని ఆయన ఈమధ్య ఒక సభలో ప్రసంగిస్తూ బాధపడ్డారు. మన చరిత్రగూర్చి చరిత్రను బోధించే అధ్యాపకులకే సరియైన అవగాహన లేదని ఆయన ఆవేదన.

ఆర్యీకరణలో భాగంగా బ్రాహ్మణవర్గం స్థానికులైన ఆటవిక జాతులవారిని (ఎబోరిజినల్స్) చాతుర్వర్ణ్య వ్యవస్థలో చేర్చుకున్నది. అలా స్థానికుడైన పురోహితుణ్ణి బ్రాహ్మణుడి స్థాయికి, స్థానిక రాజుని క్షత్రియుడి స్థాయికి బ్రాహ్మణవర్గం చేర్చుకుంది. అందువల్ల జన్మతః బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు అనే విభజన అర్థరహితమని తేలుతుంది. తొలిదశలో ఆర్య సంస్కృతిని ఆమోదించిన వారిని వర్ణవ్యవస్థలోకి వారిస్థానిక స్థాయినిబట్టి ఏదో ఒక వర్ణంలోకి చేర్చుకున్నారు. అందువల్ల అన్ని వర్ణాలలోకి స్థానిక ఆటవిక జాతులవారు చేరిపోయారు. కాబట్టి ''బ్రాహ్మణులు పవిత్రులు కాదు; శూద్రులు అపవిత్రులుకాదు'' అనే చారిత్రక సత్యాన్ని ఆయన ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' (1970) నుంచి ''కుల వ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలు'' (1992) అనే ప్రసంగ వ్యాసంవరకు పదేపదే చెబుతూ వచ్చారు. వర్ణ వ్యవస్థ పవిత్రతను, శాస్త్రీయతను పటాపంచలు చేశారు. వర్ణవ్యవస్థ పునాదులకు వెళ్ళి పరిశీలిస్తే ఈ విభేదాలు, భేషజాలు, పట్టింపులు, వైషమ్యాలు అర్థరహితమని డా. బి.ఎస్.ఎల్. నిశ్చితాభిప్రాయం. సమకాలిక ఆంధ్రదేశంలో కులవ్యవస్థని ఇంత నిశితంగా పరిశీలించిన, పరిశోధించిన చరిత్రకారుడు మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. ఇలా కుల వ్యవస్థని మూలంనుండి విశ్లేషించి చూస్తే అది కూకటి వేళ్ళతో కూలిపోతుందని ఆయన ప్రగాఢంగా ఆశించారు.

ఉత్తర భారతంనుంచి దక్షిణ భారతదేశానికి బ్రాహ్మణమతం ప్రవేశించిన తర్వాత ఆర్యీకరణ జరిగింది. ఉత్తర భారత ప్రభావానికి గురయిన దక్షిణాది రాష్ట్రాల్లో ఆంధ్రదేశం మొదటిది. అందువల్లే ఆంధ్రరాష్ట్రం ఉత్తర భారత సంస్కృతికి, దక్షిణ భారత సంస్కృతికి

(ఆర్య-ద్రావిడ సంస్కృతులు) కేంద్రస్థానమయింది. ఆంధ్రదేశంలో బ్రాహ్మణ మతం పురోగమించి, స్థిరపడిన తర్వాత బౌధాయన, ఆపస్తంబులు దక్షిణ భారతంలోనే ధర్మ సూత్రాలు రచించారు. వీరిలో ఆపస్తంబుడు ఆంధ్రుడనే అభిప్రాయం బలీయంగా ఉంది. ''హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర'' రచించిన పి.వి. కానె ఆపస్తంబశాఖ దక్షిణా పథంలోనే పుట్టిందని, బహుశా ఆంధ్రదేశమే దాని జన్మస్థలమని అభిప్రాయపడ్డాడు. ఈవిధంగా ఆంధ్రలో ప్రచారమై బలపడ్డ బ్రాహ్మణ మతంపై ఉత్తర భారతంలో పెరిగినటువంటి అసంతృప్తి పెరిగింది. ఉత్తర భారతదేశంలో క్రీ.పూ. 6వ శతాబ్దం ఆధ్యాత్మిక అసంతృప్తి (Spiritual Unrest) కాలంగా పరిగణించబడింది. ఈ ఆధ్యాత్మిక అసంతృప్తి మనకు ఉపనిషత్తుల్లో, వివిధ దర్శనాల్లో ప్రతిబింబించింది. ఆ అసంతృప్తిలో భాగంగా ప్రజలు వైదిక కర్మకాండని, వర్ణ వ్యవస్థ ప్రామాణికతను, ఆధిక్యతని సందేహించడం, ప్రశ్నించడం ప్రారంభించారు. దాని ప్రతిధ్వనులు ఆంధ్రదేశాన్ని కూడా తాకాయనడంలో ఏమాత్రం అహేతుకత లేదంటారు బి.ఎస్.ఎల్. మగధలో మాదిరి ఆంధ్రదేశంలో కూడా బ్రాహ్మణ మతాన్ని దానిలో అంతర్భాగమైన ఖరీదైన కర్మకాండని, వర్ణ వివక్షతల్ని అంగీకరించని, ఆమోదించని ప్రజలు ఉన్నారు. ముఖ్యంగా నాగ, యక్ష తెగలు బ్రాహ్మణ సామాజిక వ్యవస్థపై తిరుగుబాటు ప్రకటించారు. అదేవిధంగా మేధారంగంలో కూడా అసంతృప్తి బయలుదేరింది. ఈ ఆధ్యాత్మిక అసంతృప్తిని సుత్తనిపాత, మహావంశ, మజ్జిమనికాయం వంటి బౌద్ధ గ్రంథాలు కథల రూపంలో గ్రంథస్థం చేశాయి. మజ్జిమనికాయంలో కోష్ఠిలుడు అనే బ్రాహ్మణ పండితుడి ఉదంతం ఒకటి ఉంది. దాని ప్రకారం - కోష్ఠిలుడు బుద్ధుడి ప్రధాన శిష్యుల్లో ఒకడైన సారిపుత్రిడి మేనమామ. బ్రాహ్మణమత సాహిత్యంలో గొప్ప పండితుడు. కాని దక్షిణాపథంలో లోకాయత సిద్ధాంతాన్ని అధ్యయనం చేయటానికి వస్తాడు. ఈ ఉదంతంద్వారా రెండు విషయాలు విశదమవుతున్నాయంటారు డా॥ బి.ఎస్.ఎల్. (1) కోష్ఠిలుడు ఉత్తర భారతంలో బ్రాహ్మణ సాహిత్యంలో సంపాదించిన పాండిత్యంతో అసంతృప్తి చెందాడు. (2) లోకాయతం వ్యవస్థీకృతమైన తొలిభారతీయ భౌతిక వాద చింతన. అది దక్షిణ భారతదేశంలో విస్తృతమైన ప్రచారంలో ఉంది. దక్షిణ భారతంలో కోష్ఠిలుడు దీర్ఘనఖ పేరుతో పరివ్రాజకుడిగా మారాడు. దీర్ఘనఖ ఉదంతం ద్వారా పరివ్రాజక సాంప్రదాయం దక్షిణా పథంలో బాగా ప్రచారంలో ఉందని, బ్రాహ్మణ వాదానికి వ్యతిరేకంగా అసంతృప్తి తీవ్రమయిందని తెలుస్తోంది. ఈ నేపథ్యంలో బౌద్ధం దక్షిణాపథంలో (ఆంధ్రలో) ప్రవేశించింది. అందువల్లనే డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు ఇలా అంటారు: "The discontent against Brahmanical System formed the background for the rise and spread of Buddhism" (బ్రాహ్మణమత వ్యతిరేక అసంతృప్తి బౌద్ధమతం_ఉదయించటానికి, వ్యాపించటానికి నేపథ్యంగా రూపొందింది). ఆంధ్రదేశంలో ప్రజల్ని ఆకర్షించిన మతం బౌద్ధం. దాదాపు వెయ్యి సంవత్సరాల (క్రీ.పూ. 400 - క్రీ.శ. 600) ఆంధ్రదేశ చరిత్రలో ఘనమైన స్థానాన్ని పొందింది. ఆంధ్రదేశంలో అది ప్రజాఉద్యమంగా, ప్రభంజనంగా వ్యాపించింది. ఆంధ్రదేశంలో బౌద్ధమత వ్యాప్తిలో కనిపించే ఆసక్తికర పరిణామం, అది రాజాదరణ లేకుండా స్వతంత్రంగా ప్రజాభిమానంతో ప్రజా ఉద్యమంగా వ్యాపించటమే నంటారు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు. నాటి శాసనాలవల్ల ఏ ఏ వర్గాలు విశేషంగా బౌద్ధాన్ని అభిమానించాయో తెలుస్తుంది. బౌద్ధాన్ని పోషించింది, ఆదరించింది రాజ్యాధిపతులు కాదు; సామాన్య ప్రజలు, స్త్రీలు, చేతి పనుల వాళ్ళు, వ్యాపార వర్గాలు. వీళ్ళ ఆదరణతో, అభిమానంతో ఆంధ్రదేశంలో బౌద్ధం మహోద్య

మంగా విరాజిల్లింది. బౌద్ధం ఇంత విశేషంగా ఆంధ్ర ప్రజల్ని ఆకర్షించటానికి ప్రధానకారణం, వారు ఆశిస్తున్న నూతన సామాజిక నిర్మాణం జాతి, మత, వర్ణ విభేదాలతో ప్రమేయం లేనిది దానిలో కనిపించటమే. ఆటవిక తెగలవారిలో, సామాజికంగా వెనుకబడిన వర్గాలలో సామాజిక ఊర్ధ్వ చలనానికి బౌద్ధం ఎంతో తోడ్పడింది. బౌద్ధం తర్వాత క్రీ.శ. 6-7 శతాబ్దాలలో ఆంధ్రదేశంలో ప్రవేశించిన జైనం కూడ సామాజిక ఊర్ధ్వ చలనానికి, పురోగమనానికి దోహదం చేసింది. అందువల్లనే స్త్రీలు, వ్యాపారస్థులు, సామాన్య ప్రజానీకం, చేతిపనుల వాళ్ళు బౌద్ధాన్ని స్వీకరించారు, అభిమానించారు, ఆదరించారు, అభివృద్ధి చేశారు. అమరావతి శాసనాల్లో ఒకదానిలో 'విధిక' అనే చర్మకారుడు వేయించిన దాన శాసనం లభించింది. ఆయన తన కుటుంబ సభ్యులతో బౌద్ధ స్థూపాన్ని సందర్శించి పూర్ణఘటంతో వున్న ఫలకాన్ని స్థూపానికి దానంచేశాడు. సమాజంలోని అట్టడుగు వర్గాల్ని బౌద్ధం విశేషంగా ఆకర్షించిందనటానికి ఇదే మంచి ఉదాహరణ. ఈనాటి కులవ్యవస్థ పరిభాషలో చెప్పాలంటే 'విధిక' చర్మకారుడు పంచమ కులస్థుడు. ఆంధ్రదేశంలో ఏ హిందూ దేవాలయానికి ఒక ''పంచముడు'' దానం చేసిన సంఘటన కనిపించదు. ఈవిధంగా బౌద్ధం ఆంధ్రలో బహుజనుల ఆదరణని, అభిమానాన్ని పొందింది.

ఆచరణలో బౌద్ధం అనే శీర్షిక క్రింద డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు బౌద్ధంలోని సర్వ సమభావాన్ని (కాస్మాపాలిటన్ స్పిరిట్) ప్రత్యేకంగా వివరించారు. బౌద్ధ క్షేత్రాలలో లభించిన శాసనాలలో వేటిలోకూడ కులాల ప్రస్తావనలేదంటారు. సర్వసమ భావాన్ని బౌద్ధం ప్రోత్సహించిందనటానికి చక్కని తార్కాణం 'విధిక' చర్మకారుడు వేయించిన దానశాసనం అంటారు. బౌద్ధ క్షేత్రాలకి బ్రాహ్మణులు చేసిన దానాలు దాదాపు కనిపించవని, ఒకే ఒక శాసనం శాలిహుండంలో మాత్రం లభించిందని పేర్కొంటారు. ఇదే విషయాన్ని ఇరవై సంవత్సరాల తర్వాత చేసిన ఒక ప్రసంగ వ్యాసంలో మరల ప్రస్తావించి ఇలా అన్నారు: ''అమరావతి, నాగార్జునకొండ మొదలైనవి చాలా ప్రాచీన బౌద్ధ క్షేత్రాలు. అమరావతిలో 150 శాసనాలు దొరికాయి. నాగార్జునకొండలో 70-80 శాసనాలు దొరికాయి. ఈ శాసనాలు వేటిలోకూడా కులాల గురించిన ప్రసక్తి లేదు. ఆఖరికి బ్రాహ్మణ అనే పదంకూడా మనకు కనిపించదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనేపదాలు ఏవీ ఈ శాసనాలలో కనపడవు. అయితే వాటికి చాలామంది దానధర్మాలు చేశారు. వాటిలో వృత్తిపరమైన పేర్లున్నాయి. ఇవి ఎంతవరకు? క్రీ.శ. మూడవ శతాబ్దంవరకు. ఈ క్రీస్తుశకం మూడవ శతాబ్దంవరకు ప్రజల్లో కులచైతన్యం (Cast consciousness) అనేది లేదు'' (కులాల పుట్టు పూర్వోత్తరాలు, కమ్యూనిజం ప్రత్యేక సంచిక, భారతదేశంలో కులవ్యవస్థ, పే.8, 1992). ఏమయినా బౌద్ధం సమాజంలోని పై వర్గాల, వర్ణాల ప్రజలకంటే క్రింది వర్ణాల, వర్గాల ప్రజల్నే అపరిమితంగా ఆకర్షించిందనటంలో సందేహంలేదు. అందువల్లనే పూర్వమీమాంస దార్శనికుడు కుమారిల భట్టు వేదాలకి అవతలవుండే చతుర్థ వర్ణం, క్రింది కులాల ప్రజల్నే బౌద్ధం విశేషంగా ఆకర్షించిందంటాడు.

మహాయాన బౌద్ధానికి ఆంధ్ర జన్మస్థానమని చెప్పడానికి ఎక్కువ చారిత్రక ఆధారాలు ఉన్నాయని, మహా సాంఘిక, చైత్యక సిద్ధాంతాలు క్రమంగా మహాయానశాఖ ఆవిర్భావానికి దారితీశాయవి, మహాయాన బౌద్ధులకు ప్రామాణిక గ్రంథమైన ''ప్రజ్ఞాపారమిత శాస్త్రం'' ఆంధ్ర బౌద్ధుల మేధాకృషి జనితమని డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు అభిప్రాయపడ్డారు.

మహాసాంఘిక బౌద్ధులకు ధాన్యకటకం (అమరావతి) ప్రధాన కేంద్రస్థానమని మహాసాంఘి కుల్ని స్థానికంగా చైత్యక వాదులనిపిలుస్తారని, వారే చారిత్రక బుద్ధుడికి 'లోకోత్తర' లక్షణాలు ఆపాదించి నైతిక ప్రవర్తనకు, స్వయం కృషికి ప్రాధాన్యతను ఇచ్చిన బౌద్ధంలో పూజా విధానాన్ని, ఆరాధనని ప్రవేశపెట్టి ఆకర్షణీయమైన మతంగా పెంపొందించారని కూడ ఆయన అభిప్రాయపడ్డారు. తర్వాత కాలంలో జరిగిన పరిశోధనలు ఆయన అభిప్రాయాల్ని బలపరు స్తున్నాయి. మహాయాన బౌద్ధాన్ని గొప్ప ప్రజాఉద్యమంగా పెంపొందించి, దానికొక మహత్తర మైన దార్శనిక వ్యవస్థను (మాధ్యమిక వాదాన్ని) అభివృద్ధి చేసినవాడు ఆచార్య నాగార్జునుడని అనేకమంది దేశ, విదేశీ పండితుల మాదిరి ఆయన అభిప్రాయపడుతున్నారు. భారతీయ చరిత్రలో నాగార్జునుడిది అద్వితీయమైన స్థానమని (unique place), ఆయన ఆంధ్రుడని డా॥ బి.ఎస్.ఎల్. అంగీకరించారు. నాగార్జునుడు దక్షిణాపథంలోని ''వేదలి'' ప్రాంతం వాడని లంకావతార సూత్రం పేర్కొంటుంది. వేదలి ఆంధ్రలోని ఒక గ్రామమని, ఆంధ్రలోని బ్రాహ్మణుల్లో 'వేదుల' అనే ఇంటిపేరు గలవారున్నారు అని అభిప్రాయపడ్డారు. ఆంధ్రలోని ఇంటి పేర్లలో చాలావరకు స్థలనామాలేనంటూ, తమ ఇంటిపేరు భట్టిప్రోలని, అదిచాల ప్రసిద్ధి చెందిన బౌద్ధ తీర్థమని పేర్కొన్నారు (My family name is Bhattiprolu, the famous Buddhist Thirtha, రెలిజియన్ ఇన్ ఆంధ్ర, పే.110) నాగార్జునుడు ఆంధ్రుడనే వాదాన్ని ప్రముఖ ఆంధ్రబౌద్ధ పండితుడు డా॥ జి.వి. కృష్ణారావు ''విగ్రహ వ్యావర్తని''ని (నాగార్జునుడి దార్శనిక గ్రంథాల్లో ముఖ్యమైనది) సంస్కృతంనుండి తెలుగులోకి అనువాదంచేసి, దానికి రాసిన ముందుమాటలో పేర్కొన్నారు. ఆయన అభిప్రాయంతో డా॥ బి.ఎస్.ఎల్. అంగీకరి స్తున్నారు. నాగార్జునుడి రచనల్లో ఆంధ్రలో బాగాప్రచారం పొందిన రచన ''సుహృల్లేఖ'' (స్నేహితునికి లేఖ) అని చైనా యాత్రికుడు ఇత్సింగ్ క్రీ.శ. ఏడవ శతాబ్దంలో ఆంధ్రదేశంలో పర్యటించినప్పుడు పిల్లలు దాన్ని కంఠస్థం చేస్తుందేవారని, పెద్దలు జీవితాంతం అధ్యయనం చేసే వారని వ్రాశారు.

నాగార్జునుడి తర్వాత ప్రసిద్ధుడైన మహాయాన దార్శనికుడు ఆర్యదేవుడు దక్షిణ భారతదే శస్థుడని, బహుశా ఆంధ్రుడయి వుండవచ్చునని అభిప్రాయపడ్డారు. ఈ ఇద్దరు మహాయాన దార్శనికుల్ని బ్రాహ్మణ మతస్థులు హత్య చేసారని డా॥ బి.ఎస్.ఎల్. గట్టిగా విశ్వసించారు. ఆయన తెలుగులో రాసిన ''ఆంధ్రుల చరిత్ర''లో నాగార్జున, ఆర్యదేవుల హత్యోదంతాన్ని వెల్లడించారు. ''కథా సరిత్సాగర గాథ విశ్వసనీయమే అయితే నాగార్జునుడొక కుట్రకు బలియైనాడు. అతని ప్రచారంతో బౌద్ధం కొత్త శక్తిని సంతరించుకొని విజృంభించడాన్ని సహించలేని బ్రాహ్మణ మతస్థులు అతని హత్యకు కారణమై యుండవచ్చు. అతని తర్వాత ఆచార్య పీఠాన్ని అలంకరించిన ఆర్యదేవుడు సయితం ఆంధ్రుడేకాని ఇతడు కూడ బ్రాహ్మ ణుల చేతుల్లో మరణించినాడు'' (పే. 87). ఇక్కడొక వాస్తవాన్ని మనం గుర్తించాలి. బౌద్ధం ఎన్ని శాఖలుగా చీలినా, ఎన్ని రూపాలు ధరించినా వర్ణవ్యవస్థను ఎట్టి పరిస్థితిలోను అంగీకరించలేదు. అందువల్లనే దార్శనికంగా నాగార్జునుడి శూన్యవాదం శంకరుని మాయావా దానికి మార్గదర్శి అయినా, సామాజికంగా బౌద్ధుల విప్లవాత్మక భావాల్ని బ్రాహ్మణమత ప్రతినిధియైన శంకరుడు అంగీకరించలేదు. సామాజిక సమానత్వాన్ని చివరివరకు ప్రచారంచే సిన బౌద్ధంలోని ఏశాఖయినా బ్రాహ్మణ మతస్థులకు ద్వేషం అవడంలో సందేహంలేదు. ఆకారణం వల్లే శంకరుడు తాత్వికంగా మాధ్యమిక వాదానికి (నాగార్జునుడికి) ఎంత

సన్నిహితంగా వచ్చినా, ఆ వాస్తవాన్ని తనరచనల్లో ఎక్కడా వ్యక్తీకరించకపోగా, వారిపై పసలేని వాదనల్ని ''బ్రహ్మ సూత్ర భాష్యం''లో చేశాడు.

ఆంధ్రలో బౌద్ధం కేవలం ప్రజా ఉద్యమంగా బయలుదేరి దాని సాంస్కృతిక, రాజకీయ చరిత్రను ప్రభావితం చేయటమే కాకుండా, బౌద్ధాన్ని దార్శనికంగా అభివృద్ధి చేసిన దార్శనికుల్ని తయారు చేసింది. ఈ బౌద్ధాచార్యులు ధార్మిక, దార్శనిక అధ్యయనంలోనేగాక లౌకిక విద్యలైన తర్కశాస్త్రం, రాజకీయ శాస్త్రం, వ్యాకరణం వంటి వాటిల్లోకూడా ఎక్కువ ఆసక్తి కనబరిచారని, నాగార్జునుని తర్కశాస్త్ర పితామహుడనవచ్చునని ''ఆంధ్రుల చరిత్ర''లో అభిప్రాయపడ్డారు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు. నాగార్జునుడు ''రత్నావళి''లో దేశ పరిపాలనకు సంబంధించిన అనేక విషయాల్ని చర్చించాడు. అంతేకాదు దానిలో నాగార్జునుడు శ్రేయోరాజ్య సిద్ధాంతాన్ని ఊహించాడని ఆయన అభిప్రాయపడ్డారు (Nagarajuna conceives a state just on the lines of Welfare State ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' పే. 107). నిజానికి నాగార్జునుడి ''సుహృల్లేఖ'', ''రత్నావళి''ని కౌటిల్యుడి ''అర్థశాస్త్రం'', ధర్మశాస్త్ర గ్రంథాల్ని తులనాత్మకంగా అధ్యయనం చేస్తే నాగార్జునుడెంత ఉదార మానవతావాదో శ్రేయోరాజ్య వాదో, కౌటిల్యుడు మనువు లాంటి ధర్మశాస్త్రకారులు ఎంతటి ప్రగతి నిరోధకులో, ప్రజా వ్యతిరేక ధోరణి గలవారో స్పష్టమవుతుంది.

చివరగా బౌద్ధం ఆంధ్రలో ఎందుకు క్షీణించిందో చర్చిస్తూ ప్రధాన కారణంగా బ్రాహ్మణ మతోద్ధరణను పేర్కొంటారు బి.ఎస్.ఎల్. బ్రాహ్మణ మతోద్ధరణతోపాటు దేశంలో సంభవించిన ఆర్థిక పరిణామాలుకూడా చాలావరకు కారణంగా పేర్కొనవచ్చునంటారు. అప్పటివరకు బౌద్ధాన్ని ఆదరించిన వైశ్యులు, చేతి పనులవారు, ఆర్థిక పరిణామాలవల్ల బాగా చితికిపోయారు. అందువల్ల బౌద్ధానికి ఆర్థికంగా అండగా ఉన్నవర్గాలు బలహీన పడటంతో బౌద్ధానికి ఆదరణ తగ్గింది. దానితోపాటు బౌద్ధంలో అంతరంగికంగా సంభవించిన మార్పులు కూడ బౌద్ధం క్షీణించటానికి, హిందూమతం పైచేయి కావడానికి దోహదం చేశాయి. ఇక్ష్వాకుల తర్వాత శ్రీపర్వత ప్రాంతంలో రాజ్యపాలన చేసిన పల్లవులు బౌద్ధానికి బద్ధ శత్రువులుగా పరిణమించారు. త్రిలోచన పల్లవుడు బౌద్ధ, జైన మతాల విధ్వంసకుడిగా, వైదికమత పరిరక్షకుడిగా చరిత్రకారులు భావిస్తున్నారు. త్రిలోచన పల్లవుడు ధాన్యకటకాన్ని (అమరావతి) రాజధానిగా చేసుకొని ఉత్తర భారతంలోని అనేక బ్రాహ్మణ కుటుంబాల వారిని తన రాజ్యంలో స్థిరపడవలసిందిగా కోరాడు. పల్లవ రాజుల్లో త్రిలోచనుడు, సింహవర్మ నాగార్జునకొండ, ధాన్యకటకాల్లో బౌద్ధానికి చాలా నష్టం కలిగించారు. అదే సమయంలో హిందూమతంలో కూడా అనేక మార్పులు సంభవించాయి. హిందూమతంలో ఆస్తిక ధోరణి ప్రబలింది. దేవాలయం హిందూ మతానికి కేంద్రమయింది. బ్రాహ్మణ మతానికి బౌద్ధం ప్రధాన సమస్యగా పరిణమించిన ఈదశలో హిందూమత పరంగాకూడా కొన్ని పరిణామాలు అనివార్యమైనాయి. ఈ పరిణామాల్ని ''ప్రాచీన భారత మత సంప్రదాయం'' (భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన, ప్రథమముద్రణ, 1993, పేజీలు 31-41) అనే వ్యాసంలో ప్రతిభావంతంగా చర్చించారు బి.ఎస్.ఎల్. అబ్రాహ్మణ మతమైన భాగవత మతంతో రాజీపడి, బౌద్ధాన్ని ప్రతిఘటించడానికి బ్రాహ్మణమత సంస్కరణోద్యమం ప్రారంభించారు. దానిలో భాగంగా అబ్రాహ్మణుడైన వాసుదేవుడు రచించిన ''గీత''ను బ్రాహ్మణ సంస్కర్తలు స్వీకరించారని చెబుతూ, ఒక ఆసక్తికరమయిన విషయాన్ని మన దృష్టికి తెచ్చారు -

"వాసుదేవుడు రచించిన 'గీత' మొదట్లో చాలా చిన్నగ్రంధం. అది అవైదికము - అబ్రాహ్మణము, దాన్ని ఆర్య పూజారి వర్గం నిషేధించినట్లు సయితం తెలుస్తుంది" (పే. 38) వేదు "భగవద్గీత" ని పరమపవిత్ర గ్రంథంగా భావించేవారికి ఈ మాటలు ఆశ్చర్యకరంగా కనిపించవచ్చు. కాని పూజారివర్గం చరిత్ర తెలిసినవారికి ఇది ఆశ్చర్యపడాల్సిన విషయం మాత్రం కాదు. చరిత్రలో తమకు వ్యతిరేకమైన వాటినికూడ అనుకూలంగా మార్చుకొని ముందుకు సాగించింది కాబట్టే పూజారివర్గం నేటికికూడా తమ ఆధిపత్యాన్ని ఏదోరూపంలో కొనసాగిస్తూనే ఉంది. ఈ సమయంలోనే వివిధశాఖలమధ్య విభేదాలు, వైషమ్యాలు పెరిగి బౌద్ధం సంఘాన్ని బలహీన పరిచాయి. తాంత్రిక, వజ్రయాన పద్ధతులు ప్రబలటంతో ప్రజల దృష్టిలో బౌద్ధానికి విలువ తగ్గింది. నైతికంగా నీరసించి ప్రజాదరణ కోల్పోయింది. అంతేకాకుండా బ్రాహ్మణ మతస్థులు, జైనులు బౌద్ధులపై సిద్ధాంతపరమైన దాడి ప్రారంభించారు. కుమారిల భట్టు, శంకరుడు బౌద్ధులపై దాడిచేయడంలో ప్రసిద్ధి చెందారు. కుమారిలభట్టు "శ్లోక వార్తికం"లో, శంకరుడు "బ్రహ్మ సూత్ర భాష్యం"లో బుద్ధుడిపై దాడిచేశారు. ఆయన్ని ప్రజా వ్యతిరేకిగా చిత్రించారు. అదేవిధంగా అగ్ని, విష్ణు పురాణాలుకూడా బుద్ధుడ్ని హీనంగా చిత్రించాయి. మధ్యయుగంలోని ధర్మశాస్త్రాలు, ముఖ్యంగా "స్మృత్యర్థసారం" బౌద్ధుల్ని అస్పృశ్యుల్లో చేర్చింది. "యాజ్ఞవల్క్యస్మృతి" బౌద్ధుల్ని కలలో చూడటంకూడా అనర్థదాయకమని, అపవిత్రమని పేర్కొంది. ఈవిధంగా బౌద్ధంపై అనేక పద్ధతుల్లో దాడులు జరిగాయి అని, చివరగా మల్లికార్జున పండితారాధ్యుడి వీరశైవ ఉద్యమంవల్ల బౌద్ధం పూర్తిగా అంతరించిందని డా. బి.ఎస్.ఎల్. వెల్లడించారు. బహిరంగ వాదనల్లో బౌద్ధుల్ని ఏదోవిధంగా ఓడించి, వారిని శారీరకంగా హతమార్చడం మల్లికార్జున పండితారాధ్యుడి కాలంలో జరిగింది. దీనితో బౌద్ధం మరల కోలుకోలేకపోయింది. ఈ విధంగా ఆంధ్రలో బౌద్ధం ఆవిర్భవించింది, గొప్ప ప్రజాఉద్యమంగా కొనసాగి, కొన్ని శతాబ్దాల తర్వాత దేశంలో సంభవించిన ఆర్థిక, రాజకీయ పరిణామాలు, బౌద్ధంలో అంతరంగిక మార్పులు, వైదిక మతాచార్యుల దాడులవల్ల పూర్తిగా క్షీణించిపోయింది. కనీసం చారిత్రక శిథిలాలుగానయినా మిగిలిపోవాల్సిన బౌద్ధ స్థూపాలు, ఆరామాలు శైవాలయాలుగా రూపొందాయి. పంచారామాలుగా ప్రసిద్ధి చెందిన శైవాలయాలు బౌద్ధ స్థూపాలపైన నిర్మించబడ్డాయనే అభిప్రాయం చరిత్రకారులలో చాలా బలీయంగా ఉంది. ఈవిధంగా "రెలిజియన్ ఇన్ ఆంధ్ర"లో డా॥ బి.ఎస్.ఎల్. ఆంధ్రలో మత పరిణామాలలో అంతర్భాగంగా బౌద్ధ ధర్మాన్ని చిత్రించారు.

ఆయన రచనల్లో, "రెలిజియన్ ఇన్ ఆంధ్ర" తర్వాత పేర్కొనాల్సిన మరొక గ్రంథం "ఆంధ్రుల చరిత్ర". 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సందర్భంలో తొలిముద్రణ వెలువరించారు. ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగార్ల ప్రోత్సాహంతో 1956లో రచించిన ఈ గ్రంథాన్ని తర్వాత కాలంలో వెలువడిన నూతన పరిశోధనా ఫలితాల వెలుగులో మరోసారి పాత భావాల్ని సమీక్ష చేసుకొని, సర్వ సమగ్రంగా 1983లో కొత్త గ్రంథంగా వెలువరించారు. ఇదికూడా పలువురి ప్రముఖుల ప్రశంసలు, పత్రికల అభిమానాన్ని సంపాదించింది.

చరిత్ర రచనలో కులమత తత్వాలకు ప్రాధాన్యత నివ్వకుండా, మానవతా వాద దృష్టితో చరిత్ర రచనకు అంకితమయిన చరిత్రకారుడు డా॥ బి.ఎస్.ఎల్. అవడానికి మరొక ఉదాహరణ "ఆంధ్రుల చరిత్ర". శాత వాహన యుగంనుండి కుతుబ్ షాహీ యుగం వరకు

జరిగిన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక పరిణామాల్ని ఇందులో ఆయన ప్రతిభావంతంగా చర్చించారు. చరిత్ర రచనలో సంకుచిత భావాలకు ప్రాముఖ్యమివ్వకుండ, సత్యాన్వేషణ దృష్టితో, విమర్శనాత్మక దృష్టితో ఆంధ్రుల చరిత్రను పరిశీలించారు అని చెప్పడానికి చక్కని ఉదాహరణ ''కాకతీయ యుగం - మత సాంఘిక పరిస్థితులు'' శీర్షికలో చర్చించిన విషయాలు. నేడు హిందూ మతోన్మాదులు, ముస్లింలు హిందూ దేవాలయాల్ని విధ్వంసం చేయడానికి ప్రధాన కారణంగా హిందూమత వ్యతిరేకత, ద్వేషమే కారణమని చిత్రిస్తూ, ప్రజాజీవనంలో ఒకరిపై ఒకరికి పరస్పరం అపోహలు ఏర్పడేటట్లు చరిత్రను చిత్రిస్తున్నారు. ఇది చాలా ప్రమాదకరమైన ధోరణి. ఈ ధోరణి ఎంత పొరపాటో కాకతీయ యుగంలోని దేవాలయాల గూర్చి డా॥ బి.ఎన్.ఎల్. అన్నమాటలు చదివితే తెలుస్తుంది. ''ఆలయాలు బ్యాంకులుగా, నాటకశాలలుగా, ప్రదర్శన శాలలుగా, వర్తక శ్రేణులకు కార్యస్థానాలుగా ఉపకరించేవి. ఇన్ని విధాల ఐశ్వర్యవంతమైన ఆలయంచుట్టూ సామాజిక కార్యక్రమాలు అల్లుకొని వున్నందునే ముస్లింలు ఆలయాలపై దృష్టి కేంద్రీకరించారు. ఆలయ విధ్వంసంతో సామాజిక జీవితం విచ్ఛిన్నమై దేశాక్రమణ సులభం కాగలదని వారి ఉద్దేశమయి వుంటుంది'' (పే. 281). అంటే ముస్లింలు కేవలం మత వ్యతిరేకతతో హిందూ దేవాలయాల్ని పడగొట్టలేదని, ఆ విధ్వంసంవెనుక సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలు ప్రధానపాత్ర వహిస్తున్నాయని గ్రహించగలం. క్రీ.శ. 12 శతాబ్దంనుండి ''శూద్ర'' కులాలు (రెడ్డి-వెలమ-కమ్మ-కాపు) ఆంధ్రదేశ రాజకీయ, సామాజిక జీవితాన్ని ప్రభావితం చేస్తున్నాయి. కాకతీయుల కాలంలో ఈ వ్యవసాయ కులాలమధ్య జరిగిన ఘర్షణలు ఆ రాజ్య పతనానికి దారితీశాయి. ఈ కులాలమధ్య వైషమ్యాలు ఆ రాజ్య విచ్ఛిత్తికి ఎలా దోహద పడ్డాయో ఇలా వివరించారు : ''రాజకీయంగా ప్రాముఖ్యం వహించిన రెడ్డి, వెలమ కులాలమధ్య అధికారానికై పోటీ ప్రారంభమయింది. ఈ వర్ణాలు కాకతీయుల పతనానంతరం కూడ పరస్పరం యుద్ధాల్లో మునిగి బహమనీ రాజ్య విస్తరణకు అవకాశం కల్పించడం శోచనీయం'' అని ఆయన వ్యాఖ్యానించడం ద్వారా కులతత్వం యుగయుగాలుగా దేశ సమైక్యతకు ఎంత ఆటంకంగా, అడ్డంకిగా తయారయిందో నిరూపించగలిగారు. ఆంధ్రదేశ చరిత్రలో ఇది ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన యుగం. ఈ యుగంలో కులం ఎటువంటి పాత్ర నిర్వహించిందో, అదేవిధమైన పాత్ర నేడు ఆంధ్రదేశంలోను, జాతీయ జీవన స్రవంతిలోను నిర్వహిస్తోంది. ఇప్పటికయినా ప్రగతిని కాంక్షించేవారు, దేశ సమైక్యతను ఆశించేవారు కళ్ళు తెరచి గతచరిత్రనుంచి గుణ పాఠాలు నేర్చుకోకపోతే మరోసారి దేశానికి అనర్థం తప్పదేమో!! ఇలా గత చరిత్రనుంచి విలువైన పాఠాలు నేర్చుకొని, సంకుచిత భావాలకు అతీతమైన మానవ సమాజం నిర్మించుకోవడానికి కావాల్సిన నైతిక శక్తిని డా॥ బి.ఎన్.ఎల్. హనుమంతరావు పరిశోధనలు, రచనలు అందిస్తాయనడంలో సందేహంలేదు. ★

- టి. రవిచంద్

ఆంధ్రపత్రిక - 7 జూన్ 1981 ఆదివారం

# చరిత్రకు అంకితమైన మనీషి

డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకు రానట్టి పాడుకాలాన పుట్టినవారు కీర్తిశేషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. డిగ్రీలు ఉండికూడా పాండిత్యం వన్నెకు రానట్టి మరీ పాడుకాలాన బుట్టిన వారు శ్రీ భట్టిప్రోలు శ్రీలక్ష్మీ హనుమంతరావు గారు. విద్యార్థిలోకంలో వీరు బి.యన్.యల్. గానే ప్రసిద్ధులు. చరిత్ర పరిశోధనయే తపస్సుగా చరిత్ర బోధనయే ఊపిరిగా జీవితం గడుపుతున్నవారు డా. బి.యన్.యల్. షష్ఠిపూర్తి సమీపిస్తూ అనారోగ్యంతో బాధపడుతూ చరిత్ర పరిశోధనకై అహరహము శ్రమిస్తున్న కర్మవీరుడాయన.

'ప్రాచీనాంధ్ర చరిత్ర', 'తెలుగు దేశంలో వివిధమత వికాసం' అనేవి హనుమంతరావుగారి పరిశోధనలకు నోచుకున్న విషయాలు. శాతవాహన చరిత్ర వీరికి మిక్కిలి అభిమాన పాత్రమయింది. ఉత్తర శాతవాహన యుగంలో విలసిల్లిన ఇక్ష్వాకులు, పల్లవులు, ఆనంద గోత్రీకులు, విష్ణుకుండినులు మున్నగు వారి చరిత్రలో అనేక నూతన విషయాలను వీరు వెలికి తెచ్చారు. ఉదాహరణకు శ్రీ పర్వతస్వామి తక్కిన చారిత్రకులు భావించినట్లు శివుడుకాడనీ విష్ణుమూర్తి అవతారమైన బుద్ధుడే అని వీరు సిద్ధాంతీకరించారు. అలాగే విష్ణుకుండినుల రాజధాని వెట్టూరు మాత్రమే అనీ, అమరావతి కాదనీ ఆనాటి అమరావతికి ఆ పేరు లేదని వీరు యుక్తియుక్తముగా నిరూపించారు. ఇటీవల అమరావతి క్షేత్ర పునరుద్ధరణ కార్యక్రమంలో వెలువడిన పురావస్తువులను నిశితంగా పరిశీలిస్తూ అక్కడ విలసిల్లిన బౌద్ధ సంస్కృతిని గూర్చి పరిశోధనలు జరుపుతున్నారు. అంతేకాదు, క్షేత్రం అడుగున ముఖ్యంగా వేదికక్రింద, ఎన్నెన్నో బౌద్ధ శిల్పశేషాలు మరుగునపడి ఉన్నాయని వాటిని త్రవ్వి తీసి ప్రపంచానికి ప్రదర్శించవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నదని వీరు పలుమారులు పత్రికలలో ప్రకటించారు.

విద్యార్థి దశనుండి హనుమంతరావుగారు మానవతావాదిగా ప్రముఖ రాయిస్ట్‌గా పేరొందారు. ఎం.ఎన్.రాయ్ గ్రంథాలను కొన్నింటిని తెనిగించారు కూడా. హేతువాదులైన డా. బి.యన్.యల్. చరిత్ర పరిశీలన కూడా హేతుబద్ధమైనట్టిది. బౌద్ధమతం వీరికి మిక్కిలి అభిమాన పాత్రమయినది. 'రెలిజియన్ ఇన్ ఆంధ్ర' అన్న గ్రంథం వీరికి డాక్టరేట్ పట్టా కట్టబెట్టింది. ఈ గ్రంథంలో వీరు ఆంధ్రదేశంలో అనాదినుండి విలసిల్లిన వివిధ మతాల క్రమవికాసం గురించి విపులంగా చర్చించారు. వీరు వ్రాసిన ఆంధ్రుల చరిత్ర రచన సాటిలేనిది. ఈ గ్రంథం పునర్ముద్రణ పొందబోతోంది. శాతవాహనుల చరిత్రపై ఇంగ్లీషు భాషలో ప్రత్యేకంగా గ్రంథాన్ని వీరు వెలువరించారు. ఇవికాక వీరి రేడియో ప్రసంగాల సంకలనం ముద్రణలో ఉంది.

హనుమంతరావుగారి చారిత్రక దృక్పథం వలనే వ్యక్తిత్వం కూడా విలక్షణమైనది. విశిష్టమైనది. వీరు 1924లో గుంటూరు జిల్లా దోనేపూడి గ్రామంలో మాతామహుల ఇంట

జన్మించారు. వీరి తండ్రిగారు మూల్పూరు గ్రామకరణంగా పనిచేస్తూ ఉండేవారు. శ్రీ భట్టిప్రోలు వారి ఉన్నత విద్యాభ్యాసం అంతా గుంటూరులో గడిచిపోయింది. హిందూకాలేజిలో ఇంటర్ చదివేటప్పుడు శ్రీ మారేమండ రామారావుగారూ, ఏ.సి. కాలేజిలో బి.ఎ. చదివేటప్పుడు ప్రిన్సిపాల్ సైప్స్ దొరగారూ హనుమంతరావుగారికి పెక్కు రీతుల స్ఫూర్తి కలిగించి చరిత్ర పరనంపై అభిరుచిని పెంపొందించారు. ఆంధ్రా యూనివర్సిటీ తాత్కాలికంగా గుంటూరుకు తరలిన తరుణంలో శ్రీయుతులు మల్లపల్లి సోమశేఖర శర్మ, గొర్తి వెంకటరావు, ఓరుగంటి రామచంద్రయ్యగార్ల వంటి ఉద్దండులకు శిష్యులై వీరు ఎం.ఎ. (హిస్టరీ) పట్టం పొందారు. తమ గురు పరంపరని తలచి గర్విస్తారు శ్రీ భట్టిప్రోలువారు. ముఖ్యంగా 'ఎపిగ్రఫీ'లో తమకున్న ప్రవేశం అంతా మల్లంపల్లివారి భిక్షయే అని సవినయంగా చెప్పుకుంటారు.

శ్రీ హనుమంతరావుగారు విద్యాభ్యాసం పూర్తిచేసి 1951లో గుంటూరు హిందూకళాశాల చరిత్ర శాఖలో అధ్యాపకులుగా చేరారు. అప్పటినుండి మూడు దశాబ్దాలుగా అక్కడే చరిత్ర అధ్యాపకులుగానూ, చరిత్ర శాఖాధ్యక్షులుగానూ పనిచేస్తూ ఉన్నారు. వీరి గురువులైన మారేమండ రామారావుగారు 'ఎమిరటస్' ప్రొఫెసరుగా తమకు సహచరులై హిందూ కాలేజిలో పనిచెయ్యటం తమ అదృష్టంగా భావిస్తారు వీరు.

ఈ మూడు దశాబ్దాలలోనూ శ్రీ బి.యస్.యల్. ఎందరెందరో విద్యార్థులకు చరిత్రపై చెరిగిపోని అభిమానం కలిగించారు. వారి తరగతులు తరచు చర్చావేదికలుగా ఉండేవి అనటం అతిశయోక్తి కాదు. విద్యార్థులలో స్వతంత్రమైన ఆలోచనా ధోరణులు ప్రేరేపించటం వీరికి చాలా ఇష్టం. వీరి శిష్యసంతానం చాలా కాలేజీలలో చరిత్ర అధ్యాపకులుగా పనిచేస్తూ ''దీపంబు వలన ఒండొక దీపంబు ప్రభవిల్లినట్లు'' వెలుగొందుతున్నారు. డా. బి.యస్.యల్. అసంఖ్యాకములైన హిస్టరీ కాంగ్రెసులలో పాల్గొని వివిధ విషయాలపై పరిశోధక వ్యాసాలు చదివి యువచరిత్రకారులకు మార్గదర్శకులై నిలిచారు.

హనుమంతరావుగారికి ఆంధ్ర చరిత్రపైననే గాక ఆంధ్ర భాషపై కూడా మక్కువ ఎక్కువ. విద్యార్థిగా ఉండే రోజుల్లో పద్యరచన చేస్తూ ఉండేవారు. అష్టావధానాలు కూడా చేసారని వినికిడి. ఆంధ్రాంగ్లభాషలపై వీరికి గల సమానమైన అధికారం వీరి ఉపన్యాసాలలో ప్రస్ఫుటమవుతుంది. గంటలతరబడి అనర్గళంగా, అర్థవంతంగా ఆకర్షణీయంగా ఉపన్యసించగల నేర్పు వీరిసొత్తు. తమ ఉపన్యాసాలలో, మతాలను చారిత్రాత్మక దృక్పథంతో వివరించి విమర్శించటం వీరి ప్రత్యేకత. వీరి విమర్శలు ఒక్కొక్కప్పుడు బాధాకరంగా తోచవచ్చు. కాని అందులోని వాదపటిమ, హేతు బద్ధత ఎవరూ కాదనరానివి.

ఎల్లవేళలా హసన్ముఖంతో విద్యార్థులను అమితంగా ఆకర్షించిన వారి ఆకృతి నేడు అనారోగ్యం కారణంగా వన్నెతగ్గినా, వారి బోధనా సామర్థ్యంగానీ పరిశోధనా పాటవంగానీ అణుమాత్రమైనా కుంటుపడలేదు. చరిత్రకే జీవితాన్ని అంకితం చేసిన ఈ మహా మనీషి ప్రజ్ఞ ఆంధ్రదేశానికి ఇంకా వినియోగపడాల్సి ఉంది.

**- పులిచెర్ల సుబ్బారావు**

# PROFESSOR B.S.L. HANUMANTHA RAO

## (1924-93)

Historian, radical humanist and a critic, Professor B.S.L. Hanumantha Rao was born in Donepudi Village of Tenali Taluq (Guntur District, Andhra Pradesh) on 4th January, 1924. He completed his school education at Turimella High School and College education at A.C. College (Guntur) and Hindu College (Guntur). He received his M.A. degree in History from Andhra University. He was awarded Ph.D. for his thesis "Religion in Andhra" by University of Karnataka (Dharwad) in 1969.

Professor Hanumantha Rao started his career as a teacher in Kuchipudi Village. He joined Hindu College (Guntur) in 1951 as a Lecturer in History and became the Head of the Department in 1974 and continued in the post till his retirement in 1983. He worked as an honorary Professor in the Department of Buddhist Studies, Nagarjuna University, from 1983 to 1987. During his tenure at Nagarjuna University, Professor Rao put all his efforts to develop the Department. Several research scholars completed their higher research degrees under his careful supervision.

Professor Hanumantha Rao was continuously engaged in the historical research and published several books on various aspects of Indian History and History of Andhra Pradesh. Having worked on "Religion in Andhra" for his Doctoral Thesis, he had brought out six works in English and Telugu which include *Indian History and Culture (3 Vols), Srisailam - History and Culture and History of Andhras.* Besides, he had also translated five major works on history which include *Lokayata, Ashoka and the Decline of the Mauryas* and *From Savagery to Civilization.* Most of his papers published in research journals deal with religious history of Andhra Pradesh through millennia. His unpublished works include "Buddhist Inscriptions of Andhradesha" and "Social Mobility in Medieval Andhra" in English and "Buddhist and Jaina Religions in Andhradesha" in Telugu.

Professor Hanumantha Rao was actively associated with a number of associations connected with History and attended several conferences and seminars of Indian History Congress, Indian Epigraphical Society, Indian Numismatic Society, Andhra Pradesh History Congress. He was the President of the Ancient Indian History Section of the 53rd Session (1992-93) of Indian History Congress held at Warangal in February, 1993. The Andhra Pradesh History Congress owes very much to Professor Rao. He served the Andhra Pradesh History Congress in various capacities and from 1985 till his death he was the Vice-President of the Congress. He lent his full support and cooperation for the growth and development of this Congress. He was also the General President of the 13th Session of the Andhra Pradesh History Congress held at Srisailam in 1989.

"Kunda Kunda Jnanapitha", Indore, felicitated him on 6th June, 1993 for the services rendered by him to the Historical Research. But unfortunately, on his way back to Guntur, Professor Rao died of cardiac arrest at Hyderabad on 8th June, 1993.

Professor Hanumantha Rao, who always tried to reconstruct history on scientific lines, rightly deserves a place among the great Andhra Historians such as Chilukuri Veerabhadra Rao, Mallampalli Somasekhara Sarma. Nelaturi Venkataramanaiah and other. His sudden demise is really a set back to Indian Historical research.

- M. SOMASEKHARA RAO

# ఆచార్య బి.యస్.యల్. హనుమంతరావుగారి గ్రంథావళి

స్వయరచనలు :

ముద్రితాలు : ఆంగ్లం

1. Religion in Andhra (Dept. of Archaeology & Museums, Govt. of A.P.)
2. Indian History & Culture (in III Volumes)
3. Guntur through Ages (A.I.C.C. Session, Guntur 1964)
4. Age of Satavahanas (A.P. Sahitya Academy, Telugu University)
5. Srisailam History & Culture (Telugu University)
6. Modern Europe (Guide book for Students)

తెలుగు :

1. ఆంధ్రుల చరిత్ర (విశాలాంధ్ర ప్రచురణాలయం)
2. విజయవాణి (రేడియో ప్రసంగాలు)
3. ఆంధ్రలో సామాజిక చలనం (Original in English) 'విశాలాంధ్ర ప్రచురణాలయం'
4. ప్రణయాంజలి (ఖండకావ్యం)
5. డిగ్రీ, ఇంటర్, మెట్రిక్ ఇతర తరగతులకు పాఠ్యపుస్తకాలు.

అముద్రితాలు :

1. Essays on Social Mobility in Mediaeval Andhra.
2. Buddhist Inscriptions of Andhra Desa.
3. ఆంధ్రదేశంలో బౌద్ధజైన మతాలు (ముద్రణలో, తెలుగు అకాడమీ)
4. బౌద్ధము - ఆంధ్రము (వ్యాస సంకలనము)

అనువాదాలు :

1. యం.యన్. రాయ్ స్వీయగాథలు (ప్రజాసాహిత్య పరిషత్తు)
2. అశోకుడు - మౌర్యవంశ క్షీణత (విశాలాంధ్ర ప్రచురణాలయం)
3. లోకాయతవాద పరిశీలన (విశాలాంధ్ర ప్రచురణాలయం)
4. గతాన్ని గురించిన అపోహలు (విశాలాంధ్ర ప్రచురణాలయం)
5. మానవ నాగరికత (ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై.) లిమిటెడ్

వివిధ సంచికలలో పత్రికలలో ఆంధ్రాంగ్లాలలో ప్రచురింపబడిన పరిశోధనాత్మక, జనరంజక వ్యాసాలెన్నో... రేడియో ప్రసంగాలు, వేదికలపైని ఉపన్యాసా లెన్నెన్నో...



జీవిత సంగ్రహము

జననము : 4-1-1924 దోనేపూడిలో

ాల్యం, విద్యాభ్యాసము : మూల్పూరు, తురిమెళ్ల, తెనాలి

కళాశాలవిద్య : గుంటూరులో

ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి M.A. B.Ed..

కర్నాటక విశ్వవిద్యాలయం నుండి Ph.D.

ధ్యాపన 1946 నుండి : తెనాలి, కూచిపూడి హైస్కూళ్లలో<br>గుంటూరు హిందూకళాశాలలో

87 నాగార్జున విశ్వవిద్యాలయం బౌద్ధపీఠంలో ఆచార్యత్వం

నిర్యాణము : 8-6-1993